మా నవంబరు సంచిక

# దీపావళి ప్రత్యేక సంచికగా

అక్టోబరు 17వ తేదీకే వెలువడుతుంది

మీ కాపీ కోసం మీ వూరి ఏజంటును అడగండి

వెల రు 3-00

## యువ కార్యాలయం.

వ్యాపార నిలయం B-1-194 సైఫాబాద్,

హైదరాబాద్ - 4.




'యువ' నా అభిమాన పత్రిక. యువలో మీరు ప్రచురిస్తున్న కుమారి కె. కౌసల్యాదేవిగారి 'చక్రనేమి' సీరియల్ చాలా రసవత్తరంగా సాగుతున్నది. మధ్య మధ్య నున్న కార్టూనులు కడుపుబ్బ నవ్విస్తున్నవి. ఆగస్టు నెల యువలో విశ్వామిత్ర - మేనక ముఖ చిత్రం చాలా ఆకర్షణీయముగా ఉన్నది. విజ్ఞానము, వినోదము అన్నీ యువలో అందిస్తూన్నందుకు సంపాదకులకు నా అభివందనములు.

యస్. సుజాత,
దేవరకొండ.

ఆగస్టు సంచిక మధ్యపేజీలో వేసిన కీలుబొమ్మ చాలాబాగుంది. ఆ బొమ్మ వేసిన వడ్డాదిగారికి మా ధన్యవాదాలు. మరియు శ్రీ విలాస్‌గారు రచించిన "తోడునీడలు" చాలా బాగుంది.

రామరాజశేఖర సుదర్శనపాత్రో,
రాయఘడ.

వడ్డాది పాపయ్యగారు చిత్రించిన "తలుపుచాటు" చిత్రం మనోహరముగా వున్నది. గొట్టుముక్కల సూరిగారి "ప్లాట్‌లో అమ్మాయి" చాల పట్టుతో సాగినకథ. చాలా బాగుంది. యువ సచిత్ర మాసపత్రిక చదువుతూంటే ఊర్ధ్వలోకాల్లోకి పోయినట్లె వుంటుంది. కోడూరి కౌసల్యాదేవిగారి "చక్రనేమి" సీరియల్ చాలా చురుకుగా సాగుచున్నది.

జె. వి. యల్. యన్. శాస్త్రి.
విశాఖ_7.

ఈ నెల అట్ట మీద బొమ్మ "విశ్వామిత్ర — మేనక" బొమ్మ చాలా ఆకర్షణీయంగా ఉన్నది. ప్లాట్ లో అమ్మాయికథ "రోమియో"లకు బుద్ధి గరుపుతుంది. "నేటి సంఘంలో స్త్రీ స్థానం" చాల బాగుంది. అట్ట చివరిబొమ్మ "మేలిముసుగు" చాల బాగుంది.

*తులసీ పురుషోత్తం,*
మద్రాసు—1.

యువపైగల అభిమానంతో చాలా కాలం విడి ప్రతులు కొని విసిగి ఏకంగా రెండేళ్ళకు చందా కట్టాను. చక్రనేమి పరమశివుని శిరముపై గల చందమామ వలె మైమరపు గొల్పుతూంటే, నేనూ—నా కథా, తోడు నీడలు, ప్లాట్ లో అమ్మాయి కథలు శూల, సారంగ, ఢమరుకాలను స్ఫురణకు తెస్తుంటే "రొట్టె ముక్క" కథ 'హాలాహలం'లా గున్నది. వ. పా. గారి వర్ణచిత్రాలు "యువ" కు అలంకారాలు.

*"శిరం చంద్రగుప్త"*
కొల్లూరు.

ఆగష్టునెల 'యువ' యందు ముఖ చిత్రంగా వేసిన 'విశ్వామిత్ర— మేనక' చాల బాగుంది. దానికి వేసిన రంగులు కూడా రమణీయంగా ఉన్నవి. "తోడు నీడలు", "మూగవీణ," "ఆఖరి రోజు," "ప్లాట్ లో అమ్మాయి" అనే కథలు చాల బాగున్నాయి, 'ఆవిష్కరణ' అనే డుంబు బొమ్మల కథ నవ్వొచ్చేలా గుంది.

*గుండుమళ్ళ వెంకటరామరావు*
శ్రీకాకుళం.

# యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 8 సెప్టెంబరు 1963 సంచిక 3


నెహ్రూ మంత్రివర్గం మీద కమ్యూనిస్టేతర ప్రతిపక్షాలు అవిశ్వాస తీర్మానం ప్రతిపాదించటమూ, తీవ్ర చర్చా నంతరం, అత్యధిక సంఖ్యా బలంతో అది వీగి పోవటం గూడ జరిగిపోయింది.

తీర్మాన ప్రతిపాదకులు కూడా యీ ఫలితానికి ఆశ్చర్యపడి వుండరు. జవహర్‌లాల్ నాయకత్వాన్ని పడగొట్టగల ప్రతిభాసంపన్నులు తమలో ప్రస్తుతానికి యెవరూ లేరని ప్రతిపక్షాలకు కూడ తెలిసిన విషయమే.

పదిహేను సంవత్సరాలుగా సాగుతున్న కాంగ్రెసు పరిపాలనలో ప్రజానీకంలో ప్రబలుతున్న అసంతృప్తినీ, ప్రభుత్వాంగాలలో దినదినాభివృద్ధి చెందుతున్న అవినీతినీ, కాంగ్రెసు నాయకులలో వ్రేళ్ళు పాతుకొని పోవుచున్న ఆశ్రిత పక్షపాతాన్ని ప్రకటించటానికే అయివుండొచ్చు యీ తీర్మానం.

తన ప్రతిభాపాటవాల చేత, భారతప్రధాని ప్రతిపక్షాలు తీసుకొనివచ్చిన తీర్మానాన్ని ఓడించినప్పటికి, అందులో యిమిడివున్న సత్యాన్ని, దానిలో ప్రస్ఫుటమైన ప్రజల

భారజీవితాన్ని, ఆయన గ్రహించి యుండవచ్చు. అందుకే, "ఇటువంటి చర్చలు అప్పుడప్పుడు జరగటంవల్ల ప్రభుత్వ పక్షానికి కనుపిప్పు కల్గుతుందని" ఆయన అన్నారు.

స్వాతంత్ర్యసిద్ధి అనంతరం, కాంగ్రెసు ప్రభుత్వం, దేశభవిష్యత్‌ను తీర్చిదిద్ద టానికి చేసిన ప్రయత్నాలు, రచించిన ప్రణాళికలు, అన్నీ వృధా అయినవని వాదించటంలో గూడా సత్యం కనుపించదు. ఐతే. వాటివలన సాధించిన సత్ఫలితాల కంటే, వాటిపేరజరిగిన దుర్వ్యయం, దూబరా, అవకతవకలు ఎక్కువనే చెప్పాలి. వీటి పర్యవసానంగానే, ప్రభుత్వ మంటే ప్రజలకు నిర్లిప్తత, నిరుత్సాహము కల్గినవని అందరూ అంగీకరించుతున్న విషయం.

జనుల దైనిక జీవిత సమస్యలను అవగాహన చేసుకోకుండా, వారికి దూరమై, పరిపాలన కావించటానికి పూనుకోవటంలోనే, కాంగ్రెసు నాయకులు తప్పటడుగు వేశారు. ఈ అదను కనిపెట్టి దేశంలోని స్వార్ధశక్తులు ప్రభుత్వాన్నుంచి ప్రజలను దూరం చేస్తున్నవి.

ఈ పరిస్థితి గ్రహించే కాబోలు, రానున్న ప్రమాదాన్ని తెలుసుకొని, ప్రభుత్వాల లోని సీనియరు మంత్రులు పదవులు వీడి, సంస్థ సారధ్యం వహించాలని శ్రీ కామరాజు నాడార్ కోరటం, దానిని కాంగ్రెసు వర్కింగు కమిటి ఆమోదించటం జరిగింది.

ఇది చరిత్రాత్మక నిర్ణయం. కాంగ్రెసు నాయకులు దీనిని యెంతవరకు కార్య రూపంలోకి తీసుకొని వస్తారు అనేది ఇప్పుడు ప్రధాన సమస్య. చిత్తశుద్ధితో, యీ నాయకు లందరూ, సమగ్రమైన కార్యక్రమాన్ని రచించి, దాన్ని ఆచరణలో పెట్టి తేనేగాని, ప్రభుత్వానికి, ప్రజలకు మధ్య ఏర్పడుతున్న అగాధాన్ని పూడ్చలేరు.

ఈ సందర్భంలో ప్రజలుకూడా, ప్రత్యేక ప్రయోజన దృష్టి విడచి, సామూహిక శ్రేయస్సును తమ ఏకైక లక్ష్యంగా భావించి, ఉత్తమ పౌరులుగా, తమధర్మాన్ని నిర్వర్తించడం అవసర మన్న విషయం విజ్ఞులైనవా రెవరూ కాదనలేరు.

చైనా పాకిస్తానులు మిత్రద్రోహ చర్యలు జరుపుతూ, దేశంలో ఆర్థిక సంక్షోభను లేవనెత్తటానికి తీవ్ర ప్రయత్నాలను జరుపుతున్న యీ విపత్కర సమయంలో, దేశ భవిష్యత్‌ను, భద్రతను, దృష్టిలో వుంచుకొని, సమాజ విధ్వంసకశక్తులు ప్రభుత్వాన్ని పెడత్రోవను పెట్టకుండా, జాగ్రత్తగా పాలక యంత్రాంగాన్ని కనిపెట్టి వుండవలసిన బాధ్యతను ప్రతిపక్షనాయకులు విస్మరించకుండా పౌరుల కర్తవ్యమై చేయవలసివుంది.

అసంఖ్యాక త్యాగధనుల కారణంగా కాంగ్రెసు ఒక మహాసంస్థగా రూపొంది, భారత ప్రజావాణిగా పేర్కొనబడింది. అట్టి మహాసంస్థ నేడు ప్రజల విమర్శలకు గురి అవుతున్నదంటే, కాంగ్రెసు నాయకులు ఆత్మవిమర్శన చేసుకోవలసిన కాలం ఆసన్నమైనదన్న విషయం అంగీకరించితీరాలి.

ప్రజాక్షేమ విచ్ఛిన్నకర శక్తులు కొన్ని సంస్థలో చేరి, పనిచేస్తున్న వని సంస్థ సారధులు మరచిపోరాదు. చిత్తనైర్మల్యంతో – పూర్వపు త్యాగ చింతనతో, నాయకులు కార్యకర్తలుగా పని చేయవలసిన అగత్యం యెంతైనా కలదన్న సంగతి నిష్కళంక దేశాభిమాను లందరూ ఒప్పుకొంటారు.

అధికార పదవులు అలంకరించటం కంటే, జనహృదయాన్ని, వారి జీవితాన్ని అవగాహన చేసుకొనటానికి నాయకులు అతిత్వరలోనే ప్రయత్నించగల రని ఆశించుదాం.

గత అనుభావాల వలన కొంత భంగపడినా, వర్తమానకాల చారిత్రిక నిర్ణయంపై విశ్వాసం ఉంచుదాం.





మద్రాస్ గవర్నర్ బిష్ణురాంమేహిధీ, ఆంధ్రప్రదేశ్ గవర్నర్-జెనరల్ శ్రీనగేశ్, ఆంధ్రప్రదేశ్ ఆర్థిక మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి, ఆరోగ్యశాఖామంత్రి శ్రీ శివరామప్రసాద్‌గార్లు బేగమ్‌పేట విమానాశ్రయంవద్ద.

# చిత్ర వార్తలు

శ్రీమతి ఇందిరా గాంధి ఇటీవల రష్యా సందర్శించినప్పుడు 27-5-1963 తేదీని రష్యా ప్రధాని కృశ్చేవ్‌ను కలుసుకున్నారు.





నేపాల్ మహారాజా మహేంద్ర వీరవిక్రమ్ షా దేవ్, మహారాణి రత్న ఈ నెల 27 వ తేదీనుండి మనదేశంలో సుహృద్భావ పర్యటన చేస్తున్నారు.

క్రిందిచిత్రం : ప్రథమ భారత జాతీయ ప్రదర్శనం, మాస్కోలోని సొకోల్నికి పార్కులో జరిగింది. ఇందు మనదేశంలో తయారైన పింగాణీ పాత్రసామానులు, మట్టిపాత్రలు ఎంతో అందంగా ప్రదర్శింపబడ్డాయి.



ప్రధాని నెహ్రూ స్వతంత్ర దినోత్సవము
నాడు ఢిల్లిలో రెడ్‌ఫోర్టుపై జాతీయపతాక
ఆవిష్కరణానంతరం అక్కడి ప్రజానీకా
నికి ఉపన్యాస మొసంగుచున్నారు.





మన ప్రధానిగారు 14-8-63న ఢిల్లీ విశ్వవిద్యాలయాంగణములోని హంసరాజ్ కాలేజీలో ఎన్. సి. సి. ప్రామిస్ పేరేడ్‌ను తిలకిస్తున్న దృశ్యం.

క్రింది చిత్రం: కాశ్మీరులోని పహల్‌గామ్ టూరిస్టు భవనంతోసహా రెండు పెద్ద హోటళ్ళు ఇటీవల కురిసిన వర్షాలకి కూలిరాకపోకలు ఆగిపోయాయి. రాళ్ళు రప్పలూ తీసి రోడ్డుపై రాకపోకలు జరిపించుటకు సైనికులు సహాయపడుతున్నారు.






ఈమధ్య దేశం అంతటా క్షేత్రయ్య త్రిశత వార్షికాలు జరిగాయి.

అన్ని ఉత్సవాల లాగే ఇదీన్నీ మొగం మొత్తేలాగ జరిగింది. క్షేత్రయ్యను గూర్చి ఎవరు చెప్పినా, ఎన్నిసార్లు చెప్పినా కొత్త విషయాలు చెప్పలేరు కదా! ఇతని పదావళి కవిత్వానికీ, సంగీతానికీ, అభినయానికీ కూడలి అనీ, వానిలో మధురభక్తి అంతర్వాహినిగా సాగుతూ ఉంటుందనీ, ఇదనీ, అదనీ తిరగవేసి మరగవేసి చెప్పారు. ఇక గాయకులు కొన్ని రోజులపాటు ఆ పదాలు అదే పనిగా పాడేరు. ఉపన్యాసం కంటె గానం ఎక్కువ బాగుంటుంది గనక, విధ విధాల గాయకుల కంఠాలు వినిపించిన పదాలు విని ఉత్సవాలను కొంతవరకు తట్టుకున్నాం. రేడియోనుండి ప్రసారం అయిన ఒకటి రెండు నాటికలు బాగా ఉన్నాయి.

మమ్మలిని ఎప్పుడూ ఒక సందేహం పట్టుకు పీకుతూఉంటుంది. త్యాగయ్యగారినీ పెద్దలు భక్తుడంటారు; క్షేత్రయ్యగారినీ భక్తుడంటారు. త్యాగరాజకృతులు వింటూంటే ఎలాంటి కొయ్యకూ రాతికీ కూడా ఆయన భక్తుడనే అనిపిస్తుంటుంది. ఆయన జీవితగాథలుకూడా కొన్ని మనకి తెలుసు. క్షేత్రయ్య జీవితాన్ని గురించి ఏమీ తెలియదు. ఆయన పదా-

లను బట్టి ఆయన జీవితం, ప్రవృత్తీ మనం విలువకట్టుకోవాలి. త్యాగరాజు కృతులు, రామదాసు కీర్తనలు, నారాయణతీర్థుల తరంగాలు అధ్యాత్మ రామాయణకీర్తనలు ఇవన్నీ విన్నాం. వానిలో, భక్తిరసవాహిని పొంగి పొరలినట్లు అందరూ గ్రహించగలరు. కాని, మువ్వ గోపాల పదాలో ! వింటూంటే రాధాకృష్ణుల లీలలు జ్ఞప్తికివస్తయి. వీనిలో భక్తి భావము కన్న రసపిపాస వెల్లివిరుస్తుంది.

మధురభక్తి అంటే ఏమిటి? మీరా పదావళిలాంటిదా? భాగవతంలో భ్రమరగీతల లాంటిదా? వాటిలోని జీవాత్మ పరమాత్మల సంబంధాన్ని గూర్చి చెప్పిన ధోరణివంటిదేనా మువ్వ గోపాలపదాలలోని ధోరణి? ఏమో బాబూ! అయినా అవసరమా అంత మధురభక్తి.

ఇంతకూ క్షేత్రయ్య పదాల్లో ఆ భక్తి లేకపోతే మునిగిం దేమిటి? అవి వట్టి శృంగార రసానికి సంబంధించిన పదాలైతే కలిగిన ముప్పేమిటి? ఏమైనా అతడు గొప్ప రచయితే. గొప్ప వాగ్గేయకారుడే! అమరుడే!

పెద్దలు ఉపన్యశిస్తూ ఓ మాట చెప్పారు. అది నాకు నచ్చింది. క్షేత్రయ్య పదాల్ని లాగిలాగి, తెగలాగి అతి విలంబంగా ఇప్పుడు పాడ నక్కరలేదు. పాడితే శ్రోతలు తట్టుకోలేరుకూడా. ఆ రోజుల్లో అయితే ఆ పదాల్ని పాడేటప్పుడు ఎదురుగా విలాసవతులు అభినయించేవారు కూడా. గనక అలాగ లాగడం బరువుగా తోచేదికాదు. అంతేకాక అవి నిదానమైన రోజులు. తాబేలులాగ నడిచేవి. ఇప్పుడు మన మనస్సుల లోకి వేగం వచ్చింది మరో విషయంకూడా ఉంది. మువ్వ గోపాల

పదాలందలి సాహిత్యం చాలా ప్రధాన మైనది. సాగదీసి పాడడంవల్ల సాహిత్యం ప్రసన్నంగా శ్రోతల మనస్సులకు ఎక్కదు, ఏ పదమైనా తీసుకుని ఇదివరకు ఎన్నాళ్ళనుండో నిర్ణయించబడిన రాగానికి బదులు మ రే రాగం దానికి తొడిగి అయినా పాడవచ్చు నని అన్నారట— అంటే "మగువ తన కేళికా మందిరము వెడలెన్" అన్న పదం మోహన రాగంతో పాడడం రివాజు. ఏ అసావేరో పాడినప్పటికీ బాగుంటుం దన్నమాట. వారి మాటలనుబట్టి ఈ సిద్ధాంతం ఒప్పుకోవా లని లేదు. రాగభావ మంటూ ఒకటి ఉంది. ఆ వాగ్గేయకారుడు తాను రచించే పదాలయందలి భావాని కనుకూలంగా రాగమూ కవితా తయారుచేస్తా డనుకుంటాం.

అయినా ఇలాంటి విషయాలు పండితులూ పెద్దలూ చర్చించ వలసినవి గాని సామాన్యుడికి అందుబా టుండదు.

క్షేత్రయ్య అసలు పేరు వరదయ్య అన్నారు. అతని ప్రియురాలి పేరు మోహనాంగి అన్నారు. ఇంకా అటువంటివి ఏమి టేమిటో అంటారు. అన్నప్పటికీ పనిలేని మంగలికి ఏ పేచీ లేదు.





# మోహన మూర్తి

తీరని కోరిక లూరించావు
తీయని ఆశలు కలిగించావు
హృదయము నంతా మధురతమం బగు
భావప్రపూరిత మొనరించావు ॥తీ॥

ఎప్పటి జన్మపు టీ బంధంబో!
అవిరళ ప్రేమా అనుబంధంబో!
చల్లని కన్నుల వెన్నెల కాంతుల
ఉల్లము నుజ్జ్వల పరిచావు ॥తీ॥

ఇదివర కెన్నడు మదిలో లేని
మదిమును గూరిచి మురిపించావు
కమ్మని కలలో కళకళ లాడే
మోహనమూర్తిని చూపించావు ॥తీ॥

పదిరోజుల ఈ పరిచయమందే
ప్రేమవల్లరుల పెంచావు
అక్షిపద్మముల ఆనందాశ్రువు
లీ లతకూనకు పోశావు ॥తీ॥

మడుపు శేషారావు

# ప్రవాసి

జీవిత పరిభ్రమణమే అలాంటిది.

వెలుగులోని మానవుడు కొన్నాళ్ళ కా వెలుగును భరించలేక చీకటిని కోరు కున్నట్లే శాంతితో బ్రతికే మానవుడు శాంతిని భరించలేక అశాంతిని కోరు కుంటాడు. అశాంతిని కలిగించే పనులే చేస్తాడు!

---

అరుణ

---





రైలు వేగంగా పోతున్నది. పశ్చిమ దిక్పతి గుండెల్లో బడబాగ్నిలా సూర్యాస్తమానం అవుతోంది. అగాధతమోమయ స్వరూపిణి ఎవరో జగత్తునాక్రమించాలని ప్రయత్నిస్తోంది. దూరంగా తడిసీ తడియని చీకటి వెలుగుల చీర అంచుల మాటున కొండలు తమ అనంత నగ్న సౌందర్యాన్ని దాచుకోవాలని ప్రయత్నిస్తున్నయి.

"ఆనందా !"

స్వామి ప్రజ్ఞానంద మందహాసం చేస్తూ ఆనందుని పిలిచారు ఆనందుడు ఉలికిపడ్డాడు ఎవరా పిలిచింది అదే పిలుపు ఎన్ని యుగాలక్రిందటో విన్నాడు. తన జీవితం హఠాత్తుగా మలుపు తిరుగుతూ లోయలో పడబోతుంటే ఇదే పిలుపుతో తనని సక్రమమార్గాన పెట్టాడు.

ఆనందుడు తలెత్తి స్వామి వంక చూశాడు. మందహాసం చేస్తున్న ఆ చూపుల ప్రభావం అనంతమైనది ఆయన వంక చూడలేక తల దించుకున్నాడు

రైలు వేగం అంతకంతకు తగ్గుతున్నది. గమ్యస్థానాన్ని చేరుతున్నాననే ఆనందంతో వెర్రికేక వేసింది

ఇదేనా వూరు

మనస్సులోని వేయిమంది ఆనందులు కంపిస్తున్న కంఠాలతో ప్రశ్నించారు.

అవును. ఇదే వూరు. ఇంకో జన్మ ఎత్తినా మరిచిపోలేని నీ పూరుని.

చిక్కబడుతున్న చీకట్లో కూడ, ఎన్నో ఏళ్ళ క్రిందట చూసిన పరిసరాల్ని చూసి గుర్తుపట్ట గలిగాడు.

ఆనందుడు వణికిపోయాడు. ఎంత ప్రయత్నించినా మనస్సు కుదుట పడ లేదు. ఒక్కసారిగా అతని మానసిక నేత్రానికి జీవితం భూత భవిష్య ద్వర్తమానాలలో మరో కోణంలోంచి దృశ్యాదృశ్యంగా గోచరింపసాగింది.

ఏమిటి జీవితం ? క్షుద్రదీపంముందు చరించే స్వభావం గల నీడలాంటిది జీవితం. దానికి రాగము లేదు. లయ అంతకన్నా లేదు.

ఈ లోకంలో సుఖము దుఃఖము స్థిరమైనవికావు. కాని అవి చరించే ఘడియలు మాత్రం శాశ్వితమని భ్రమపడతాం.

జాగృతిలేని వెలుగు చీకటిలో లీనమై పోయింది. ఆ వెలుగులోంచే చీకటి ఆవిర్భవించినట్లుంది.

రైలు మరోసారి కూత కూసింది.

ఆనందుడు ఉలికిపడ్డాడు అతని నవనాడులు కృంగిపోయినయి. భరించలేని నీరసంతో కూలిపోయాడు. అప్రయత్నంగా కన్నీరు తిరిగింది.

"ఆనందా !"

ప్రజ్ఞానంద మెల్లగా ఆనందునివద్దకు వచ్చారు. ఆనందుడి గొంతు వొణికిపోయింది.

"స్వా..మీ!'' అన్నాడు పెగల్చుకుని. కాని కంఠం భాష్పావరుద్ధమై మాటలు సరిగా రాలేదు.

"ఏడుస్తున్నా వెందుకు నాయనా?"

ఆనందుడు జవాబు చెప్పలేదు. మెల్లగా సజలనేత్రాలను స్వామివంకత్రిప్పి వెంటనే తల దించుకున్నాడు.

"భయపడకు ఆనందా. నువ్వు చనిపోయావని లోకం నమ్మింది.'' అన్నారు స్వామి మెల్లగా.

"స్వా...మీ! '' అన్నాడు భావవిహ్వలతకు కంపించిపోతూ.

''ఇంకా భయం దేనికి నాయనా ? ఇవ్వాల్టిదా నిన్నటిదా ? పదిహేను సంవత్సరాల క్రిందట...''

ఆనందుడు ఇక దుఃఖం ఆపుకోలేక పోయాడు. ఆ శక్తి అతనికిలేదు. ఈ క్షణం ఇటువంటిది. అతని జీవితంలో వ్యక్తిగత విప్లవాన్ని సృష్టించింది

తోటి శిష్యు లందరు తమ తమ సంచుల్ని పట్టుకుని సిద్ధ మౌతున్నారు దిగటానికి. కాని ఆనందుడికి అవేమీ పట్టలేదు. ఏదో మైకం కమ్మినట్లు కూలబడిపోయాడు.

"లే నాయనా, బాధపడకు" అన్నారు స్వామి మందహాసం చేస్తూ. రైలాగింది.

ఉన్న శక్తి నంతా కూడదీసుకుని మెల్లగా లేచాడు ఆనందుడు. శిష్యులు

ఒకరొకరే దిగుతున్నారు.

"దిగు నాయనా !"

అడుగడుగునా స్వామిఆజ్ఞే తనకి దిక్సు అవుతోంది. కాని దిగుతుంటే నరాలు వణికినయి. రక్తం విపరీతమైన వేగంతో పరుగెత్త సాగింది. ఆనందుడికి బాహ్య స్మృతి పూర్తిగా పోయినట్లే అయింది.

పదిహేను సంవత్సరాల క్రిందట — ఇదే స్టేషను తన జీవితనాటకంలో ముఖ్య పాత్ర వహించింది.

చెడిపోయిన మానవుడి గతచరిత్ర లాంటి దీపం వెలుగుతున్నది స్టేషన్‌లో. దూరంగా, కాలం దాచుకున్న రహస్యా లను వెలికి తీస్తా నని బెదిరిస్తున్నట్లుగా ఎర్రటి సిగ్నలుదీపాలు వెలుగుతున్నాయి నల్లని చీకట్లో.

"స్వామీ, తమరు శిష్యులతో సహా మా గృహంలో —" ఆనందుడు కళ్ళు తెరిచాడు బరువుగా. ఆ వొచ్చిన వ్యక్తి రాజశేఖరంగారు. ఉత్తరీయాన్ని నడుముకు బిగించి స్వామికి నమస్క రిస్తూ అన్నారు.

చుట్టూ జనం జయధ్వానాలు చేస్తూ నిలబడ్డారు.

"నా ఆతిథ్యం స్వీకరించా లని —"

స్వామి రాజశేఖరంగారి వంక వాత్సల్యపూర్వకంగా చూశారు. లీలగా ఆయన చేతిలోని పూర్ణకుంభాన్ని స్పర్శించారు.

"మాకు శివాలయంలో బస ఏర్పాటు చేసుకున్నాం."

"మీ కన్ని సౌకర్యాలు..."

"మా ధ్యానానికి దేవాలయమే అను వైనది."

"ఆతిథ్యానికైనా —"

స్వామి మందహాసం చేస్తూ తల వూపారు.

"రండి స్వామీ."

రాజశేఖరంగారు పూర్ణకుంభంతో స్వాగత మిచ్చి దారితీశారు.

"రా నాయనా, ఆనందా —"

మౌనంగా, యాంత్రికంగా ఆనందుడు స్వామి ననుసరించాడు.

యోగమాయలాంటి చీకటి అలుము కుంది. ఈ నల్లని చీకట్లో అతని ముఖం క్షణక్షణానికి వివర్ణమైపోవటం ఎవరూ గ్రహించలేదు. ఈ ఏకాకి జీవితం విచిత్రమైనది. ఇంకా అతను పరిత్యక్తుడు కాలేదు. ఏకాకితనంలో ఏ ఆనందాన్ని అనుభవించాడోగాని అది నిర్వచించ లేనిది.

శివాలయం చేరుకున్నాక అందరూ వెళ్ళిపోయారు. శిష్యులు స్నానానికి బయలుదేరారు. ఆనందుడు బలహీనంగా స్థంభా న్నానుకుని నిలబడ్డాడు. ఇదే దేవా లయం. ఒకనాడు తన జీర్ణసౌందర్యంతో విలవిల్లాడిన దేవాలయం ఈ నాడు మాన వుల పవిత్ర ఆశయాలకు చిహ్నంగా సంస్కరింపబడింది

స్వామి గీతా శ్లోకాలు చదువు తున్నారు. శివుని ముందు వెలిగించిన జ్యోతి మూడోకన్నులా ప్రజ్వరిల్లుతూ వెలుగుతోంది.

"నిర్మాన మోహా జితసంగ దోషా
ఆధ్యాత్మ నిత్యా వినివృత్త కామాః
ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛంత్య మూఢాః పద మవ్యయం
తత్".

నిజంగా స్వామి శ్రీ కృష్ణుడై తనకు కర్తవ్యం ఉపదేశిస్తున్నట్లే వుంది.

ఏమిటిది? ఇన్నాళ్ళు సాధన చేసినా మనస్సును జయించ లేకపోతున్నాడు. ఎంత ప్రయత్నించినా మనస్సులోకి మౌనం జొరబడటంలేదు. ఉంటుంటి అగ్నిపర్వతాలు పగులుతున్నాయి అతని హృదయంలో. కలలకి హద్దు లేర్పడు తున్నాయి. హృదయానికి మాటలు రావు. వచ్చివుంటే అదో విప్లవాన్ని తెచ్చిపెట్టేది. కాని అంతకన్నా స్పష్టంగా తన భావాలను వెలిబుచ్చుతున్నాయి చూపులు.

జరిగిందంతా కల - అని మరిచిపోదా మని ప్రయత్నించాడు. కాని ఎందుకో ఈ ప్రయత్నంలో దుఃఖమే వచ్చింది; ఆపుకోలేకపోతున్నాడు. ఈ దుఃఖాను భూతి విచిత్రమైనది; ఆద్యంతాలు లేనిది. జరామృత్యువులు అంతకన్నా లేవు. అది ఏకపథగామియై హృదయాన్ని శూన్యం చేస్తూ తొలుచుకుపోతున్నది.

"ఆనందా!"

ఆనందుడు ఈ పిలుపుతో పెనుగాలికి కంపించే లతలా కంపించిపోయాడు.

ప్రతిసమాధానం చెప్పలేకపోయాడు

"ఊరుకో నాయనా, స్నానం చేసిరా -
అన్నారు స్వామి జాలిగా ఆనందుని వంక చూస్తూ.

ఆనందుడు మాట్లాడ లేదు. అతని మనస్సు శకల మయిపోయింది. ఒక్క సారి వెనక్కి తిరిగి చూసుకున్నాడు ఈ నలభై సంవత్సరాల జీవితం కన్ను మూసి తెరిచేటంతలో ముగిసిపోయిన ట్లుంది. భవిష్యత్తు భయంకరంగా కనిపిం చింది. ఒకనాడు వైరాగ్య వాతావరణంలో లక్ష్యం ఎంత స్పష్టంగా కనిపించిందో ఇప్పుడంత అస్పష్టంగా కనిపిస్తోంది ఇప్పుడు లభించిం దేమిటి? భిన్న భిన్నమై అణువుల రూపంలో ఒకదాని వెనుక జారిపోతున్న కాలబిందువులు ఏ బిందువూ చేతికి చిక్కటం లేదు అదంతా గతిచరిత్రలో కలసిపోయి అతన్ని పరిహసించటానికే పూనుకుంది

వద్దంటున్నా వినక మనస్సు గతాల తలుపులు తెరుచుకుని భవిష్యత్తు ద్వారాన్ని బలంగా మూసి పరుగెత్తింది

## 2

మానవుడు జన్మతోనే దోషికాడు పరిస్థితులు జీవనపథాన్ని మారుస్తూ వుంటయి. పరిస్థితులే మానవుడ్ని




"ఇది మా వీధి కాదుగా !"

ఔన్నత్యానికో అగాధానికో తీసుకుని పోతాయి.

తన పరిస్థితులు అలాగే చేసినయి

ఏ స్త్రీకోసరం తను యుగయుగాల నుండి తపస్సు చేస్తూ వేయి కన్నులతో ఎదురు చూశాడో ఆ స్త్రీ, తన మరణానికి చరమగీతం పాడటానికి మంగళ రూపంలో అడుగు పెట్టింది. అలా పెట్టి ఇంకా ఆరునెలలు కూడా కాలేదు !

ఎంత ప్రయత్నించినా, సీత ఎంత చెప్పినా తను ఆ పేకాట మానుకోలేక పోయాడు. మొదట్లో ఎంత డబ్బు వచ్చేదనీ ! రోజు రోజూ నోట్లకట్టలు సీతకి చూపిస్తూ తన ప్రతిభకి తనే పొంగిపోయే వాడు. ఈ వ్యసనం తన జీవితంలో అంతర్వాహినిగా ప్రవహిస్తున్న మహా విషాదానికి మూల మైంది. కాని అదెవరికి తెలుసు ? జీవితం ఇంత తీయగా వుందంటే, దాన్ని మనం అలా వూహించు కోటమే ! అదృష్ట మనేది అజ్ఞాతంగా వుంటుంది. అలాగే దురదృష్టం కూడా. కాని జరిగిం దేమిటంటే, ఈ అదృష్టం యొక్క సమగ్రస్వరూపం ఎండమావుల లోని జలంలా వుంది. దొర్లుకుంటూ వచ్చి దురదృష్టపు శిలలకు తగిలి జీవితం ముక్కలై కెరటంలా ఎడిపోయింది.

క్రమంగా ఈ వ్యసనం తనస్వభావాన్ని చూపెట్టడం మొదలుపెట్టింది. ధనం

పోతున్నా లక్ష్యంచేయక పోయినదాన్ని పొందాలనే తీరని తృష్ణతో ఆడటం మొదలుపెట్టాడు. కాని ఆడినకొద్దీ పోవటం, పోయినకొద్దీ ఆడటం చివరకు సీతమెడలో తాళితప్ప మిగిలిన లక్ష్మి మాయమై అంతటితో ఆగక స్థిరచరాస్తులపైకూడ తన వెలుగును ప్రసరింపచేసింది. చివరిపైస పోయేదాకా ఆడి, కళ్ళు తెరిచాడు.

ఒక్కసారి వెలుగు వెలిగి చీకట్లు క్రమ్ముకున్నయి! అనంత వైభవం హారతికర్పూరంలా హరించుకుపోయింది.

ఇంటి కెళ్ళటానికి మనస్సొప్పలేదు. ఒకటిమాత్రం నిజం. ఇంటికిపోతే సీత ఓదారుస్తుంది. కాని ఈ ఓదార్పును భరించలేడు. ఆత్మ వెదజల్లే పరిమళమే సానుభూతి. అయినా ఈ పరిమళాన్ని అనుభవించే శక్తిలేదు.

నిద్రాహారాలుమాని ఉన్మత్తునిలా పాడుపడిన దేవాలయంలో ఏడుస్తూ కాలం గడిపాడు. కాలం గడిచినకొద్దీ అతనిపై అతనికే ద్వేషం. వెంకట్రామయ్యనుచూసి అసూయ. అతనే తనకి ఆశలుచూపాడు. కాని చివరికి ఆశ నిరాశ అయి చేతికి అందాక పరిహసిస్తూ నిలబడ్డాడు.

విధి నడిపించే జీవితం తనది. తను స్వతంత్రంగా నడువలేడు. అడుగు వేసే ధైర్యం లేదు.

కసి పరకాష్ఠ నందుకుంది. హృదయంలో వ్యధ అశ్రుజలంద్వారా పరిసమాప్తిని పొందదలిచింది. కాని అతని కన్నుల గిన్నెలకన్నీటిచే అక్షయమైనవి.

ఏదో అవమానం జరిగినట్లనుభూతి. ఒకప్రక్క హృదయం కాలిపోతున్నది. ఏదో చేయాలి.

ఈ రాత్రి సరిగా వెంకట్రామయ్యా దురదృష్టవంతుడు. లేకపోతే వర్షమని కూడ చూడకుండా ఈ దారివెంబడి ఎందుకు వస్తాడు?

వర్షం జోరు ఎక్కువైంది. రాత్రి దొంగతనంగా జీవితంలో వచ్చిచేరింది. అప్పుడప్పుడు ఆకాశం హృదయాన్ని బ్రద్దలుచేస్తూ మెరుపులు మెరుస్తున్నయి.

"ఆగు!"

ఆకాశంలో ఉరుము ఉరిమింది.

వెంకట్రామయ్య భయంగా చుట్టూ చూసి ముందు అడుగు వేయబోయాడు. కాని బలమైన చేతులు ఆయన్ని బంధించి వేసినయి.

"ఎ ... వ ... రు ... ను ... వ్వు?" వణికిపోతూ ప్రశ్నించాడు. అతనికి మండిపోయింది. రక్తం వేడెక్కిపోయింది. కోపజ్వాల తాలూకు భుగభుగలు నాసికాపుటల వెంబడి వెలువడుతున్నయి. శరీరం వణుకుతున్నది. అంతర్వాణి ఇచ్చే సలహాను అతను వినలేక పోతున్నాడు.

"నన్ను నాశనం చేసినవాడివి నువ్వు కదూ?'' కోపంతో బిగ్గరగా అరిచాడు.

ఈ సన్నివేశం భయంకరమైనది. చీకటి అజ్ఞానానికి సంజ్ఞలా అలుము కుంటున్నది. వృక్షాలు గించుకుంటున్నై.

"నే—నా ?" ప్రాణం పోయినంత పనైంది వెంకట్రామయ్యకు. ఆ గొంతు గుర్తు పట్టాడు.

"ను...వ్వే !" అన్నాడు కోపంతో అరుస్తూ. అంతే క్రియచేశాడు. అతని మనస్సు జ్ఞానాన్ని కోల్పోయింది. ఏం చేస్తున్నాడో అతనికే తెలీలేదు. కాని రక్తంలోపడి ముద్దయి మూలుగుతున్న వెంకట్రామయ్యను చూడగానే తెలిసింది ఏంచేశాడో ?

రక్తంతో మలినమైన రాయి వర్షంతో పాపాన్ని కడుక్కుంది.

వెంకట్రామయ్య అటూ ఇటూ పొర్లుతూ మూలుగుతున్నాడు.

వణికిపోయాడు. ఏంచేశాడు తను ? ఇదేనా జీవితానికి ధ్యేయం. ఇదేనా వ్యసనానికి ఫలితం ? వెంకట్రామయ్య రక్తం పాపంలా వర్షపునీటితో కలసిపోతున్నది.

ఈ రహస్యాన్ని బయటపెడతా నని ఒక్కసారి విద్యుల్లత ఆకాశం ఈ మూల నుండి ఆ మూలకి పరుగెత్తింది.

కర్తవ్యతా మూఢుడై నిలబడి పోయాడు. సర్వేంద్రియాలు బంధాలు వేసినట్లు కదల్లేకపోతున్నాయి. చలన రహితమైనాయి. ఇది చైతన్యానికి అవసానదశలా వుంది. దూరంగా ఏవో మాటలు వినబడుతున్నాయి అస్పష్టంగా. ఒక్కసారి మనస్సు పనిచేసింది.

పరుగెత్తాడు అక్కడ్నించి. ఆ భయంకర ప్రదేశానికి దూరంగా పరుగెత్తాడుకాని మనస్సులోంచి ఆ దృశ్యాన్ని దూరం చేయలేకపోయాడు. ఎంత తిరిగినా శాంతి దొరకలేదు. మాటిమాటికి ఆ దృశ్యం మనస్సులో మెదులుతూ అతని లోని శాంతిని చెదరగొట్టినాయి. చేతి కంటిన రక్తపుమరక ప్రపంచంలోని నదీ జలా లన్నిటితో కడిగినా పోదు.

జీవితం రెండు శక్తులమీద ఆధార పడి వుంటుంది. ఒకటి పరిస్థితులు. రెండు దైవం. ఎంత తిరిగినా శాంతి లభించకపోయేసరికి క్రమంగా జీవితం మీద విసుగు జనించింది. ఏదో విరక్తి. జీవిత మంటే నిర్లక్ష్యం ఏర్పడిపోయి నయి. ఎవరికోసరం బ్రతకాలి ?

నిరాశ భవిష్యత్తుకి కత్తెరలువేసింది. ఇక ఏ ఆశ లేదు. జీవించటమే వృథా.

కాని వెలుగున్నంత సేపు నీడ వున్నట్లు, కర్మ వున్నంతసేపు బ్రతుకు వుంటుంది. నదిలో పడినా అతను బ్రతికాడు.

కళ్ళు తెరిచి చుట్టూ చూశాడు.

"ఎవరు నాయనా నువ్వు ?"

కలలోలా వినిపించినయి మాటలు. మెల్లగా లేచి కూర్చున్నాడు.

"ఆత్మహత్య మహాపాపం కదూ ?"

అతను మాట్లాడలేదు. కాని ఈ ప్రశ్న ఎంత తీక్షణ మైందంటే దీనికి జవాబు

చెప్పక తప్పేటట్లులేదు.

''ఏం చేయమంటారు — బాధలు భరించలేక—''

ఆయన నవ్వారు. ఆయనే ప్రజ్ఞానంద. శిష్యు లెవరో క్షీరము తెచ్చి ఇచ్చారు.

''ఇక్కడే వుంటావా? నీకు 'శాంతి' లభించేట్లు చేస్తాను.'' ఎందుకో అతనికి తన కథ చెప్పా లనిపించింది. ఒంటరిగా తన కథ యావత్తూ చెప్పాడు. కాని సీత సంగతిమాత్రం చెప్పలేదు. సీతకి తను చేసిన అన్యాయం సామాన్యమైందికాదు. కనీసం ఆమె పేరుకూడ ఉచ్చరించే అర్హతలేదు తనకు.

ఇదే నిలయమైంది. ఈ పదిహేను సంవత్సరాల జీవితం ఈ ఆశ్రమంతో పెనవేసుకు పోయింది. రోజు రోజుకీ సాధన ఎక్కువ చేసేవాడు. ఒక్కొక్క రోజు సాధనలో ఏవో దివ్యానుభూతులు పొందేవాడు. ఏ అదృశ్యశక్తి అతన్ని జీవితం వెంట ఎటుగెంతించి ఈ ఆశ్రమం చేర్పించిందో గాని ఒకవిధంగా దానికి తను కృతజ్ఞుడు. ఏ క్షుద్ర జీవిత పరిస రాలలో పడువలసి వస్తుందో నని భయంతో కృంగిపోయాడు ఒకనాడు. కాని ఇది ఒకందుకు మంచిదే! శారీరకంగానూ మానసికంగానూ ఎంతో మార్పు తెచ్చింది. ఆనందుడు బరువుగా లేచి స్నానానికి బయలుదేరాడు.

౩

శివాలయంలో జనం చేరారు.

ఈ రెండు రోజుల్లోను సీత అతనికి కనిపించలేదు. అస లిక్కడ వుందో లేదో? ఎక్కడికి పోయి వుంటుంది? ఎలా బ్రతుకుతుంది?

ఈ ప్రశ్నలకి జవాబు రాదు. కాని ఒకటి మాత్రం నిజం. పోయిన వస్తువు విలువ ఎక్కువ. ఇప్పుడు అంతే! రోజు రోజుకీ సీత విలువ పెరుగుతునే వుంది. కనీసం సీత తనని శిక్షించినా కొంత సంతృప్తి మిగిలేది. ఏది సీత — తన ఆత్మకి ప్రతిరూపం సీత — ఏది?

మనస్సు ఏదని వ్యథతో ప్రశ్నించింది. అక్కడ నిలువలేకపోయాడు. అసలీ రోజు తను జీవితంతో జీవించటంలేదు. పరిసరాలలో జీవిస్తున్నాడు. ఈ మానసిక కలతకి అసలు తనకే అంతు దొరక్కుండా వుంది. ఏమిటీ యమయాతన— ఇన్నాళ్ళ ధ్యానాని కిదేనా ఫలిగిన పరిణామం? సర్వ శక్తులు కూడద్రోసుకుని మనస్సు పూజపై లగ్నం చేశాడు. అలవాటు పడిన నోరు ఆశువుగా మంత్రాలను ఉచ్చరిస్తోంది.

'నమ స్సోమాయచ రుద్రాయచ'

కాని మనస్సు విహంగమై ఎగిరిపోయి సీతపై నిలిచింది. ఊహలనే మనస్సులో నిలిచి ప్రాణప్రతిష్ఠ చేసుకుంది. అందమైన స్రోతస్విని హఠాత్తుగా మలుపు తిరిగి లోయల్లోకి పురికింది. ఏ కఠిన నియమాలు, నిబంధనలతో శరీరము, మనస్సు అరికట్టబడిందో




"అదేమిటయ్యా అలా ఖంగారు పడ్తావు. నీవయస్సులో ఉన్నప్పుడు నాకిదే జబ్బుచేసి తగ్గిపోవలేదూ ?"

"నిజమే ననుకోండి కానీ మీ డాక్టరు ఇంకొకరు కదా."

ఈ నాడు ఈ అనుభూతి వీటన్నిటికి అతీత మైంది.

అతని కళ్ళు అందరిపై తిరుగుతున్నాయి. కాని ఎన్ని చినుకులు పడినా స్వాతి వానకు తప్ప ముత్యపు చిప్ప మూత పడనట్లు సీత కనిపిస్తే తప్ప మనస్సు మూతపడదు. గాలానికి చిక్కుకున్న మత్స్యంలా విలవిల్లాడింది మనస్సు.

పూజ అయిపోయాక జనం తీర్థ ప్రసాదాలు తీసికొని వెళ్ళిపోయారు. రాజశేఖరంగారు శిష్యులతో ప్రసాదాలు స్వయంగా పంచిపెట్టారు.

"అలా వున్నావేం నాయనా ? ఇంకా భయంపోలేదా . ఇంతమంది జనంనిన్ను చూశారుగాని, గుర్తుపట్టారా ?"

గర్భగుడిలో ఎవరూలేరు. స్వామి, తను, అంతర్యాల నెరిగిన శివుడు

ఆనందుడు మెదలకుండా వూరుకున్నాడు. అప్రయత్నంగా కన్నీరు ధారలు కట్టి వర్షించింది.

"స్వా...మీ ! ఈ దుఃఖాన్నెందుకు సృష్టించా డసలు ?" ఆపుకోలేక గద్గద స్వరంతో ప్రశ్నించాడు.

స్వామి చిరునవ్వు నవ్వారు,

"దుఃఖానికి మూలకారణం వ్యామోహమే నాయనా ! అయినా సుఖం విలువ తెలయా లంటే దుఃఖము ఉండితీరాలి.

నీది సుఖదుఃఖాల కతీతమైన జీవితం. ఈ క్షణికోద్రేకానికి —" ఆనందుడు నిట్టూర్చాడు.

"ఆత్మ చిద్రూపమైన వెలుగు. సాధన చేయి. పూజచేయి. దానియొక్క స్వరూపాన్ని దర్శించు. అదే పరమార్థం."

ఆనందుడు మెదలకుండా కన్నీటితో స్వామివారి పాదాల నభిషేకించాడు.

సీతసంగతి చెప్పాలనిపించింది స్వామితో. కాని ఏ అదృశ్యశక్తో అతని నోటిని మూసేసింది.

"స్వామీ, భిక్షకు దయచేయండి." వినయంగా రాజశేఖరం నమస్కరిస్తూ అన్నాడు.

"పద నాయనా." ప్రేమగాఆనందుని బుజంమీద చేయివేసి బయలుదేరారు.

మానవ సంకల్పానికి దైవసంకల్పం పూర్తిగా విరుద్ధంగా వుంటుంది. ఈ చివరి నిమిషంలో ఆనందుడు ఆశించింది ఒకటి. కనీసం సీతని చూడకుండా ఈ ఊరినుండి దాటిపోగల నని. కాని ఈ క్షణం విలువ అలాంటిది. సీతనే అతనికి పరిచయం చేసింది.

రాజశేఖరం కుటుంబంలోని వ్యక్తులందరినీ పరిచయం చేస్తూన్నారు.

"ఈమె సీతమ్మ. మా ఇంట్లో పది హేనుసంవత్సరాలనుండి వంటచేస్తూంది. నిజంగా సీతమ్మేనండి. భర్త వదిలేశాడు. పాపం, అప్పటినుండి ఇక్కడే వుంటున్నది. పేరుకి వంటమనిషేగాని మా ఇంట్లో ఒకమనిషిలా కలిసిపోయింది.

సీత దగ్గరగా వచ్చినమస్కరించింది.

స్వామి వెనుక నున్న ఆనందుడు వణికిపోయాడు. కాళ్ళక్రింది భూమి కదలిపోయిన ట్లయింది. వర్షం లేని పిడుగు పడింది. అశ్రుధారలతో నిండి కళ్ళనెత్తి సీతవంక చూశాడు. సీతలో ఏ భావమూ లేదు. నిర్లిప్తంగా వుంది. అసలు తనని చూసినట్టే లేదు. సీత తన్ని గుర్తించలేదా ?

సీత ఇక్కడే వుంది. వంటలు చేసుకుని బ్రతుకుతున్నది. ఎంత హీనమైన జీవితం ప్రసాదించా డామెకు ? ఎవరు దీనికి కారణం. ఆనాడు సీత మాట విని పేకాట మానివుంటే — చేతులు కాలాక ఆకులు పట్టుకుని ఏం లాభం ?

అతని హృదయాంతరాలలో సప్త సముద్రాలు ఘోషిస్తూ పొంగుతున్నాయి. అతని మీద అతనికే అసహ్యమేసింది. ఎందుకీ బ్రతుకు ? ఈ జీవితం తనకి సరిపడదు.

అతని మనస్సుకు తెలుకుట్టినట్లయింది. బాధతో, వేదనతో అతని ముఖం వివర్ణమైపోయింది. నరాలు విద్యుద్ఘాతం తగిలినట్లు జిల్లుమంటున్నాయి. ఏదో మహాలయ స్థితి ఆవరించింది అతన్ని. పాడుబడిన కోవెల అయింది అతని ముఖం.

ఒక్కముద్ద కూడ లోపలికి పోలేదు. క్షణక్షణము సీత దీనవదనమే అతనికి కనిపించి గుండెల్లో శూలంలా గ్రుచ్చు

కుంటున్నది. స్వయంగా సీత వడ్డించ టానికి వచ్చినప్పుడు అతని మనస్సు వెర్రిఆవేశంతో "సీతా, సీతా'' అంటూ పిలిచింది. కాని అంతకన్నా బలంగా పెదవులు మూసుకుని ఈ ఆపదనుండి దాటించినయి. ఏదో నిస్పృహ, నిరాశ — అతనికి అధైర్యమావేశించింది.

సీత తనకంటే ఉన్నతురాలు. తను దిగజారిపోయినాడు. మళ్ళీ ఆ రోజులు.. తన జీవితంలోని కన్నీటిని ఆనంద భాష్పాన్ని సమంగా భాగించుకుని పంచు కున్న సీత......తన అపురూపమైన హృదయ సౌందర్యంతో అడుగడుగునా తోడునీడైన సీత — మళ్ళీ ఆ సీతతో —? మళ్ళీ తొలినాటి తీయని అనుభూతి... ఎప్పుడు ?

ఎప్పుడు? ఎప్పుడు ఈ మహాశాపానికి విముక్తి ?

## 4

ఉదయం నుండి ఆందోళనతో మన స్సదోలా అయింది.

ఒకనాటిస్థితి అతనికిజ్ఞాపకమొచ్చింది. ఆ దివ్యానుభూతులలో అతనికి దైవదర్శ నము లభించేది. ఆ సమాధిస్థితిలో తన వద్దకు శారదాదేవి నడిచివచ్చినట్లు అను భూతి కలిగేది. తనకి తెలియకుండానే 'నమ సోమాయచ రుద్రాయచ నమస్తా మ్రాయ చారుణాయచ.....' నాలుకపై నాట్యం చేసేది మంత్రం.

ధ్యానం చేస్తేగాని మనస్సు ప్రశాంతత నొందదు. శాంతి లేకపోతే బ్రతుకలేడు.

స్నానం చేసివచ్చి ధ్యానానికి కూర్చుందామని బయలుదేరాడు..

నిర్మలమైన చెరువు ఈ వ్యక్తి స్పర్శచే కల్లోలమైపోయింది. అనంత వినీలాకాశం చెరువులోపడి ప్రతిఫలించి ముద్దలుముద్దలుగా ఒడ్డుకు కొట్టుకువస్తు న్నది. భవిష్యత్తు ఒక్కసారి వర్త మానం కాదు. అలా అయితే సృష్టికే వినాశం తప్పదు.

నీటిలో దిగి చుట్టూ కలయజూశాడు ఆనందుడు.

సీత బిందెతో నీళ్ళు ముంచుతున్నది.

అతని మనస్సు చెదిరిపోయింది !

"సీ—తా !" అన్నాడు వగరుస్తూ.

సీత మెల్లగా తలెత్తి చూసింది. వెంటనే సగం నిండిన బిందెను పట్టుకుని పమిటచెంగు నోటికడ్డం పెట్టుకుని దుఃఖాన్నాపాలని ప్రయత్నిస్తూ పరు గెత్తి వెళ్ళిపోయింది.

ఆనందుడు గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయాడు. నిర్జీవమైంది హృదయం.

"ఆనందా ! ఇక్కడున్నావా, స్వామి పిలుస్తున్నారు.''

ఆనందుడు తేరుకుని శిష్యులవంక చూస్తూ, "ఆఁ! వస్తున్నాను'' అన్నాడు.

చీకటి క్రమ్ముకుంటోంది. మలయ మారుతం వేణువు ఊదుతూ పరుగెత్తు

తున్నది. గోపురంనిండా పెట్టిన దీపాలు మినుకుమినుకుమంటూ దూరానికి కనిపిస్తున్నాయి.

స్వామి చాలసేపు తను రచిస్తున్న గీతకు వ్యాఖ్యానాన్ని చెప్పారు వ్రాయటానికి.

చీకటి వెలుగును బానిస చేసుకుంది. చలి ఎక్కువైంది. శిష్యులు నిద్రపోయారు. స్వామి మెల్లగా దక్షిణామూర్తి శ్లోకాలు చదువుతున్నారు శ్రావ్యకంఠంతో. ఊరు నిదురబోయింది. నిశ్శబ్దం తాండవిస్తోంది. ఈ నిశ్శబ్దంలో స్వామి నోటివెంబడి శ్లోకాలు మధురంగా వినిపిస్తున్నాయి.

'విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ
తుల్యం నిజాంతర్గతమ్
పశ్యన్నాత్మని మాయయా బహిరివో
ద్భూతం యథానిద్రయా
యస్సాక్షా త్కురుతే ప్రబోధసమయే
స్వాత్మానమేవాద్వయమ్
తస్మై శ్రీ గురుమూర్తయేనమ ఇదం
శ్రీ దక్షిణామూర్తయే!'

స్వామి మెల్లిగా నిద్రలోకి జారారు.

ఆనందుడు లేచి కూర్చున్నాడు. అందరూ నిద్రబోతున్నారు.

సీత జ్ఞాపకమొచ్చింది. సీతని చూస్తే ఆనాటి సీతలాగే కనిపించింది. ఏమీ మార్పులేదు. తను చేసుకున్న రూప కల్పనకీ సీతకి చాల బేధంవుంది. ఆ రాత్రి ఏమన్నాడు? ఏ ప్రమాణం చేశాడు?

"నువ్విలా మౌనంగావుంటే నాకేం తోచటంలేదు. ఇంకా సిగ్గేనా? పోనీ, అలా మౌనంగా వుండటమే నీ అభిమతమైతే దాన్ని భరించేశక్తికూడ నాకివ్వు."

సీత సిగ్గుతో నవ్వింది.

"ఇలా నీ నవ్వుతో నా హృదయ వీణను మ్రోగిస్తావని తెలిస్తే, కొండ కోనలు దుర్గమారణ్యాలగుండా నా జీవితాన్ని మోసుకుని వస్తాను."

ఒక్కసారి గత స్మృతి ఉద్రేకం తెప్పించింది.

అనందుడు మెల్లగా నడిచి గుడి దాటాడు. ఈ పదిహేను సంవత్సరాలలో తను సాధించిన నిగ్రహాన్ని ఈ ఒక్క క్షణం చెదరగొట్టివేసింది.

చీకట్లో చెరువు నిద్రబోతుంది, మాయ ఆవరించినట్లు. అంతర్వాణి హెచ్చరికల్లా కప్పలు చెరువులో నుండి అరుస్తున్నాయి. చలి చీకటి కలిసిపోయినయి. ఈ చలి చీకటుల అద్వైతాన్ని భగ్నం చేసేశక్తి ఎవరికీ లేదు.

"సీ—తా!"

సాధ్యమైనంత మెల్లగా పిలిచాడు. సీత పలకలేదు. మెల్లగా తలుపు తట్టాడు.

"సీతా!"

తలుపు తెరుచుకుంది. ఎక్కడికి పోయినా చీకటి వెంటాడుతునేవుంది.

ఇంట్లో లాంతరు గ్రుడ్డివెలుగు వెద జల్లుతున్నది. భర్త విడిచిపెట్టిన భార్య ఆక్రందనలా వుంది వెలుగు.

"సీతా:" బరువుగా ఉన్నయి మాటలు.

శూన్యమైన ఇల్లు ప్రతిధ్వనించింది!

సీత జవాబు చెప్పలేదు. అసలు లేదు ఆ ఇంట్లో! ఇల్లంతా ఉన్మత్తునిలా తిరిగాడు. ఏమైంది సీత? ఏది తన సీత? తన జీవితకథలో ఉపాఖ్యానంగా మలుచుకున్న సీత—ఏది?

మంచంమీద మెరుస్తూ కనపడింది ఉత్తరం.

"మీరు వస్తారని ఊహిస్తూ ఈ ఉత్తరం వ్రాస్తున్నాను - నేను వెళ్ళిపోతున్నాను. నన్ను మళ్ళీ వెతక్కండి. మీరు యోగులు. సర్వసంగపరిత్యాగులు. నా కోసరం చలించి పోవటం తప్పు. కూడని పని. మీకు అందబోయే మహా ఫలాన్ని నేను దూరంచేయను. జీవితం పరిమితమైంది. మీరు నన్ను స్వీకరించినా నేను మిమ్మల్ని స్వీకరించలేను.

"నరూప మస్యేహ తథోపలభ్యతే
నాంతో నచాదిర్నచ సంప్రతిష్ఠా,
అశ్వత్థమేనం సలిరూఢ మూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా."

"సీతా—" నిట్టూర్చాడు బరువుగా. ఆనందుడి ముఖం పాలిపోయింది. అతనికి తెలియకుండానే దుఃఖం కట్టలు త్రెంచుకుంది. ఇది కలా? భ్రాంతా? ఈ స్వప్నావస్థ ఎంతసేపుందో అతనికే తెలియదు. జీవితంలో మహావిషాదాన్ని ఇప్పుడే స్పర్శించాడో? కాని కళ్ళు తెరిచేసరికి దూరంగా దేవతలు వెలిగించిన మహాజ్యోతిలా ఉషోదయమైంది.

ప్రపంచంలోని తమస్సు ఏకమై కాలువై ప్రవహించి ఆ జ్యోతిలో లీనమై పోతున్నది.

అతని హృదయంలోనూ దీపం వెలిగింది. యుగయుగాలనాటి జడత్వం కాలువై ప్రవహించి ఆ దీపంలో లీనమై పోయినయి. ఆ జ్వాలయొక్క వేడికి 'మమత' ఆవిరై పోయింది. ప్రేమయొక్క నిజస్వరూపదర్శన మైంది. నిజంగా జరిగే దిదే! ప్రేమ యొక్క నిజస్వరూపం అది భగ్న మైననాడుకాని తెలీదు. అప్పుడది త్యాగ మౌతుంది.

ఆ ఇంటికి తనకు వున్న మమతా బంధానికి కన్నీటితో తిలోదకం వదిలి శివాలయం వైపు బయలుదేరాడు ఆనందుడు!








లాంతరువత్తి చిన్నదిచేసి చూరు కొయ్యకు తగిలించి గోపాలం ఆయాసంతో కట్టెమంచంమీద నడుం వాల్చాడు కడుపు ఖాళీగావుంది. నాలుగు మెతుకులు పాపకోసం తప్పితే వంట చేసుకునే ఓపిక ఈనాడు లేదు. భార్య శాంతమ్మ చిన్నవయసులోనే హృద్రోగంతో కన్నుమూసింది — మొదలు ఎన్ని ఉపవాసాలు — ఎన్ని అవమానాలు.

ఇప్పు డతని బ్రతుకంతా ఎనిమిదేండ్ల పాపకోసం — పోతే, అతన్ని నాశనంజేసి కృశింపజేసిన ఒకేఒక ఆశయం కోసం.

*   *   *

పడ్డం భాస్కరరావు

తలిదండ్రులు గోపాలం వయస్సు పదేండ్లు నిండకముందే పరమపదించారు. అన్న పెద్ద కంట్రాక్టరు. అతని సొత్తు సహకారం ఏమీ అంటకుండా తనకు తానుస్వతంత్రంగా బ్రతకనేర్చుకున్నాడు. చిన్ననాటినుంచీ అన్నదమ్ముల మధ్య ఆకులు చెల్లేవిగావు. ఉత్తర దక్షిణ ధృవాల్లా వేరువేరు స్వభావాలు – అభిలాషలు – ఆశయాలు వారివి. అన్నగారి పెళ్ళయిన కొత్తల్లో అత్తగారి మోజులో పడి తమ్ముణ్ణి పేరుబడిసిన షావుకారికి వొప్పజెప్పి తనదారితానుచూసుకున్నాడు.

గోపాలం దుకాణాల్లో ఆపనీ యీపనీ జేస్తూనే రాత్రులు సాతానిపంతులు



నరసింహం పుణ్యమా అంటూ తెలుగు విశారదకు గట్టేడు. తెలిసున్న యజమానుల కొట్లలో కొంతకాలం గుమస్తాగా పనిజేశాడు. గోపాలం మంచితనంవల్ల అతనీ బీదరికం మరచిపోయి అంతస్థులతో లెక్కలేకుండా అందరూ ఆదరించారు. అయినా గుమాస్తాగిరితో తృప్తి కలుగలేదు. పుట్టుకనించే అతనిలో స్వతంత్రభావా లున్నాయి. అయితే ఒకరి అధికారం సహించే ఓపిక ఎక్కడా ? దానికి కొంత దేశాభిమానం సంస్కారగుణం గూడా తోడయ్యింది. బ్రతుకు విషయంలో బాగా ఆలోచించి ఏదో ఒకటి–స్వేచ్ఛ వుండా లని, తన అంతస్థుకు తగ్గటు ఉంటుం దని, వీధిబడి చెప్పడం ఆరంభించాడు. పదిమందీ హర్షించారు. ఎంతటి గోపాలం ఎంతవా డయ్యా డని. బడిపంతులు గోపాలం యువకు డైనా పెద్దపెద్ద బుద్ధులు వున్నవా డని, పిల్లల తలిదండ్రులుతెలుసుకున్నారు.ముఖ్యంగా వాళ్ళు కార్ఖానాలలో – కొట్లలో బండ్లు లాగుతూనో, లేక బస్తాలు మోస్తూనో బ్రతికేవాళ్ళు.

గోపాలం అనుకున్నాడు ఇలాంటి వారి మధ్య వుంటేనే మర్యాదలు–సహకారాలు తప్పండా వుంటా యని. కష్టపడి పైకొచ్చిన వ్యక్తిగా నలుగురి పెద్దల ముందు మంచివాడు అనిపించుకున్నాక పెండ్లి జేసుకొని అక్కడే కాపురం బెట్టాడు. దినాలు తాపీగా దొర్లిపోతు న్నాయి.

నగరంలో ఎలాంటి సభలు–సమావేశాలు జరుగనీ అక్కడ హాజరు వుండాల్సిందే గోపాలం. ప్రొద్దుకూకడమే తరువాయి, అతని యింటిముందు చిన్న సమావేశం ఏర్పా టవుతుంది. పత్రికల విషయాలో–ప్రపంచ విషయాలో కల్లాకపటం లేని కూలిజనానికి తృప్తిగా విడదీసి చెబుతుంటాడు.

చిన్న పిల్లలకన్నా వయోజనులకు చదువు చెప్పడ మంటే అతనికి ఎక్కువ యిష్టం. పిల్లలకోసం పాఠశాలలు ఎలాగూ వుంటాయి. పోతే–ప్రొద్దస్తమానం ఒళ్ళు విరుచుకొని వచ్చిన కూలీవాడికి విద్యాదానం చెయ్యడం అదొక కర్తవ్యంగా భావించుకుంటాడు. తను ఈనాడు నలుగురు చదువుకున్న వాళ్ళ మధ్య ధైర్యంగా నిలబడగలుగుతున్నా డంటే నరసింహం పంతులు దగ్గర రాత్రులు యిలా చదువుకునే గద అబద్ధాలు–మోసాలు చేసి బ్రతకవలసిన అవసరం అతనికిలేదు. సంపూర్ణ ఆత్మవిశ్వాసం, స్థిరమనస్సు చేకూరింది న్యాయంతో బ్రతకడమే మానవుడికి కావల్సిం దని తెలుసుకున్నాడు.

గోపాలం అడుగు బెట్టింది మొదలు ఆ బస్తీలో కులమత తత్వాలు–సామాన్యకయ్యాలు – దురభ్యాసాలు చాలామంది వారంతకు వారే మానుకున్నారు.

రాత్రులు వయోజనులకు తెలుగులో పాఠాలు, లెక్కలు చెబుతూనే, పగలు తగినంత ఇంగ్లీషుగూడా నేర్చుకున్నాడు. ప్రయత్నం వుండాలిగాని ఏది అబ్బదు. అన్నీ అదృష్టాల క్రింద జమగట్టి వూరుకోగూడదు. దేనికైనా నిరంతర సాధన-సాహసం-ఓర్పు కావాలి, అనేది గోపాలం ఆశయం.

చాలాకాలం తర్వాత ఉన్న ఒక్కడు అన్నయ్య దురభ్యాసాలకు గురి అయినాడని తెలిసి చాలా బాధపడ్డాడు. ఎంత డబ్బు సంపాదిస్తే మాత్రం నిలుపుకోవాలి గాని యిలా తగలేసుకుంటారా అని విచారించాడు.

వృత్తులు - ఆత్మలు, ఆశలు - ఆశయాలు, ఏవి ఎలా వున్నా రక్తసంబంధం వుండే వుంటుంది. అది విడదీయరానిది. అన్న భోగలాలసుడై పోయా డన్న వార్త గోపాలం హృదయంలో సుడిగాలి రేపింది. మెత్తని స్వభావం నిండుదనంతో పెరిగిన తాను మున్నాళ్ళపాటు జ్వరంతో మంచంపట్టాడు. ఆ సంగతే అతన్ని అధఃపాతాళంలోకి తీసుకెళ్ళింది.

ఒక్క తల్లి రక్తం పంచుకొని, ఒకే చన్ను కుడిచి బ్రతికిన అన్నదమ్ముల జీవితాల్లో ఒకరికి పురోగమనం మరొకరికి పతనం - సృష్టి కల్పనలో విచిత్రమైన కలయిక అన్నదమ్ముల పుట్టుక. గోపాలం సంశయించలేదు. శాయశక్తుల ప్రయత్నించి అన్నను మంచిమార్గంలో పెట్టాలని నిశ్చయించుకొని ఒక రోజు వాళ్ళింటి కెళ్ళాడు అన్నగారు లేరు. వదిన గోడంతా చెప్పుకుంది. జాలితో అతని కళ్ళు చెమర్చాయి అతని రాకపోకలు సక్రమంగా వుంటే తన అన్న పెడదారులు పట్టడానికి వీలుండేది గాదేమో నని మథనపడ్డాడు 'భయపడగూడదు. అన్నయ్యను మంచి మార్గంలో పెడతాను' అని వదినకు మాట యిచ్చాడు.

'ఆ వేశ్యలు ఎవరు? ఎక్కడుంటారు?' అంటే వదినగారు తెలియదని చెప్పింది.

ఒకరోజు స్వయంగా అన్నయ్యకు ఎదురపడి "సుమతిలాంటి శ్రీమతిని యింట్లో వదలి ఏమిటీ పిచ్చివేషాలు? ఆస్తి గుల్లయిపోయింది చాలదూ? నా మాట విని అన్నీ మరిచిపో. నీ కాళ్ళు కడిగి నెత్తిన పోసుకుంటాను. నీ బిడ్డలు రేపు ఏమైపోతారు? చూడు! ఆ చల్లని తల్లి నా వదిన అని చెప్పడానికి ఎంతో గర్విస్తున్నాను. కాని - నీవు నైతికంగా దిగజారి సమాజంలో నిప్పులు చెరుగుతున్నావ్. అన్నయ్యా! మన కాపనులు సరిపడవు. ఇలాగే బ్రతుకుదాం. బాగా ఆలోచించు. ఆ వెర్రి తిరుగుళ్ళు మానుకుంటా నని ప్రమాణం చెయ్యి'' అని అన్నగారి పాదాలపై వాలాడు.

అతనికి ఆ వేమీ వినిపించలేదు తాగిన మైకంలో తమ్ముణ్ణి చివాలున ఒక

తన్ను తన్నాడు. పాపం కుడిచేయి విరుచుకపడ్డాడు. కోపంతో గోపాలం కళ్ళు ఎఱ్ఱబాఱినై —

"అన్నా! నీలాంటివాణ్ణి 'అన్నయ్యా!' అని పిలవడమే నా దురదృష్టాల్లో కెల్ల పెద్దది. మన రక్తసంబంధం ఏనాడో తీరిపోయిం దనుకున్నాను. ఛ! భార్యా బిడ్డల్ని చక్కగా పోషించుకునే అర్హత లేదు. పదిమంది ఆడవాళ్ళతో మొండి సరసాలు. వయసు ముదిరినకొద్దీ వన్నె పెరుగుతున్న ట్టుంది. సిగ్గు లేకపోతేసరి. రేపే మా వదినా, బిడ్డల్ని తీసుకెడు తున్నాను. నీ కర్మ. ఎక్కడైనా చావూ-బ్రతుకు." ఆవేశం హద్దుమీరిన గోపాలం అన్నమీద చేయి జేసుకోడానికి జంకలేదు.

"మీ వదిన అందంగా వుందన్నావు గదూ! తీసుకపోయి దాంతో కులుకు. చచ్చినా మీ ముఖం చూడను. కొట్టావు గదూ! మంచిపని జేసి బ్రతికిపోయావ్. కొట్టు జీవితాన్ని బహుశః మరిచిపోయి వుంటావ్. పో. సుఖంగా — హాయిగా బ్రతుకు, పో" అంటూ వీధివేపు నడిచి సామాన్య జనసమూహంలో కలసి పోయాడు.

అన్నయ్య యిలాంటి విపరీత మార్గాల్ని తొక్కలా డనుకోలేదు. ఈ నిందలకన్నా మంచివాడికి మరణమే మేలు. సీతలాంటి వదినకు పాపం అంట గట్టజూశాడు. పురుగులు పడి చచ్చినా వీడి ముఖం చూడకూడ దనుకొని గోపాలం అక్కడినుంచి భీష్మించుక వచ్చేశాడు.

ఎంత మరిచిపోదా మనుకుంటున్నా వదిన—పిల్లలు-అన్న అతని కళ్ళల్లో తిరుగుతూనే వున్నారు. దీని కంతకూ కారణం అన్నగారి వేశ్యాలోలత్వం. ఎంతైనా పెద్దవాడు. చేయి జేసుకు న్నందుకు భగవంతుణ్ణి మన్నించు మని మనసార ప్రార్థించాడు గోపాలం.

మానవుడు ఆత్మీయతను ఒకనాడు గాకపోయినా ఒకనాడు గుర్తించకపోడు. కలతబారిన హృదయాల మధ్య అనురా గాల ప్రాబల్యం తక్కువగా వుంటుంది. జగత్తులో పగవాళ్ళు ఎవరో గారు. స్వంత అన్నదమ్ములే. వారే ప్రాణ మిత్రులు. వారే శ్రేయోభిలాషులు. వారే గర్భశత్రువులు—వారే దాయాదులు.

తన అన్న కుటుంబ నాశనానికి కారకులైన వేశ్యల అంతు కనుక్కోవా లనుకున్నాడు గోపాలం.

'నా అన్నలాంటి అన్నలు దేశంలో ఎంతమంది అధోగతిపాలై తమ భార్యా బిడ్డల్ని ఎంత దుఃఖపెడుతున్నారో' అని తలుచుకుంటే గోపాలం హృదయం తరుక్కుపోతోంది. ఈ వేశ్యావృత్తి రూపు మాయదా? అనే ఒక్కటే ధ్యాస అతనిలో గూడు కట్టుకుంది. రాత్రింబవళ్ళు వాళ్ళ కోసమే ఆలోచన—విచారం. తను ఎంతో మంది మిత్రుల కథలు విన్నాడు. ఒకడికి పెళ్ళిగాక, ఇంకోడి భార్య రోగిష్టి



"పెళ్లి చేసుకుని 3 నెలలయినా మా అమ్మాయితో ఒకసారికూడ మాట్లాడలేదుట. ఏమిటోయ్ నీ ఉద్దేశ్యం ?"
"అసలు మధ్యలో మాట్లాడనిస్తే కదుటంటీ !"

---

అవడంతో, వేరొకడు భార్య గయ్యాళి తనంతో, ఇంకొకడికి ధనం వుండీ, మరొకడి కదే హాబీగా ఇందరి జీవిత చరిత్రలు కళ్లల్లో మెదులుతున్నాయ్. వాళ్ళందరికీ ఆత్మవిశ్వాసా ల్లేవా ? ఏదో లోపం-కష్టం వుంటే తెగించి చెడు మార్గాలు తొక్కాల్సిందేనా? ఈ బాధలు-గాథలు వున్నది ఒక్కమనుష్యజాతికేనా? గోపాలం అన్నయ్యతో ఘర్షణపడి వచ్చాక-ఎంతో మారిపోయాడు.

* * *

మధ్యరాత్రి దాటివుంటుంది. వీధిలో దీపాలు వెలుగుతూనే వున్నాయి. చిన్న చిన్న సందుల్లోకి మాత్రం ఆ వెలుగు రేఖలు రావడానికిఎలాగూఅవకాశాల్లేవు. కన్ను పొడుచుకున్నా కనిపించని కటిక చీకటి. అలాంటి యిరుకు దారుల్లో వొక్కడే మెయిన్ రోడ్డుదాటిచాలాదూరం నడచి ఓయింటిముందు ఆగి తలుపు గొళ్ళెం తట్టాడు గోపాలం.

ముఖంలో మునుపటి గాంభీర్యం కనిపించదు. నీరసంతో వాలిపోయిన బుగ్గలు — గుంటలు పడ్డ కళ్ళు. తలకు తైలసంస్కారం లేదు. పంచె, కుడతా పూర్తిగా మాసిపోయినై. ఆ బక్కచిక్కిన శరీరంతో - అతని అవతారం— దేశదిమ్మ రయిన బీదవాడిలా వుంది.

గొళ్ళెం తడితే —

"ఎవరు..." లోపలినుంచి వృద్ధ కంఠం వినిపించింది.

"నేను గోపాలంని''

''గోపాలానివా ? యింతరాతిరిఎందు కొచ్చావ్. పిల్ల పడుకుంది. పోయిరా బాబూ..."

''లేదవ్వా, యిప్పుడే వెళ్ళిపోతాను. కొంచెం దరవాజాతియ్యవూ'' గోపాలం గొంతులో సహజమైన ఆర్ద్రత విని పిస్తుంది.

లోపల ముసల్ది తనలో తాను ఏదో గొణుక్కున్నాకా 'కిర్' శబ్దంతో రెండు తలుపులూ బార్లా తెరుచుకున్నాయి. ముసలవ్వ తిరిగి తలుపురెక్కలుమూసి—

"పిల్ల ఆ గదిలో వుంది. నీవుగనుక రానిచ్చాను'' అని పొమ్మంటూ తన గది లోకి దారితీసింది. గోపాలం ఆమెను ఆపి మూ డు రూ పా య లు చేతిలో పెట్టాడు. అవ్వ నవ్వుకుంటూ అతన్ని ముందుకు తోసింది.

కాళ్ళు చేతులు తడబడుతున్నాయి. ముందుకు సాగడానికి ధైర్యంలేదు. తార గదికి కర్టన్ వేసివుంది. తీరా అందాకా వచ్చి యిరకాటంలో పడ్డాడు. ఆమె పడుకొని నిద్రపోతోందేమో ? చక్కా పోతే అసభ్యంగా వుండదూ ? పేరున పిలువడానికి గడియ వేసిలేదు. అయినా పేరు తెలియదు.

వెంటనే ముసలవ్వదగ్గఱకు పరు గెత్తుకొచ్చి 'మీ మనుమరాలి పేరు చెప్పావుగాదు అవ్వా!" అన్నాడు.

'పేరుతో అవసరమేంలే బాబూ — తా రా బా యి' అంది నవ్వుతూ ఆ నవ్వులో యెన్నో లోతులు.

'ఇహ నువ్వు పడుకో అవ్వా. పోయే ప్పుడు కలుస్తాను' అని తారాబాయిగది చేరుకున్నాడు. ఈ మధ్య కొంత కల వరపాటు తగ్గింది. పరదా అలాగే వుంది ద్వారం ఎదురుగ్గా నిలబడి 'తారా!' అని పిలిచాడు.

రెండు పిలుపులకు లేచి వచ్చింది ఒంటినిండా నీలిరంగు కాశ్మీరు శాలువ కప్పుకొని-రాగానే—

"మీరా!......" అంది అత్యంతాశ్చ ర్యంతో.

"అవును. నేనే గోపాలాన్ని.'

"ఇలా వేంచేశారు. టైం ఎంత అయిందో తెలుసా ? రండి లోపలికి దారితీసింది.

ఆమె దృష్టిలో అతని ప్రవర్తన పాలకోసం పరుగులు తీసే పిల్లి నీళ్ళ కోసం నాలుక చాచినట్టుగా తోచింది

"తెలుసు. తారా ! నీతో ముఖ్యమైన విషయం మాట్లాడా లని వచ్చాను.

''పిచ్చా ఏ౹విటి-ఈ రాతిరి తప్పితే సమయం చిక్కలేదా ? అలసిపోయిన ట్టున్నారు. అలా బెడ్డుమీద కూర్చోండి అని విసనకర్ర అందించింది, అప్యాయత కనబరుస్తూ.

గోపాలం ఎప్పుడు వచ్చినా ఆ ప్రక్కనేవున్న స్టూలుమీదే కూర్చునే వాడు. ఈ పూట దగ్గరి బంధువులా ఆమె చెప్పినట్లే చేశాడు. "ఇంత ప్రొద్దు పోయేవరకు ఎక్కడ తిరిగారు. కళ్ళు గుంజుకపోయాయి" తార స్వంత పని షిలా అతన్ని పరామర్శించడం యిదే మొదటిసారి. నిలువుటద్దం ముందు నిల బడి జుట్టు సర్దుకుంటోంది.

"తారా ! నా విషయం వదిలెయ్. ముందు నువ్విలావచ్చి కూర్చో" అత నికి యిష్టంలేదు కాబోలు ఆమె సింగా రించుకోవడం.

"లేదు, లేదు మీరు ముఖం కడు క్కొని రండి. ఇవిగో నీళ్ళు" అని గోపాలం చేతి కందించింది చెంబు.

అతను జాలిగా నవ్వి "ఫర్వాలేదు. నా ముఖం బాగానే వుంది. ఈ రాతిరి కడగాల్సిన అక్కర నాకు లేదు" అని మరచెంబెడు నీళ్ళు గుటగుటా తాగే శాడు.

"అన్నం వుంది, భోంచేస్తారా ?"

"వద్దు. అవసరం లేదు."

"పడుకుంటారా ?"

"నిద్ర రాదేమో !"

"మీ మీద మీకే నమ్మకంలేదు."

"ఎప్పుడో వుండేదిగాని, ఆ స్థితి నుండి పరిస్థితులు నన్ను వెలివేశాయి. ఆమె ఇహ ఏమీ అడక్కుండా 'కూర్చోండి ఇప్పుడే వచ్చేస్తా" నని బయట కెళ్ళింది. గోపాలం మనస్సు కుడి తలో పట్టఎలుకలా తన్నుకలాడుతూంది.

తను అన్నయ్యతో మాటా మాటా అనుకొని వచ్చాక ఎన్ని కష్టాలైనా పడి తన చేతుల మీదుగా కొంత మంది వేశ్యలకైనా తగినజీవనోపాధి కలిగించా లని నిర్ణయించుకున్నాడు.

ఆ ఉద్దేశ్యంతో అనేక మంది వ్యభి చారులను కలుసుకోవడం జరిగింది. ఏ తోడేలూ మేక రోగం బాగుపర్చా లనుకోదుగదా ! గోపాలం విటుడుగా, కాముకుడుగా గాక వట్టి మనిషిగా పోయి వారి కేదో బోధించా లని ప్రయత్నిస్తే. కొందరు తిట్టారు; కొందరు మీద ఉమ్మారు; మరి కొందరు మహా యోధ దిగివచ్చా డని ఎగతాళి జేశారు; నపుంసకుడు అని గెంటివేశారు. నానా చీవాట్లు—చీదరింపుల్తో విరక్తితో ఆ నరక కూపాలు చూడలేక వస్తూండే వాడు. అయినా గోపాలం హృదయంలో రగు ల్కొంటున్న అగ్ని చల్లారనే లేదు. లెక్కలేనంత ధనం వ్యయ మయింది. ప్రతి పుట్టలో విషపాములే వుండవు. గోపాలాన్ని అంతగా అసహ్యించుకోనిది ఒక్క తారాబాయి మాత్రమే.

ఆవిడతో పరిచయ మయినాక అప్పు డప్పుడు వస్తూనే వున్నాడు. ముందు యిలాంటి నీరసమైన గిరాకీలు తేవద్దని ముసలవ్వతో చెప్పింది తార.

"ఎందుకు పిల్లా అలా యిదై పోతావు. కావలసినంతడబ్బు యిస్తూనే వున్నాడు. కాస్త దారిలో పడనీ. పాపం, భార్యని పోగొట్టుకున్న వాడిలా వుంటాడు. ఆయన కిక్కడ శాంతి కలుగుతుందేమో. వస్తే రానీ" అంటూ ముసలవ్వ సర్ది చెప్పేది.

"అయినా, మనకేం కొదువే అవ్వా! రాములు లేడూ ? ఆయనమాత్రం చిన్న సూపు చూస్తున్నాడా ? ఈమధ్య చాలా వరకు పరాయివాళ్ళతో గడపడం మానే శానుగదా" అని తార అంటూనేవుండేది.

గోపాలం ఎన్నిమార్లు వచ్చినా వ్యక్తి గత విషయాలు మాట్లాడేవాడు గాదు. ఏదో లోకాభిరామాయణం తప్ప. ఈ మధ్యరాత్రిరి దాటాక వచ్చా డని తారకు నిజంగా కలవరపాటు కల్గింది.

తారాబాయి మళ్ళీ వచ్చి కూర్చున్నాక గోపాలం అన్నాడు "తారా ! యిన్ని రోజులనించీ మీ యింటికి వచ్చి పోతున్నానుగదా; నాగురించి ఏం ఆలోచించావు."

''ఏముందీ, పసిపిల్లలమాటలకు కారణాలు చెప్పుకుంటామా ? కాకపోతే భార్యను చంపుకున్నట్టుంది. ఆ వియోగం యిక్కడ ఉపశమిస్తుందేమో అనుకుంటాం. సామాన్యంగా అలాంటివారే వస్తుంటా రిక్కడికి. ఏం ? ఎందుకూ ?"

"ఏమీలేదూ. నేను సంసారిని; భార్యా బిడ్డలు వున్నారు. మీలాంటివారిని అనుభవించి సుఖపడా లని ఏనాడూలేదు. మీ అమ్మమ్మవాళ్లు నీలాగే జీవించా రనుకోను నా కనుమానం నీవే దిగజారి వచ్చావు ఈ లోయలోకి...'' ఉద్దేశం సరిగా వెల్లడించలేక తొట్రుపడుతున్నాడు..

''అరె ? బలేవిచిత్రంగా మాట్లాడుతున్నారు. ఇదో కొత్త అనుభవం. మీ నోటితో ఈలాంటిమాటలు వినడం యిదే మొదటిసారి.''

"అంతే తారా. నే నిలా కావడానికి నీకేవో కారణాలు వున్నట్లు నాకూ వున్నాయి. అయినా నీ గతజీవితంతో నా కవసరం లేదు. మీ రీ వ్యభిచారం మానుకొని సుఖజీవితం గడపాలి.''

"ఎందుకండీ అంత జాలి ? పెద్ద కోరికే !''

"అలా తీసి పారేయకు. ఎన్నో కుటుంబాలు నాశన మవుతున్నాయి."

"ఎవరు జేసుకుంటున్నారు ?"

"చెప్పు లుంటే దారిలేకున్నా పోగల మన్న ధైర్యం వుంటుంది. అవి లేకపోతే పోవల్సినవాడు బాటనే బాగుజేసుకుంటాడు. పోనీ అది వేరువిషయం సంఘంలో మీలాంటివాళ్ళు ఉండడం సహించరాని విషయం. ఈ వృత్తి నడిపేవారు సమాజానికి చీడపురుగులు—

"గోపాలంగారూ ! ఆవేశపడకండి నన్నొకతెను మార్చగలరు. ఇద్దర్నీ ముగ్గుర్నీ మార్చగలరు. ఇలా ఎందరి



ఏరా బాబూ, నీలో నువ్వే గావుకేకలెట్టి మాట్లాడుకుంటున్నావ్ ఏమిటీ ?!'
అబద్ధా లాడితే, ఎవ్వరైనాసరే – నేను సహించలేను."

నని మార్చగలరు. దేశంలో ఏ మూల ఎం జరుగుతుందీ మీకేం తెలుసు."

తారా: నీలాంటి స్త్రీ మనస్ఫూర్తిగా ఒక్కతి మారితేచాలు. లోకాన్నే మార్చ గలను. ఒక్క ఉదాహరణ చెప్పనా ? దొంగ, గూఢచారులకు నాయకుడైతే దేశంలో దొంగతనాలు జరుగుతాయా?"

పిచ్చిమాటలండీ. ఓ విషయం చెబుతారూ ?''

అడుగు...''

నేను మారాలిగదా ! అంటే వ్యభి చారం మానుకోవాలి. అంతేనా ?''

—అంతే."

మీ రో త్యాగం చేయాలి—"

ప్రయత్నిస్తాను, చెప్పు—''

నాకు తెలుసు మీ లాంటివారు మాటలకేగాని పనులు చేయరు. ఏదో ఉద్ధరించా లని బోల్తా కొడుతుంటరు — పెండ్లి కానివాళ్ళు మీలాగ ముందుకొస్తే నయంగాని—''

"అంటే..."

"మీతో వుంటాను. భార్యాబిడ్డల్ని వదలి నన్ను చేబడతారా ?''

ఫలాలు ఆకులు రాలకుండా చెట్టు మొదలు కావాలంటుంది.

"కావలసిన ఉపాధి కలిగిస్తాను

"అంతమాత్రమే–పొరబడుతున్నారు మీరు ఎలాగైతే భార్యాబిడ్డల్ని వదల లేరో నేనూ, నాస్థావరంలోవున్న స్త్రీలూ మా మా వృత్తిధర్మాల్ని విడుచుకో లేము."

గోపాలం గుండెలో రాయి పడింది తన ప్రయత్నం విఫలమయిందన్న చింత

లేదు. ఆమె వాక్చాతుర్యం అతన్ని ఆశ్చర్యంలో ముంచింది.

'మళ్ళీ కలుస్తాను తారా!' అని గబగబా బయటి పెనుచీకటిలో కలిసిపోయాడు, ఆమె చివరి పిలుపునుగూడా వినిపించుకోకుండా.

* * *

ఎందుకొచ్చిన ఆరాటం. ఒక్క-రాయిని తీస్తే గుట్ట కూలిపోతుందా? సమాజంలో తరతరాలుగా పాతుకపోయిన దుష్టశక్తులకు విచారించి సానుభూతి చూపడమేనా మానవ కర్తవ్యం? గోపాలం-పిచ్చి పిచ్చి ఊహాలతో అర్థంగాని ఆవేదనల మధ్య సతమతవుతున్న సమయంలో దురదృష్టమా అంటూ భార్య శాంతమ్మ ఈ లోకంలో ఒకబిడ్డనూ, తననూ, ఒంటరిగా వదలి వెళ్ళిపోయింది. అన్నకు భార్యా, బిడ్డలు, ధనం వుండికూడా శాంతిలేకచస్తున్నాడు. గోపాలానికి అవి రెండూ లేనిస్థితి దాపురించింది. వాతావరణం-స్త్రీ ఈ రెండూ మార్చినంతగా మనుష్యుణ్ణి ఏవీ మార్చలేవు.

మానవుడికి భవిష్యత్తు నిర్మించుకునే శక్తిలేదు; రాదుగూడాను. అదే వస్తే జీవితానికి అర్థం, ప్రపంచగతికి లయత్వం లేకుండా పోతుంది. అదృష్ట రేఖలు ఎవరి కెలా రాసిపెట్టి వున్నాయో! అతనికి పునర్వివాహం చేసుకోవా లనిపించలేదు. రోజూరోజుకూ ఏదో సేవచేసి తరించాలనే ఆశయాలతోనే నిండుకుంటుంది హృదయం. ఎవరి అనుభవాలు వారినే సక్రమదారిలో నడిపిస్తాయి కాని ఒక ర్నొకరు మార్చా లని ప్రయత్నించడం వెర్రితనం. ఈ భావం అతని హృదయంలో బాగా నాటుకుంది.

ఆ రాత్రంతా బాగా ఆలోచించి, తెల్లవారి సాయంకాలం, ఘోరున వర్షం కురుస్తున్నా లెక్క-చేయక, చంకబిడ్డ నెత్తుకొని తడిసి ముద్దయి వచ్చి, తారాబాయి ఇంటిచావడిలో నించున్నాడు. ఏమి నిర్ణయించుకున్నాడో యేమో. ఎవరూ వూహించని విధంగా చాలా కాలానికి అసహ్యించుకున్న ఆమె యింటికే వచ్చేశాడు, బిడ్డతో సహా.

తార తన కళ్ళు తానే నమ్మలేదు.

తీరని సానుభూతితో గోపాలంని యింట్లోకి తీసుకవెళ్ళింది. "పూర్తిగా తడిసిపోయారు" అని పెట్టెలోంచి పంచె తీసియిచ్చింది.

''గొడుగు లేకుంటే వానలో నానడం తప్పదుగదా!''

"చాలారోజులకు దర్శనం."

''అన్నిభాగ్యాలూ శాశ్వతాలుగావు. దర్శనభాగ్యంగూడా...''

''...అలాంటిదే అంటారు?" మాట పూర్తిచేసింది తార అదోలా నవ్వుతూ. ఇలా మాట్లాడుతూనే -

పాపను లోనికి తీసుకెళ్ళింది. గోపాలం తడిసిన పంచె మార్చుకొని,

తెల్లమబ్బులాకాశంలా,సాధారణమనిషిగ మారిన తారను జూసి ఆశ్చర్యపోయాడు. ఈ తారకు, దిశమారిందో దశ మారిందో తెలియదు. ఆభరణాలు వెగటుపుట్టించే అలంకారాలు లేవు. కళ్ళలో కాంతి కరువయ్యిందేగాని 'ఆ' గాంభీర్యం, మాటల నిలకడ ఎక్కడికీ పోలేదు. ఒళ్ళు కాస్త తగ్గింది. నాజూగ్గా అరటి బొంగులా తీర్చి దిద్దినట్లుంది. గోపాలం ఆమె అకస్మాత్పరిణామాన్ని ఊహిస్తున్నాడు.

ఆమె వచ్చి మునుపటిలా కూర్చోక వరుసగా పేర్చిన పెట్టెల ప్రక్కగా నిల్చుంది.

'తారా! చాలా మారిపోయావు' అన్నాడు గోపాలం.

తొణకని నిండుకుండలా "మీరూ, మారారుగదా!" అంది.

"ప్రకృతి ధర్మాన్ని ఎవరు అడ్డగిస్తారు. నీ సహచర్యం నాకోగుణపాఠం నేర్పింది..."

"ఏమిటో..."

ఎవరి అనుభవాలు వారినే మంచి మార్గంలో పెడతాయిగాని, ఒకర్నిఒకరు బలవంతాలతో, మితిమీరిన బోధతో మార్చలే రనేసత్యం – ఇది అసంభవ మంటావా?

"అక్షరాల నిజం"

"చూడు తారా! ఆనాడు నీవో వింత ప్రశ్న లేశావ్ – 'సంసారులు భార్యా బిడ్డల్ని వదల్లేని మాటలు మానుకో గలమా?' అని; జ్ఞాపకముందా? ఈనాడు నీదగ్గరే శాశ్వతముగా ఉండిపోదామని వచ్చేశా –"

"మీరా!! నాదగ్గరా–భార్యాబిడ్డలు–" తారలో గుట్ట కదిలిన చలనం.

"నాభార్య చచ్చిపోయింది. మారు పెళ్ళితో ఈ పాపకు అన్యాయం చేయదలుచుకోలేదు. ఈ జీవితంలో 'నా అనేవాళ్ళు నా కెవరూలేరు. ఉన్నదొక్క అన్నయ్య– అతనిది విషాదగాథ. కొంతవరకు అతనే కారకుడని చెప్పాలి నా బ్రతుకు యిలా విచిత్రగతులు తొక్కడానికి. రక్తస్పర్శలో అన్నదమ్ములం గాని, మే మిద్దరమూ కలిసి బ్రతికిన దినాలు – చిన్నప్పుడు ఊహ లేనప్పుడు అంటే నీవు నమ్మవు. కావాలంటే నా పాపను బంగారుతల్లి మావదినకు వొప్పజెప్పి రాగలను. ముందు అలాగే జేస శ్రీరామకృష్ణ మఠంలో కలసిపోయి కొంతైనా సమాజానికి సేవ జేయాలనుకున్నాను. అప్పుడే చీకటైపోయిన నా మనస్సులో నీవు తారలా మెరిశావు అంటే– నా కోరిక మన్నిస్తావని ఆశిస్తున్నాను."

బాధతో, ప్రాధేయపూర్వకంగా అడిగిన గోపాలం మాటలకు తార పిచ్చిదానిలా నవ్వుకుంది.

ఇతనిలో స్త్రీత్వం ఎక్కువపాళ్లలో వున్నట్టుంది. పాపం అమాయకుడు అందుకే అంటారు – ఒకరిబాధలు తమ

విగా భావించుకునే వాళ్లు సుఖపడ రని. ఎలా ఓదార్చి సమాధానంచెప్పేది. తార గింజాటంలో పడ్డది. గోపాలం మళ్ళీతన జీవితంలో తారసిల్లుతాడనుకోలేదు.

''నామాటకూడా వినండి. మీ కేమని చెప్పాలో అర్థంకావటంలేదు. ఆనాడు భార్యాబిడ్డలు లేని మగవాడి వైతే నీతో వుంటా నన్నాను. కాని క్షమించండి. నా బ్రతుకు మలుపుకు, కారణ మయినవారు వేరే వున్నారు. అతనిదగ్గర ఆస్తి వున్నన్నాళ్ళు, నానాహంగామా జేసి — అప్పులకూ అవమానాలకూగురిఅయిన, అతన్ని హీనస్థితిలో అన్యాయంజేయడం మంచిది గాదు. నమ్మినవారికి ద్రోహం తలపెట్టడం యింకా నేర్చుకోలేదు. అందుకే మీతో వుండలేను."

హృదయం అదిమిపట్టుకొని చెప్పి నెత్తిమీద బరువు దిగినట్లు నిట్టూర్పు విడిచింది ఆమె.

''తారా! నీవు నిజంగా వృత్తి మాను కున్నావా ? నా క్కావలసింది అదే నని పదేపదే చెబుతున్నాను. ఎవరో అదృష్ట వంతుడు— నా ఆశయంసిద్ధించింది. అంతే చాలు — ''

గోపాలం హృదయం ఆనందంతో పెల్లుబికింది. ఏదో భాగ్యం అకసాత్తుగా అబ్బిన బీదవాడికిలా విజయగర్వం అతనిముఖంలో తాండవించింది.

"వా రెవరో తెలుసుకోవచ్చునా తారా..."

"ఇప్పుడు వూళ్ళోలేరు. బొంబాయి ఆస్పత్రిలో రోగంతో వున్నారు. రేపో యెల్లుండో అక్కడికే పోతున్నాను. చస్తే వారి పాదపద్మాలచెంత హాయిగా జీవితం చాలిస్తాను — అతడే కంట్రాక్టరు రాములు.''

''కం...ట్రా..క్ట..రు...రా— ము—లు. ఓ భగవాన్! ఎందుకీ విచిత్ర సన్నివేశాలను మామధ్య సృష్టించి చంపేస్తావ్. తారా! ఒక్కకోరిక. నా పాపను నీవే పెంచుకో. ఎవరన్నా అడిగితే గతిలేని బిచ్చగాడి కూతు రని చెప్పు. పాపం శమించుగాక — "

అంటూ ఆవేశంతో గోపాలం వెన్దిరిగిచూడకుండా వెలువడి వానలోనే చరాచరా మళ్ళీ వెళ్ళిపోయాడు.

''ఏమండీ—అతడు మీ అన్నయ్యేనా ?''

ఆమె సందేహం తీరదు. గోపాలం వచ్చి జవాబు చెప్పడు. ఆమెను ఒకరు అనుభవించి మార్చారు. వేరొకరు మార్చాలని విఫలు లయ్యారు. కలియని ధృవాలవంటి అన్నదమ్ములు.

వినీలాకాశంవేపు నిమీలిత నేత్రాలతో ఆదేపనిగా జూస్తూ తారాబాయి రెండు కళ్ళూ వొత్తుకుంది.



# నిజానికీ అబద్ధానికీ మధ్య



శ్రీకాంత్‌శర్మ

చూడండీ !— ఇది నిజం —.
అనిపించింది ఇప్పుడే —
నేను వెతకబోయే, ఒక సత్యాన్ని,
'అతను' నిరూపించడం — అందులోనూ
నేను ఎక్కువగా ప్రేమించే 'అతను' —
చిత్రం అనిపిస్తుంది — తెల్లబోతాను.

* * *

వేసవికాలం ఇంకా ముదరనప్పుడు —
కాలవనీరు చల్లగా ఉంది —
పడవ నడుస్తోంది —
చుక్కానిదగ్గర గుడ్డిదీపం వెలిగించుకొని పడవ ఆసామీ కూనిరాగాలు తీస్తున్నాడు. వెన్నెలలేదు —
చీకటి మనుషుల్ని కప్పుతోంది

వెలిగేగుడ్డిదీపం, కనీకనపడని మొహాల్ని తడుముతోంది —

దూరంగా....పడవఅంచున కూర్చుని కాలవనీళ్ళలోకి ఒక కాలు వేసి, కదుపుతూ - రెండోకాలు ఎత్తుచేసి, గడ్డం ఆన్చి – చుట్టూ మనుషుల మాటల్నీ – మినుకు మినుకుమనే నక్షత్రాల్ని చూస్తోన్న 'అతను'–మొదటి పరిచయం నాకు —

ఏం సంబంధంలేని కొందరి మనుషుల ముఖాల్లో కనిపించే ఒక ఆకర్షణ, దగ్గరికి లాగుతుంది – తెలీకండానే – మనల్ని–

'అతనూ' – అంతే —

ఖరీదైనపాంట్ – పొడుగు చేతుల చొక్కా– చల్లటిగాలికి ఎగిరిపడేజుట్టు –

అన్నిటినీ మించి ఆకర్షించే ఆ 'మౌనం' –

ఆనాడే–చూడగానే పలకరించా లని పించింది. అలాగే, మసకగా కనిపించే అతనికేసి చూస్తూ కూర్చున్నా –

నీటిని చీల్చుకువెళ్ళే పడవనడక – నీళ్ళచప్పుడు – రాత్రి –

కొందరి సాన్నిధ్యాన్ని, మాటలు అక్కర్లేకండానే,ఆనందంగాఅనుభవించ వచ్చనిపించింది – అదే మొదటిసారి – అలా అనిపించడం –

తెల తెలవార బోతోంది – పడవ ఆగింది – నిద్రపోయిన వాళ్ళు లేచి, తువాళ్ళు దులుపుకుని – ఒడ్డుకి దూకి వెళ్లి పోతున్నారు –

అతనూ దిగాడు –

నేనూ, పలకరిద్దామని ఒడ్డుమీదికి వచ్చేంతలో అతను చర చర నడిచి, ముందుకి వెళ్ళిపోయాడు.

ప్రత్యేకంగా పిలవడానికి – పేరుతెలీక కొంత – ఏం మాట్లాడ్డానికీ లేక కొంత– అడ్డువచ్చిన అహం కొంత – కారణం – పిలవకపోవడానికి —.

అతను వెళ్ళిపోయాడు —

ఆ చీకటిరాత్రి, చల్లనినీరూ, గాలీ, సాక్షిగా – నిజం – అతనంటే నా కిష్టం– అబద్ధంకాదు – ఆ పరిచయం ఈ నాటికీ జ్ఞాపకం !—

* * *

అలా – అయిపూరుకుంటే బాగుణ్ణు - కాని – అంతటితో ఆగక, ఇంకా జరిగింది కొంత —.

రెండోసారి – హఠాత్తుగా కాలేజీలో కనిపించాడు —

ఓ మిత్రుణ్ణి తొందరగా కలుసుకుని మాట్లాడదామని వెళుతూన్నా–దూరంగా, క్లాస్‌లోంచి వెళ్లిపోతూ కనిపించాడు –

పలకరించా లనిపించింది. ఈ సారి మరీ మరీ – కాని —

ఇప్పుడు ఇంకొకందుకు భయపడ్డాను– అతని తరహా చూస్తే – డబ్బున్న ఒక... 'అహం' తోస్తుంది – ఆ మౌనం మరీ– ఏదో గోడకట్టినట్టు అనిపిస్తుంది –

తప్పకండా మాట్లాడాలి –

నా అంతట నేనుకంటే – ఇద్దరికీ కలిసినస్నేహితుడు ఎవరన్నా పరిచయం చేస్తే బాగుణ్ణనికోరిక!—

దూరంగా మసలే మనుషులు ఒక తరహాగా బాధించి, వింతగా దగ్గరవుతారు — చిత్రం !— వాళ్ళ సాహచర్యం కోసమే — తెలియని తాపత్రయం.

* * *

అనుకున్నంతా జరిగింది —

రామావతారం కనిపించాడు ఓ రోజు— అతనితో — నాకు ఆత్రుత ఎక్కువైంది— కావాలనే ఎదురు వెళ్ళాను —

రామావతారం నన్ను పలకరించి, అతన్ని పరిచయం చేశాడు —

"ఈయన పేరు ఆనందమోహన్ — కాలేజీలో చదువుతున్నారు — మంచి స్నేహం కోరతారు.....ఇతను శర్మ — ఖాళీ ప్రస్తుతం—ఇతని మెదడు—ఉద్యోగం చేస్తున్నాడు —"

అత నీ పరిచయం విని నవ్వి —

"ఆహాఁ !—" అని —

"సాయంత్రం సరదాగా కాలేజీవైపు వస్తారా — కబుర్లు చెప్పుకుందాం — సరదాగా — అలా ఎటైనా వెళదాం — పనేమైనా ఉంటేమాత్రం, ఇంకోసారి కలుద్దాం - ఏమంటారు ?" అన్నాడు, చాలా సౌమ్యంగా —

రామావతారం, సాయంత్రం నాదగ్గిరకి వస్తానన్నాడు — కలిసివెళదాం—అన్నాడు. ఇద్దరూ వెళ్ళిపోయారు.

* * *

సాయంత్రం......

కాలేజీ వదిలారు —

సుబ్బారావూ, నేనూ కలిసివెళ్ళాం—

ఇద్దరం, లైబ్రరీకి ఎదురుగా ఉన్న తోటలో, సిమెంట్ బెంచీ మీద కూర్చున్నాం -

రామావతారం - అతనూ - ఎటో వెళ్ళుతూ లైబ్రరీదగ్గిరకి వస్తే - చప్పట్లు కొట్టి పిలిచాను. రామావతారం వస్తామన్నట్టు సౌంజ్ఞచేశాడు —

"అనుగ్రహించాడు -" అని నవ్వి, సుబ్బారావు కబుర్లు మొదలెట్టాడు —

లైబ్రరీ రూందగ్గిర ఎవరో నలుగురైదుగురు అమ్మాయిలు కనిపించడం — ఆనందమోహన్‌ని పలకరించడం — అతని సమాధానాన్ని వినిగాబోలు — పకపక నవ్వుకుంటూ వెళ్ళిపోవడం —

చెట్ల చాటునించి — చెదిరీ — కదిలీ — కనిపిస్తున్నాయి — మాకు —

రామావతారం, అతనూ, ఇనపతలుపు తోసి, లోపలికివచ్చారు —

"ఓ !—...అనుకున్నట్టూ వచ్చారే!—" అంటూ—థాంక్స్‌చెప్పి—ఆనందమోహన్ నవ్వుతూ వచ్చి కూర్చున్నాడు—

సుబ్బారావుకి అతని మీద ఏం అభిప్రాయం కలిగిందో ఇంకా తెలీలేదు -

"నువ్వూ కూర్చోరాముూ — " అన్నాడు ఆనందమోహన్ —

కాని, రామావతారం వినయం ప్రదర్శించి, "నీకుతెలుసో తెలీదో — ఈయన మంచి ఆర్టిష్టు శర్మా — బాగా పాడతారు — పత్రికల్లో అప్పుడప్పుడు

ఈయన బొమ్మలు పడుతొంటాయి —" అంటూ, ఫౌంటెన్ గట్టుమీద — నీటిజల్లు దగ్గిరగా కూర్చున్నాడు —

సుబ్బారావు వాళ్ళిద్దరివైపూ చూస్తున్నట్టున్నాడు — అన్నాడు —

"అహాఁ — అవును — ఎక్కడో పేరు చూసిన జ్ఞాపకం — మీ రన్నమాట —"

ఆనందమోహన్ సహజంగా అనాల్సినమాటగా — "పో నిద్దురూ — ఏవోపడతాయి - వాళ్ళు డబ్బిస్తారు - అవి మన ఖర్చులుకి చెల్లు—ఏది యేమయినా, నాకువచ్చిన ఈ మాత్రంపేరుకి రామావతారం కారణం — నిజంచెప్పాల్సివస్తే-"

"అదేంమాట — ఒట్టిదండీ -" అని ఏదో అనబొయ్యాడు -

"అహఁ - అలా అనకు - నువ్వేఅంత శ్రద్ధతీసుకోకపోతే — నేనెవర్ని — చెప్పు పోనీ — ఏవండీ — అంతేనా ! "— అన్నాడు మావైపు చూస్తూ —

"కావచ్చు - రామావతారం మనస్సలాంటిది -" అన్నాడు సుబ్బారావు -

కాసేపు మౌనం —

కవులూ, కథకులూ, చిత్రకారులూ - పాటలూ - అన్నిటిగురించీ, చక చక తోచిన నిర్వచనాలు చేసి ఊరుకున్నాడు-

మనిషిది కళాత్మకమైన శరీరం - చూడగానే ఆకర్షిస్తాడు - పెద్ద అందం లేదు - అతనిలో గొప్ప ఆకర్షణల్లా - ఆ మౌనం -

ఏవో స్వవిషయాలు - కళ్ళల్లో - మరి లోతుల్లో బాధఅనేది ఏమన్నా కదులుతుందేమో ! -

నన్ను చాలా ఆకర్షించాడు - కొన్ని నిర్వచనాలతో - రామావతారం అతన్ని వదలడుట - అలాఅని అతనే అన్నాడు -

మనిషిని మనిషి ప్రేమించడానికి ఏం అర్థం లేకపోవడం ముఖ్యలక్షణంగాబోలు -

అతన్నిచూస్తే - బాగా డబ్బున్నవాడని అనిపిస్తుంది -

రామావతారం సరే - అతనిగురించి నాకు తెలుసు -

ఆనందమోహన్‌లో మరో ముఖ్య విశేషం గుర్తించా-అతను ప్రపంచాన్ని, ఆనందాన్ని, ఎక్కువగా ప్రేమిస్తాడు - వాళ్ళచేత ప్రేమింపబడా లని ఆశిస్తాడు - ప్రయత్నిస్తాడు - బహుశా అసహ్యించుకోవడానికి ఎవళ్ళూ లేనట్టున్నారు - అదృష్టం - అతనిదికాదు-అసహ్యించుకోబడనివాళ్ళది -

రామావతారం - అతనూ, చీకటి పడేవరకూ మాతో కబుర్లుచెప్పి వెళ్ళిపోయాడు.

"అతను మనుషుల్లో మానవత్వాన్ని ఉపయోగించుకోగల డనడానికి నిదర్శనం అన్ని విధాలా అల్పు డని. అందరికీ అని పించే, రామావతారాన్ని అతనొక్కడే అదరించగలగడం -" అంటున్నాడు సుబ్బారావు - రాత్రి నాతో యింటికివచ్చి పడుకోబోయే ముందు.

ఎప్పుడన్నా రోడ్డుమీద కనిపిస్తే, చిరునవ్వుతో – "కులాసా!" – అని మాత్రం అని – "పనిఉంది" – అంటూ వెళ్ళిపోయేవాడు – గొప్ప స్నేహానికి చిహ్నం – ఆ స్నేహం మౌనంలో ఘనీభవించడం అంటాడు శాస్త్రి ఇప్పుడు అభిప్రాయం ఏమన్నా మారిందేమో ఉత్తరంరాసి కనుక్కోవాలి.

ఆఫీస్ ఇన్స్పెక్షన్ హడావిడిలో కొన్నాళ్ళపాటు అసలు ఊపిరి తిరగకుండా – ప్రపంచంలోంచి విడిపడి మిగిలిన ప్రత్యేకవ్యక్తిలా – యంత్రంలా – పని చేశాను.

ఆ రోజు సాయంత్రం ఆఫీస్ పని పాటు ఏపనీ మిగిలి పోకుండా, తలనుండి తొలగించి – కాఫీతాగి – రోడ్డుమీదికి వచ్చాను.

సాయంత్రం అయిదైంది.

దూరంగా రామావతారం రివ్వున సైకిల్ మీద వస్తూ నాదగ్గర వాలి –

"భాయీ – నీకోసం వెతుకుతున్నా – ఒక్క సహాయం చెయ్యాలి!" అన్నాడు, ఆయాసంగా – మొహంమీద చెమటతో.

"ఇంటికిరా – నెమ్మదిగా చెప్పు ఏమిటో –" అన్నాను.

నడుస్తున్నాం –

"నువ్వు చేస్తానని మాట ఇయ్యి –"

"సరే – చెప్పు –"

మొదలెట్టాడు – "నాకు వెంటనే ఓ పాతికరూపాయలు కావాలి."

"ఎందుకు?"

"ఎందుకా! – పరీక్షకి డబ్బుకట్టాలి – నువ్వోపాతిక ఇస్తే, మిగతాది ఇంకొందరి దగ్గర సర్దుబాటు చేసుకుంటా – మా నాన్నకి మానర్స్ లేవు – డబ్బు పంపాడనుకో – హోటల్కి – కాఫీలకి – ఇలా... వాటికే సరిపోయేలా గీసి గీసి పంపిస్తే, ఎలా చావడం చెప్పు – అందుకని... చెప్పడం మరిచిపోయాను – ఇంకో వారంలో పరీక్షకి కట్టాల్సిన డబ్బు పంపిస్తానని రాశాడు – చెప్పలేము ఎల్లుండే ఆఖరి రోజు – చెప్పేది ఏమిటంటే – నువ్వొక్క పాతిక – చాలు – మిగతాది నే చూసుకుంటా –"

రామావతారం సంగతి అంతే –

తండ్రి ఆస్తే లేనివాడేమో – నెలకి ఓ ఆరవై రూపాయలు లోప్రగా పంపుతాట్ట.

ఒకసారిగా జోలు... టెర్లిన్ షర్టూ – సాటింజన్ పాంట్ – వేసుకు కనిపించాడు.

డబ్బువస్తుంది – ఖర్చు చేస్తాడు.

లేనిరోజున మాసినవీ, చినిగినవీ – బట్టలు వేసుకుని – ఇల్లు కదలడు – అలా కూర్చుంటాడు. 'అబ్బ ఈ చాకళ్ళున్నారే – హారిబుల్' – అని వాళ్ళని తిడతాడు – పెద్ద ఇదిగా.

ఒక్కొక్కసారి తిండి ఉండదు – మోతుబరీగా కబుర్లు చెప్పి, నవ్వించి, మిత్రుల కారేజీల్లో మిగిలిన అన్నం

తినేసి, వాళ్ళదగ్గర కాస్త మొరటుహాస్యం వొలకబోసి – ఇంటికి చక్కావస్తాడు. దేనికీ సిగ్గుపడడు – దేన్నీ అసహ్యించుకోడు. జీవితంమీద ఓ నిశ్చితాభిప్రాయం లేదు.

ఓసారి అడిగాను ఎప్పుడో – జ్ఞాపకం లేదు –

"ఆ డబ్బు అలా విరజిమ్మి ఖర్చు చేసి – తరవాత ఇబ్బంది పడేబదులు ముందే కాస్త – చూసుకు ఖర్చుచేసుకోరాదూ !'' అని.

నవ్వి, అంటాడు – మనకి ఏడుపు రావచ్చు ఆ నవ్వుచూసి –

"ఇలాచూడు – నా చెయ్యిచూశావా – ఎన్నిచిల్లు లున్నాయో వేళ్ళ సందున – ఇంకేం నిలబడుతుంది చెప్పు డబ్బు – ఉన్నప్పుడు ఖర్చుచెయ్యాలి – లేనప్పుడు – మామూలే – ఉంటే ఆగేది లేదు – నా వీక్నెస్ అది –" అని

ఈ నాడు పరీక్షకి డబ్బు కట్టాలంటాడు – వాళ్ళ నాన్న పంపాడో మానాడో – అడక్కూడదు, అలా అయితే నా ముందుండడు.

"సరేలే – ఇస్తా" అన్నాను –

చాలా సంతోషించాడు – స్నేహం అనేదానిమీద చాలా పెద్ద వ్యాఖ్యానం చేశాడు.

స్నేహం హృదయాలకి పడ్డ ముడి అన్నాడు.

డబ్బు పోతే సంపాయించుకోవచ్చు – గొప్ప స్నేహం ఎలావస్తుంది – అన్నాడు.

డబ్బిచ్చాను.

పరీక్షకి డబ్బుకట్టేశాక మళ్ళీ కనిపిస్తానన్నాడు – వెళ్ళిపోయాడు.

అన్నాడుగనక మనం నమ్మాలి.

ఆ డబ్బు వెనక్కి రాదని తెలుసు – రానక్కర్లేదు – రామావతారం చెప్పినట్టు అది స్నేహౌన్నత్యం కాదు.

దేనికేనా తెగించే రామావతారం – అతని మనస్సు నిర్మలత్వం, ఇష్టం.

తనని తను నిలుపుకోలేని అశక్తతని చూస్తే – జాలేస్తుంది.

* * *

రామావతారం మనస్తత్వం ఇప్పటికీ నాకర్థం కాలేదు. ఎప్పటికీ కాదేమో కూడా.

ఈ డబ్బు – అడగడానికి ముందే, ఏదో సందర్భం వస్తే అడిగాను –

"ఎప్పుడన్నా ఆనందమోహన్ ఇంటికి వెళ్ళావా !''

"లేదు –" అన్నాడు.

"అదేం ! – అంత స్నేహితుడు గాదా !" అన్నాడు.

"అతనిది ఈవూరుకాదు – ఇక్కడికి దగ్గిరగా ఉన్న '......' – అతనిఊరు – వాళ్ళమ్మగారు అక్కడ ఉంటున్నారు – అక్కడో ఇల్లుందిట – నా అంతట నేనే – వస్తానన్నాను. రావద్దన్నాడు – డబ్బుని అసహ్యించుకోడం నేర్చుకోమన్నాడు. డబ్బే, గొప్పా, ఏదా




"అదృష్ట వంతుడివోయ్. మీ అల్లుడు డాక్టరుటగా, నీకు నడుం, ఒళ్ళునెప్పి బాగా తగ్గించా డని విన్నాను. ఇప్పుడే బాగా ఆరోగ్యంగా కనిపిస్తున్నావ్"

"అబ్బే అతను డాక్టరు కాదండి. ఇప్పుడు వంటపనీ అవీ అతనే చూస్తున్నాడు."

తారతమ్యాల్ని కలిగిస్తుం దన్నాడు–అంతా ఏకం కావా లన్నాడు. నా కేం కావా లన్నా– హోటల్ బిల్స్ – అవీ – అతనే చెల్లించే వాడు'' అని చెప్పాడు.

ఆనందమోహన్ వింతమనస్తత్వం, రామావతారం మాటల్లోకి వచ్చేసరికి – కొత్తరూపం తొడుక్కోలేదు గదా!

గొప్పవాళ్ళ గురించి పుస్తకాల్లో చేసిన వర్ణనలకీ, వాళ్ళ నిజ జీవితాలకీ ఏం సంబంధం ఉండదుట–రామావతారమే అన్నాడు వెనక – దీన్ని ఏవిధంగా అర్థం చేసుకోవాలి, అని – నా తికమక!

ఊహల్లో కనిపిస్తాడు ఆనంద మోహన్ – నవ్వుతాడు మనుషుల్ని చూసి – కొద్దిగా మాట్లాడతాడు – పత్రికల మించి డబ్బుచేస్తాడు – నలుగురి అల్పుల మధ్య గొప్పవాడుగా బతికి, వాళ్ళని ప్రేమిస్తూ బతకడం అతని జీవితాదర్శమేమో!–

* * *

ఏప్రియల్ నెలచివర –

పరీక్ష లయ్యాయిట – సుబ్బారావు ఆ సాయంత్రం సినిమాకి రమ్మన్నాడు.

ఆనంద మోహన్ వేసిన బొమ్మ లేవో కనిపించాయి ఆ మధ్య కొన్ని పత్రికల్లో – అతను – నాకుమాత్రం కనిపించలేదు. ఈ మధ్య రామావతారం సంగతే తెలియ లేదు.

సుబ్బారావు చెప్పాడు – ఆనంద మోహన్ ఆఖరి పరీక్షనాడు కనిపించాట్ట–

పలకరించాట్ట — వాళ్ళ వూరు త్వరలో వెళ్ళిపోతున్నట్టు చెపాట్ట – సుబ్బారావు తన ఆటోగ్రాఫ్ చూపించాడు – అందులో ఆనంద మోహన్ రాసిన వాక్యం – సుబ్బారావులాగే – నాకూ వింతగా కనిపించింది.

"మనిషికి సమాజంలో ఎప్పుడండీ గౌరవం–ఉదాహరణ నేనేఅనుకుంటా–"

అందులో ఒక 'అహం' తన అస్తిత్వాన్ని తను పరిపూర్ణంగా గుర్తించుకున్న ఒక రీతి–కనిపించాయి ముఖ్యంగా

సుబ్బారావు ఉగ్రుడయ్యాడు.

"తనలాగే షోకుగా బట్టలు వేసుకు తిరిగి, తనలాగే, ట్రిక్ లెక్కెట్టేవాడే– సమాజానికి గౌరవనీయుడు – కిట్టే బట్టతోనూ – సంస్కారంతోనూ కబుర్లు చెబితేనే గౌరవం అన్న మాట–ఇవి – లేనివాడు కాడనే నా – ఏమిటీమాటల్లో అర్థం ! అహంకారంతప్ప !"–

ఆటోగ్రాఫ్ లో ఆ కాయితం చింపి, అవతలపారేసి –

"అక్కడే చేద్దును ఈ పని – మర్యాదస్తుడుగదా అని ఊరుకున్నా !" అన్నాడు సుబ్బారావు. సినిమాకి వెళ్ళాం.

మాతో మరోఇద్దరు మిత్రులుకూడా వచ్చారు — సుబ్బారావూ, వాళ్ళూ కలిసి, టిక్కెట్లు తీస్తున్నారు – వక్క పొడి కొనుక్కువస్తానని కిళ్ళీకొట్టు దగ్గిరకి వెళ్ళాను.

రామావతారం అటు వచ్చేవాడల్లా — నన్ను చూసి, తప్పించుకు వెళ్ళిపోబోయాడు —

పిలిచాను – అడిగాను –

"పరీక్ష లెలారాశావు."

"పరీక్షలా !" — అని,

"బాగానేరాశాను–కాని...నీడబ్బు..." అని ఆగాడు —

"ఇప్పచ్చులే తరవాత—ఆఁ—ఆనంద మోహన్‌గా రున్నారా — వెళ్ళారా —" అన్నాను.

"నిన్ననే వెళ్ళాడు వాళ్ళవూరు — మళ్ళావస్తాట్ట — నన్ను వొదిలి వెళ్ళడానికి ఎంతో ఇదయ్యాడు–ఈసారి వాళ్ళవూరు– తీసికెళతాడట —"

దూరాన్న — సుబ్బారావూ, మా మిత్రులూ వస్తున్నారు.

"వెళతా — మరి —" అని తొందర తొందరగా వెళ్ళిపోయాడు రామావతారం.

సుబ్బారావు వచ్చాడు — నవ్వాడు.

"ఆ వెళ్ళేవాడు రామావతారం కదూ ?" అన్నాడు.

"అవును – అదేఁ" అన్నాను.

సుబ్బారావు మళ్ళీ అన్నాడు —

"డబ్బు అడుగుతానని భయంగాబోలు — ఏం అంటాడు నీతో ?"

"ఏం – నీ దగ్గరకూడా..."

"అంటే !— నీ దగ్గిరా నా ! ...." సుబ్బారావు ఆశ్చర్యపడ్డానికి కారణం తోచలేదు నాకు;

"ఆహా - నా దగ్గిరా ను - పోన్లే - పరీక్షకి కట్టుకుంటాడు అనిచ్చాను - బాగానే రాశాట్టలే పేపర్లు-" అన్నాను.

సుబ్బారావు నవ్వాడు మూడోసారి.

"ఏవిటిట రాస్త-ఆవందం. పరీక్షకి వాస్తేగా !"

"అంటే ?"- ఆశ్చర్య పడ్డాను -

"డబ్బుకట్టి మానేశాడా!"-అడిగాను.

"అంత తెలివితక్కువవాడు కాడు-ఆ డబ్బు ఆనంద మోహన్‌కి కట్టాడు."

సుబ్బారావు చెప్పేది అర్థం కావటం లేదు నాకు -

మళ్ళీ అన్నాడు- "ను వ్వేతారీఖున- ఏ నెలలో ఇచ్చావు -- ఆడబ్బు."

చెప్పాను - నవ్వాడు విని.

"సరిగ్గా అదేరోజున - నా దగ్గిరా - ముప్ఫయిరూపాయలుపట్టుకొనిపోయాడు బజార్లో సలిపి సలిపి - అలా కొంత దూరం వెళ్ళాడో లేదో అవతలి జంక్షన్ లోంచి సైకిల్ మీద ఆనంద మోహన్ రావడం, వీడు నవ్వుతూ జేబులోంచి ఏదో తీసిఇవ్వడం- ఇద్దరూ వెళ్ళిపోవడం మాత్రం కనిపించాయి-పరీక్షకి రాలేదన్న సంగతినిజం - మరి ఆ ఇచ్చింది !! - అర్థం అయిందా - మ నిద్దరికీ పెర్ ఫ్యూమ్డ్ మలామా - పోదాం - రా -"

నా మెదడు తలక్రిందు లైంది -

సినిమాకివెళ్ళినా మనస్సు మనస్సులో లేదు - ఆనంద మోహన్‌కి డబ్బివాల్సిన అవసరం రామావతారాని కేం వచ్చింది!

ఒకవేళ, ఆనంద మోహన్, వీడి కని పెట్టిన ఖర్చంతా - అప్పు తీర్చమని చంపాడా - ఎంత సేపూ రామావతారం ప్రాణస్నేహితుడు అనడంతప్ప, ఆ మాత్రం డబ్బున్నవాడు ఇవ్వలేడూ ?

రామావతారం ఎంత చాతకానివాడో అర్థం అవుతోంది.

నమ్మితే అలా - నమ్మేసెయ్యడమే!

రామావతారాన్ని చూస్తే మళ్ళీ మరో క్షణానికి ఏం అనిపిస్తుందో మనకే తెలియదు.

ఆనంద మోహన్ అర్థము కావడం మానేశాడు నాకు చాలాకాలం - ఎవళ్లూ కనిపించలే ఒసలు - సుబ్బారావు వాళ్ళ వూరు వెళ్ళిపోయాడు.

నా కేం తోచకండా ఓ సెలవురోజు రోడ్డుమీద తిరుగుతోన్నపుడు-

రామావతారం, 'అతనూ' కని పించారు - మంచిడ్రస్‌లో హాయిగా కబుర్లు చెప్పుకుంటూ.

ఆనంద మోహన్ పలకరించి -

"కాఫీతాగుదాంరండి-" అనిహోటల్ లోకి తీసుకువెళ్ళాడు -

చాలా బలవంతం చేసినా వినిపించు కోకుండా తనే బిల్ చెల్లించాడు.

మాట్లాడుతోండమని మాకు చెప్పి, రామావతారం మమ్మల్నిద్దర్నీ అక్కడ వదిలివెళ్ళాడు-మరో పది నిమషాల్లో వచ్చాడు - కార్టూన్ ఆర్ట్‌కి సంబంధించిన ఏవో పుస్తకాలు కొనుక్కుని.

"ఏం - నువ్వూ కొట్టూన్స్ వేద్దామనే నేవిఁటి..." అన్నాను.

రామావతారం- "ఇది మరీబాగుంది- నా కేంవచ్చూ!" అని నవ్వి - "ఆనంద మోహన్ కి" అన్నాడు.

"ఎంతైంది ?"- అన్నాడు ఆనంద మోహన్ పుస్తకాలు అందుకుంటూ.

"ఎంతైతే ఎందుకులే - అప్పుడే ఇచ్చెయ్యాలేమిటి అంటూ రామావతారం కూర్చున్నాడు.

"అదేవిఁటీ ?" - అని, పుస్తకాల ధరలుచూసి, ఒక అయిదురూపాయల నోటు అతని జేబులో కుక్కుతూ -" ఇదిగో - స్నేహందారి దానిది - డబ్బు దారి డబ్బుది. ఈ రెండింటికీ కలియదు- డబ్బుదగ్గిర స్నేహితు డయ్యేది - పరమ శత్రువులా వ్యవహరించాల్సి వస్తుంది - ఒకప్పుడు... అంచేత మాట్టాడకు !" అని లేచాడు ఆనందమోహన్ వెళదా మన్నట్టు నావైపు చూసి -

ముగ్గురం వచ్చేశాం -

రామావతారం - అతనూ - వెళ్ళి పోయారు. సుబ్బారావుకి ఈ సంగతి చెప్పాను తరవాత వాళ్ళవూరు వెళ్ళివచ్చి నప్పు డోసారి—అతనూ తికమకపడ్డాడు.

"ఏమోమరి, మన కేం తెలుస్తుంది - ఊహించడంతప్ప" అన్నాడు.

* * *

కాలేజీలు తెరిచారు - వొస్తున్నాను - స్టేషన్ కి వీలుచేసుకురమ్మని సుబ్బారావు ఉత్తరం రాశాడు.

ఇంకా పూర్తిగా తెల్లారలేదు.

ఓ వానజల్లు పడినట్టుంది రాత్రి - నేల తడి తడిగా ఉంది.

అప్పటికే...అప్పుడే వచ్చింది ట్రైలు - నే వెళ్ళగానే - సుబ్బారావు అప్పుడే దిగి, నాకోసంచుట్టూ చూస్తున్న వాళ్లా, నా పిలుపుతో - "వచ్చావా" - అని - ఏదో దూరంగా పట్టాలవైపు చూస్తూ.

"ఆ గుంపేవిఁటి ?" అన్నాడు.

ఎవళ్ళో చాలామంది అటువైపు పరిగెట్టి చూస్తున్నారు.

"పెడు చూద్దాం -" అన్నాను.

వెళ్ళాం -

రోడ్డుమీద ఒకపోలీస్ జీప్ వుంది - జనం - కేకలూ - మాటలూ -

"జేబులు వెతకండి"

"ఇదిగో - ఏదో కాగితంముక్కలు - పరుసూ --"

"అరే !- నెత్తురు !- నోట్లు !- అబ్బ ఎన్నో !-"

"రామ రామా - చూడలేం బాబూ-" పోలీసులు జన్నాన్ని గెంటుతున్నారు -

శవాన్ని చూశాం.

మొహం ముద్దఅయిపోయి భయంకరంగా ఉంది.

"బాబోయ్ - చూ డ లే ం - దా - పోదాం -'' అన్నాడు సుబ్బారావు.

ఇంటికి వచ్చేశాం -

రాత్రి ఎనిమిదిన్నర దాటింది.

మాసినబట్టలు లాండ్రిలో పడేద్దామని బయలుదేరాను.

లాండ్రిదగ్గిరకి వచ్చాను.

ఏదో ఘర్షణ జరుగుతోంది.

లోపల్నించి దూరంగా వినిపిస్తోంది.

లాండ్రి ఆసామిగాబోలు –

"పంతులి కింకెప్పుడూ బట్ట లివ్వ మాకండి – యె న కా ఇ ల్లా గే – టై యెక్కడో పారేశాడు – బుల్లిబాబుగారి పాంటుకి కన్నం యే సు కొ చ్చా డు – ఆయన – ఊ – ట లా యి స్తు న్నా డు – పాంటుకి కన్నం ప డిం చ ని – సూడు నాయ్యా – ఈ చొక్కా యీ ప మీ ద సిరుగు – ఎల్లపయ్యా – ఎల్లింక – డబ్బా ఆలిస్యవే – అల్లా సూస్తావే –"

"అయినడబ్బా తీ సు కుం టూ – రుంజుకుంటున్నాడు – రుంజుకోవడం – పొరపాటున విరిగిం దంటే – ఊహూ – కొట్టుకుపోతున్నాడు – మానెయ్ – నువ్వు కాకపోతే ఇంకో డిస్తాడు –"

దురుసుగా సమాధానం –

లాండ్రి మెట్లెక్కాను –

విసురుగా వచ్చే ఆనందమోహన్ నన్ను చూసి, ఉలికిపడి – తెల్లబోయి... మనిషి కుంచుకుపోయాడు.

లాండ్రి అతను తిట్టే తిట్లని అతని మెదడుగ్రహించడం మానుకున్నట్టుంది.

చరచర తలొంచి చీకట్లో కెళ్ళాడు.

నా ఊహకి శక్తి పోయింది –

వెనక్కి వచ్చేశాను.

వారం తరువాత ఒక ప్రకటన చూశాను ఒక పత్రికలో –

ఒక సేట్ ఇంటో దొంగతనం చేసి. తప్పించుకు పారిపోతూ – రైలుపట్టాలు దాటబోయి – పోలీసుల ఖంగారులో – రైలుకింద పడి మరణించిన వ్యక్తి పేరు రామావతారం – విద్యార్థి – అతని జేబులో టైప్ చేసిన పుత్తరంతాలూకు ఒకటి రెండుముక్కలు – నెత్తుట్లో తడిసిన వందరూపాయల నోరికాయి –

ఆ ఉత్తరం పూర్తిగా లేని కారణంగా – అతి[ ]ణం మీద తెలిసిన వాక్యం ఒక్కటే – ఆముక్కలు కలిపితే.

"జ్ఞాపకం ఉంది – రాత్రి వెళుతున్నా"

కింద ఏం సంతకాలులేవు – అడ్రస్ లేదు – పర్యాప్తు చేస్తున్నారు.

ఒక సంఘటన చూసినప్పుడు – వేర్వేరు మనుషులకి వేరు వేరు ఊహాలు కలుగుతాయి – కొన్ని నిజాన్ని ఆశ్రయిస్తాయి –

మరికొన్ని గాలిలో – గోలలో – కలుస్తాయి. నా కేమీ అర్థంకాలేదు.

రామావతారం చచ్చిపోయాడంటే నమ్మలేని నా ఊహతో నేను కొట్లాడడం తప్ప – కాని.

సుబ్బారావు ఆనాడు చింపిపారేసిన ఆటోగ్రాఫ్‌లో ఆనందమోహన్ వాక్యం – ఈ కథకి ముగింపు ఇవ్వగలదను కుంటున్నాను.





మాయలో మాయ



"ఏమి టాలోచిస్తున్నావు?"

ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది.

"ఎంత సేపయింది వచ్చి?" మొగం దాటు జేసుకోవాలనే ప్రయత్నంలో తడబడ్తూ కుర్చీని జేరింది వసంత. ఆమె చెంపల్ని ఆరిన నీటిచారల్ల వంక విస్తుపోయి చూడసాగాడు రావు.

"ఏం. యివాళ యెక్కడికీ పోవడం లేదా?... వెధవ వాన ఒకటి! ఏం చెయ్యానికీ తోచకుండా!...పోనీ, నవ లేవన్నా యిమ్మంటావా? మొన్నే కొన్నాను. స్టీన్ బెక్ ది, చాలా బాగుంది......రా, చూద్దువుగాని; యింకా చాలా ఉన్నాయి!"

ప్రశ్నలు, సమాధానాలు అన్నీ త నే చెప్పుకుంటూ కుర్చీలోంచి లేచి అలమార దగ్గరకి నడిచింది.

"అలా ఉన్నావేం ? ఒంటో బాగో లేదా ?''

"బాగోకేం ? నిక్షేపంలా ఉంది.'' అలమారదగ్గిరే తల వంచుకు నిలబడి అదోలా కృత్రిమంగా నవ్వింది.

"రా, యిలా వచ్చి కూర్చో."

కొద్దిసేపు ఏ దో ఆ లో చి ం చి, నెమ్మదిగా యెదుటుగ్గా వచ్చి కూర్చొంది వసంత. అత నలా చూస్తుంటే, ఏ ం చేయాలో తోచని సంభ్రమం, సిగ్గు కలిసి పోయిన అవసరలో, ఆకాశంమీద కొండ గీసిన గీతవంకా, టీపాయ్‌మీది వేస్‌లో ప్లాస్టిక్ పూలరేకుల వంకా, గోడమీది అజంతా ఫ్రెస్కో రాలూకు కాలెండరు బొమ్మ వంకా మార్చి చూడసాగింది.

''ఏడుస్తున్నావా ?''

''ఎందుకు ? ఏడు పెందుకు ?"

"అదే, నే నడిగేదీని ''

వసంత జవా బివ్వలేదు.

''టియర్స్ ! ఐడిల్ టియర్స్ !— అవునా !"

వసంత నిశ్శబ్దంగా కదిలే చేతి గడి యారం ముల్లు వంక ఆదేపనిగా చూడ సాగింది.

''ఈ కారు మబ్బులు కార్చే పేడి కన్నీరు, పచ్చని లేత చిగుళ్ళతో గాలి పిల్లల కేరింతలు, కొండ వదిలే నిట్టూర్పు లకి చలించి మసక తెరలుగా చె ది రి పోయిన నీటి తుంపర — ప్రకృతి కాంత నగ్న సౌందర్యం చూస్తుంటె, అమ్మాయి లేత మనసులో రసావేశం కట్టలు తెంచు కుంటోందా ?'' వసంత ఏ డ వ డా ని కి అంత కన్నా పెద్ద కారణం కనబడలేదు రావుకి.

వసంత నవ్వుతూ అ వు న న్న ట్టు తలాడించింది.

''ఏడవడం ఒక లగ్జరీ ; యీ మబ్బు లన్నీ నావి కావని యీ మూల కూర్చొని యేడుస్తా నంటా డొక మహాకవి !"

"కీట్సు గదూ !''

"కీట్సు ఒక్కడే కాదు. యి ం కా చాలామంది అన్నా రనుకో. యింతకీ వాళ్ళు రాసి ఊరుకున్నది నువ్వు చేసి చూపిస్తున్నావా ?"

వసంత కేం చెప్పాలో తోచలేదు.

రావు వచ్చిన ప ది రో జు ల్లో నూ, వాళ్ళిద్దరిమధ్యా మాటలు చాలా అసం బద్ధంగా, కష్టంమీద జరుగుతున్నాయి ; రోజూకన్న ఆవేళ మరీని.

"మా ట్లా డా ల ని లే దా ?" రా వు అన్నాడు చివరికి మెల్లిగా.

ఊరికే మామూలుగా అన్నాడో, లేక మనసులో ఏమన్నా పెట్టుకొని అంటు న్నాడో అర్థం కాలేదు వసంతకి. బాధగా అతని వంక ఒకసారి చూ సి క ళ్ళు దించుకుంది.

''నా కేమిటో మనసులో బాగాలేదు

బావా ! అంతకన్నా యింకేం లేదు."

"సినిమాకి పోదాం రా."

"పోనిద్దూ. అంతకన్నా యింటో కూర్చొని కబుర్లు చెప్పుకుంటూంటే హాయిగా ఉంటుంది."

"యిద్దరం కూర్చొంటే కబుర్లు రావు — ఆలోచనలు తప్పించి. ఆలోచించిన కొద్దీ యింకా యింకా ఊబిలోకి దిగిపోతున్నట్టుంటుంది !"

"ఏం, అలా ఉంటే బాగుండదూ ! ఆ కలతలో ఆ వేదనలో ఎంత మాధుర్యం, ఆనందం !"

రావు నవ్వుతూ లేచాడు.

"నేను వెళ్తాను మరయితే."

"అది కాదు. కూర్చో బావా ? యెక్కడికి పోతావు యీ చినుకూ, గాలిలో ! కాలక్షేపం కావాలంటే, కార్డ్స్ తీసుకొస్తాను. చదరంగం కూడా ఉంది గాని నాకు సరిగా రాదు మరి ! రెండు యెత్తుల్లోనే కట్టేస్తావేమో !...ఎందుకూ, కార్డ్స్ ఆడదాం..." వసంత నిలబడి బతిమాలుతున్నట్టు, మందలిస్తున్నట్టు, దీనంగా, కోపంగా, నవ్వుతూ తొందరగా చెప్పింది.

"ఫర్వాలేదులే, అంత జాలి చూపక్కర్లేదు గాని — నేను వెళ్ళాలి. కోమలి కనిపెట్టుకుంటుంది."

వసంత మాట్లాడకుండా తల దించుకుంది. ఈ అయిదారు రోజుల్లో నూ యించుమించు ప్రతిసారీ, ఎక్కడ మొదలయినా ఆమె ఆలోచనలు సరిగ్గా అక్కడే ఆగిపోతున్నాయి. రావు వెళ్ళిపోయాడు.

తలుపు గడియ వేసి కిటికీ దగ్గర నిలబడింది. రావు గేటు తీసుకొని, బయటికి వెళ్ళడం కనబడింది.

ఆకాశంలో ఒకమేర కొద్దిగా తెలుపయింది. వెనకాల మబ్బు లున్న మేర నల్లగా చీకటి కమ్ముతుంటే, రావు ఎర్రని శరీరం తెల్లటి బట్టలు కాంతి రెట్టింపు చేసుకొని వెలుగుతున్నాయి.

వసంత అతనివంక అలాగే చూసింది.

అతను మలుపు దాటాడు.

ఒక్కసారిగా అంతులేని బాధని గుండెలోకి దిమ్మరించినట్టయింది. నిలబడలేనంత నీరసం కమ్ముకుంటూంటే మంచంమీద వాలిపోయి దిండులో తల దూర్చింది వసంత.

కోమలి ! కోమలి యెవరు ? కోమలి అతని కెలా తెలుసు ? వాళ్ళిద్దరికీ యేమిటి సంబంధం ? ప్రతీ రోజూ, గార్డెన్లో, సినిమా హాల్లో, టాంక్‌బండ్ మీద ఎక్కడో చోట 'రెండవూ' ఏర్పర్చుకొని తప్పనిసరిగా కలుసుకోకపోతే ఉండలేనంతటి ఆత్మీయురాలా ?

ఆ రోజు ఉదయాన్నే ఫోన్ మ్రోగింది. రావు మేడమీద ఉన్నాడు. మూర్తిగారు స్నానాని కెళ్ళారు. పార్వతమ్మగారు పూజలో ఉంది. నౌకరెవడూ దగ్గర్లో లేడు. వసంత ఫోన్

యెత్తింది. అవతల యెవరో ఆడగొంతు. అనుమానం నిజమవగానే మెట్లవంక చూస్తూ మాటలు కలిపింది.

''రామారావుగా రున్నారాండీ?''

''ఉన్నారు; మీ రెవరు?''

"కోమలి."

"ఏం, పని?"

''ఉంటే, ఆయన్ని కొంచెం పిలవండి.''

''ఆయనొచ్చేసరికి పావు గంటయినా కనీసం పడుతుంది. మీరు చెప్పే దేదో రహస్యం కాకపోతే నాతో చెప్పండి. లేకపోతే, ఓ అరగంట ఆగి మళ్ళా రింగ్ చెయ్యండి...నే నాయన కజిన్ — వసంత." కొంచెం విసుగ్గా అంది.

"సారీ, మీ రనుకోలేదు; మోర్నింగ్!...రహస్యం యేం లేదు.." కోమలి చేసిన ఆలస్యానికి కారణం. ఆశ్చర్యం తడబడ్డం లాంటివా లేక మామూలుగా జరిగేదేనా! — ఆలోచించింది వసంత.

ఏమిటో! మెద డంతా పెద్ద ఫాక్టరీలా గయి, డిటెక్టివ్‌ల మల్లే ప్రతీ చిన్న విషయంపైనా అదేపనిగా ఆలోచిస్తోంది. తను చెప్పింది అబద్ధం. అతన్ని పిలిస్తే నిమిషంలో వచ్చేవాడు: యితరుల విషయాల్లో జోక్యం కలిగించుకోడం తప్పు అన్న జ్ఞానం నేరం చేసినట్టు మాటి మాటికీ తట్టి చెప్తోంది. కోమలి చెప్పే సందేశం ఎలాంటిదో రహస్య మవునో కాదో తెలుసుకోవా లన్న ఉత్కంఠ తీరిందిగాని యీ బాధ యెక్కువైంది. ఇంతకీ కోమలి చెప్పబోయింది, నిన్న అనుకున్న సినిమాకి గాదు, యింకోదానికి వెళ్దా మని. అదికాస్తా చెప్పాక తనని కూడా రమ్మంది.

అప్పుడు గుర్తు కొచ్చింది వసంతకి — కోమలి చెప్పిన మాటలు అతనికి జేరెయ్యలేదని. అ దింకో నేరం! రావుకా సంగతి చెప్పడం మాని, పైగా అతన్ని వెళ్ళకుండా ఆపాలని చూసింది! తెలిశాక తనని గురించి ఏమనుకుంటాడు! వసంతకి మనసు ముక్కలవుతున్నట్టుంది, క్షణ క్షణానికి యెక్కువగా.

ఆరోజు ఆమె జీవిత చరిత్రలో అతి విషాదకరమైందిగా పెద్ద పెద్ద అక్షరాల్తో చెక్కబడుతుంది. అనుకోని, ఊహించని సంఘటనలు యెన్నో ఆమె మూలంగా జరిగిపోతున్నాయి, ఆమెతో నిమిత్తం లేకుండా.

నిజానికి గడిచిన వారం పదిరోజుల్లోనూ కొన్ని కొన్ని మాటలు, చేతలు ఆమె యిష్టా యిష్టాలని అధిగమించి వాటంతటవే జరిగిపోతున్నాయి. జరిగినాక, ప్రతీ మాటా, ప్రతీ చేతా ఏదో అనవసరమైన ప్రాముఖ్యాన్ని తెచ్చి పెట్టుకుంటోంది — కనీసం, ఆమె దృష్టిలో.

* * *

రావు వచ్చి పదిరోజు లవుతుంది. మూడేళ్ళ క్రింద చూసిన చూడ్డం.



"పన్నెండో నెంబరు ఇంటాయని ఏమన్నాడు ? నీటిబిల్లుకూడా కడరానన్నాడా ?"

"ఆఁ. ఇంటిపన్నుకూడా ఆయనే కడతానన్నాడు ఇల్లు ఆయన పేర రాస్తే"

మూడేళ్ళ నాటికీ, యిప్పటికీ పరిస్థితుల్లో చాలా మార్పు వచ్చింది. మూడేళ్ళ క్రితం - అతను థర్డియర్ చదువుతూండేవాడు. ఆమె అప్పుడే కాలేజిలో అడుగు పెట్టింది. యిద్దరి మధ్యా బంధుత్వాన్ని బట్టి, సాన్నిహిత్యం, స్నేహం, అందులో కొద్దిపాటి చనువు ఉండేవి, అంతే. అంతకన్నా వేరే ఆలోచనలకి అప్పటిలో చోటులేదు.

మూడేళ్ళ తర్వాత. రావుకి జీవితంలో ఒక స్థాయి, పరపతి ఏర్పడ్డాయి. యిదివరకటిలా ఊహల్ని గాలిపటల్లా ఆకాశంలో ఎగరేసి అవి చేరిన యెత్తుల్ని చూసి మురిసిపోయే కళాజీవి గాదు. ఆ యెత్తుల్ని స్వయంగా జేరి, సాధించిన విజయాలకి తృప్తిపడే ఠీవి, గర్వం అతనిలో కనబడతాయి. రావు జీవితంలో వచ్చే మార్పులకి తన పైన ప్రభావం ఎలాంటిదో గుర్తించలేనంత దూరంగా లేదు వాస్తవానికి — వసంత.

రామారావు పుట్టి పెరిగింది రోజా పూలపాన్పు కాకపోయినా, యెన్నడూ ముళ్ళలాంటివి గుచ్చుకోలేదతన్ని. యించుమించు ఒక సరళరేఖ అతని బతుకు. స్కూలునుంచి కాలేజి, కాలేజి నుంచి యూనివర్సిటీ, అన్నీ ఒకదాని తర్వాత ఒకటి దాటి సరాసరి ఉద్యోగంలో జేరాడు. చదువులో వెనకబడ్డం లేదు.

నిరుద్యోగం లేదు. చదవా లనుకున్నది చదివాడు, అందువల్ల వచ్చే లా భా లు అనుభవిస్తున్నాడు.

వసంతకి జ్ఞాన మొచ్చినప్పట్నుంచీ తనబతుకు అతనితో ముడిపడుతుం దని తెలుసు. అది చాలా మామూలుగా, సహజంగా కనబడేది. నీరు పల్ల మెరుగు నన్న దెంత కటికనిజమో, యిదీ అంతే. దాన్ని మార్చడం మనిషితరం గాదని అందరి మనస్సుల్లోనూ ఉండేది. అందుకే వసంత ఎంతవరకు చదవాలో, ఏది చదవాలో అంతా రావుతో మాట్లాడాకనే నిర్ణయించడం జరిగింది. రావుకి ఇంగ్లీషు సాహిత్యంపై అపరిమితమైన మోజు. అందులో డిగ్రీ పొందలేకపోవడం అతనెన్నటికీ మర్చిపోలేని బాధల్లో ఒకటి. ఆ కోరిక వసంతద్వారా తీర్చుకోవా లని అత ననుకున్నాడు. ఆమె అం గీ క రించింది.

అయితే, యీ సంగతు లన్నీ యిలా ఉంచి వసంతలో అప్పుడప్పుడు కొత్త కొత్త ఆలోచనలు వచ్చేవి — ముఖ్యంగా వయసులోనూ, వయసుకన్నా యెక్కువగా జ్ఞానంలోనూ పెరిగినకొద్దీ వడ్డించిన విస్తరన్నట్టు, పుట్టగానే బ్రతుకుబాట నిర్ణయించేసి యిలానే నడిచిపొమ్మంటే, తలొంచుకుని కళ్ళు మూసుకొని, తన స్వేచ్ఛ, తన స్వంతఊహలు, ఆలోచనలు అన్నీ గజంలోతున పాతిపెట్టి, పోవాల్సిందేనా ? అతను జీవితంలో ఓటమి నెరుగని వాడు కావచ్చు; అందంచ, దువు, ఉద్యోగం వగైరా లక్షణా లుండవచ్చు; అయితే మాత్రం తనమీద అధికారాన్ని అల బానిసలా పుట్టగానే అతని కప్పజెప్పాలనెక్కడుంది ! అలాంటి సమయాల్లో రావులో లోపాలు కొట్టొచ్చినట్టు కనబడి వసంత ఆలోచనలకి బలం చేకూర్చేవి.

అతనిలో, తన అభిప్రాయాలే సరైన వన్న మొండితనం; అవి యి త రు లు తప్పనిసరిగాఅంగీగరించాలన్న పట్టుదల అలా లొంగనివాళ్ళకి దూరంగా పోయేటంతటి అహం ఉన్నా యని అనుమానం వసంత కా విషయాలు గుర్తుకొచ్చినప్పుడల్లా తిరగబడా లనిపించేది — యెవరి మీదో, యెందుకో, యెంతవరకో సరిగ తెలియకపోయినా.

అవన్నీ అప్పుడప్పుడు తాకి, వెనక్కి జారిపోయే ఆలోచనల కెరటాలు. ఆమె యెన్నడూ యెటూ బలంగా నిర్ణయించ లేదు. మిగతావాళ్ళ దృష్టిలో పరిస్థితి మామూలుగానే ఉంది. మార్పేమన్నా ఉంటే, అది ఇదివరకటి అభిప్రాయాల్ని మరింత దృఢం, పటిష్ఠం చేసిం దనాలి

ఏడాదినుంచి పంపుతున్న ఆహ్వానాలకి సమాధానంగా రావు వచ్చాడు పది రోజులకిందట. వచ్చేదానికివారంరోజులు ముందు వస్తున్నట్టు రాశాడు. ఆ వారం రోజులూ వసంతలో రకరకాల ఆలోచనలు, పరిపరి విధాల మనసుని చిందరవందర జేశాయి. అత న్నెలా పలక

'రించాలి ? ఇదివరకట్లా నువ్వు అనాలా ! 'మీరు' అనాలా ! సిగ్గుపడి కనబడ కూడదా; ఇందివరకటంతటి చనువుగా కాకపోయినా మామూలుగా వుండొచ్చా? ప్రతీదీ అనుమానమే. చివరికి మనిషి గురించి తన నెందు కింతగా పట్టించు కోవా లన్న నిర్లక్ష్యం వచ్చింది.

రావు వచ్చాడు, ఉదయం ఎనిమిది గంటలకి. గదిలోంచి బయటికి రాలేదు - రాలేకపోయిం దంతే; కారణం ఏం లేదు. కాసేపు ఏమిటీ జైలని విసుక్కుంది. చేయగలిగిం దేమీ కనబడలేదు.

సాయంకాలం మూర్తిగా రింకాయింటికి రాలేదు. తల్లి వంటింటో ఉంది; మేడ మీంచి కబురు పట్టుకొచ్చాడు వెంకయ్య; పైకి రమ్మని పిలుపు. అతనే రాగూడదూ? ఆజ్ఞాపన కాబోలు ! వెళ్ళాలా, మానాలా? వెళ్ళకపోతేఅనాగరికంగాఉంటుందేమో! పైగా సిగ్గుపడుతుం దనుకుంటాడు ! ఆ ఆలోచన రాగానే వసంత ఒక నిర్ణ యానికొచ్చింది. జం కెందుకు ? కనీసం అలాంటి దేం లేనట్టు అతనికి కనబడ్డం మంచిది.

రావు మంచంమీద పడుకుని ఏదో చదువుతున్నాడు. ఆమెని చూడగానే పుస్తకం అవతల పడేసి కుర్చీ మంచం పైపు తిప్పి, కూర్చో మన్నాడు. ఆమె తలవంచుకు కూర్చుంది.

ఎంతకీ కాలంగడవనట్టుంది వసంతకి. ఏం మాట్లాడుతాడు ? ఏం మాట్లాడితే ఎలా సమాధాన మివ్వాలో ఊహిస్తోంది.

"నేను ప్రొద్దున్న ఎనిమిది గంటల కొచ్చాను !" నవ్వాడు రావు.

"విన్నాను" అంది మెల్లగా. అతను నిరుత్సాహ పడా లని ఆమె ఆశ.

"పదిగంటలు పట్టింది. అమ్మాయిగారి దర్శనం కావడానికి !''

''దొరగారు దిగగానే హారతి పాడా లేమిటి ?'' వసంత అతనివంక ఒకసారి చూసి వ్యంగ్యాన్ని సాధ్యమైనంతగా కప్పి పుచ్చడానికి ప్రయత్నించింది.

''అదిగాదు !....పోనీలేగాని, ఎలా రాశావు ఎగ్జామ్స్ ?"

''బాగానే రాశా ననుకుంటున్నాను !''

"క్లాసు వస్తుందా ?"

''రాదేమో; అంత బాగా రాశా నను కోను."

రావు కాసేపు మాట్లాడలేదు.

''ఉత్తరం రాస్తే జవా బివ్వవేం ?''

"నేనురాసిన నెలకిగాని జవాబివ్వక పోతే యెన్నాళ్ళకని పెట్టుకు కూర్చోను ?''

''టూర్లో ఉన్నప్పుడు ఒక్కసారేగా ఆలశ్య మయింది !"

''నేనూ ఒక్కసారేగా రాయడ మ్మానే సింది !'' వసంతకి అనుకోకుండా నవ్వొచ్చింది. అంతవరకు లోపల పేరుకున్న గడ్డ కరుగుతున్న ట్టుంది,

ఆ సాయంకాలం మాట లన్నీ అలాగే జరిగిపోయాయి. అత నేదో అనడం,

ఆమె తగినట్టు కర్ట్‌గా జవాబివ్వడంతో సరిపోయింది. ఇప్పట్నుంచీ 'పవిత్ర భారత నారీశిరోమణి' అన్నట్టు తల వంచడంకన్నా కొద్దిగా వ్యక్తిత్వం ప్రదర్శించి తనకీ కొన్ని నిశ్చిత అభిప్రాయా లున్నట్టు ప్రకటించాలని ఆమె సంకల్పం. అయితే ఎక్కడ వ్యక్తిత్వం ఆఖరయి అహం మొదలవుతుందో, అతనికి తనిప్పుడు పడుచుకున్న 'మందు' సరైన మోతాదెంతవరకో, ఆమె అంతగా ఆలోచించలేదు. అతని గదిలోంచి వచ్చేస్తుంటే, ఆమెలో అతని అహాన్ని, ఆధిక్యాన్ని ఎదిర్చి నిలబడగలిగిందన్న తృప్తి మిగిలింది.

ఆ మర్నాడు ఉదయం.

"మరీ అంత పట్టనట్టుంటా వేమే! అత నేమనుకుంటాడో!" అంది తల్లి.

"నేను బయటికి పోతాను, అమ్మ పనిలో ఉంటుంది. ఇంకెవరూ లేరు గదా! అతగాడికి విసుగొచ్చి, రేపే పోతా ననకుండా చూడమ్మా!" అన్నాడు తండ్రి, ఆ మాటల వెనక అర్థాన్ని కళ్ళతో చెప్తూ.

తల్లీ తండ్రీ అతని కిచ్చే ప్రాముఖ్యాన్ని తల్చుకుంటే యింకా చిన్నతనంగా అనిపించింది వసంతకి.

* * *

ఆ సాయంకాలం. గది తలుపులు జేరవేసి కిటికీ దగ్గిర నిలబడి తల దువ్వుకుంటోంది. అతను గదిలో కొచ్చి గుమ్మం దగ్గిరే నిలబడ్డం అద్దంలో కనబడింది.

"తలుపు తట్టి, రావడం మర్యాదేమో: ముఖ్యంగా ఆడవాళ్ళ గదిలో కొచ్చేప్పుడు!" వసంత కొంటెగా నవ్వుతూ చూసింది అతనివంక.

"ఓ, సారీ!...హాల్లో ఉంటాను. వీలయితే అయిదు నిముషాల్లో రా" అతను వెళ్ళిపోయాడు తలుపు మూసి. వసంత నవ్వుకుంది.

ఆ తర్వాత పావుగంటకి గాని ఆమె తయారవడం పడలేదు. హాల్లో అతను పేపరు చదువుతున్నాడు.

"ఆలస్యమయింది; ఏమనుకోకు"

"అనుకోడాని కేముందిలే; అలా యెక్కడికైనా వస్తావా?"

"ఎక్కడికి?"

"అలా పోదాం ఎక్కడికి వెళ్ళాం, ఎంతసేపు కూర్చుందాం, ఏం మాట్లాడదాం యివన్నీ ఆలోచించుకు వెళ్తే అదేదో రాజకీయ సమావేశ మనిపించుకుంటుంది గాని..." రావు తర్వాత మాటలు పూర్తి చెయ్యకుండా నసిగేశాడు. వసంతకి నవ్వొచ్చింది. 'ఫర్వాలేదు! దారిలో కొస్తున్నాడు! నిన్నటి అధికారం ఇవాళ గొంతులో కనబడ్డం లేదు!' అనుకుంది. కొంత తృప్తి, మరికొంత చొరవ చోటు జేసుకున్నాయి. మనసు యింకా కాస్త తృప్తికోసం ఆరాటపడింది.

తోటలో క్రవంతెన కవతల నీళ్ళ



ఒడ్డున చెట్టుచాటుకి దారి తీశాడు రావు. కాసేపు నిశ్శబ్దం. తర్వాత మెల్లిగా మొదలై, రకరకాల విషయాలు దొర్లి పోతున్నాయి. సినిమాల ప్రసక్తి వచ్చింది.

"నీ కథల్లాగానే ఉంది అది కూడా!" వసంత అంది, కొద్దిగా విసుగు, హాస్యం మిలాయించి.

రామారావుకి తన కథల గురించి ఎలాంటి వ్యాఖ్యానాలూ వినాలని ఉండదు; విమర్శలు అసలు కిట్టవు!

"సినిమా కేం, చాలా బాగుంది!" అన్నాడు మామూలుగా నవ్వడానికి ప్రయత్నిస్తూ.

"అదే చెబుతున్నాగా!" మెచ్చుకో కేంచేస్తా వన్నట్టు చూసింది. రావు కొద్ది సేపు ఆమె మొగంలోకి పరిశీలనగా చూశాడు. యింకా వేళ్ళకి మామూలు మనిషి కాలేదు. చాలా సున్నితమైన చోట తగిలిన గాయ మది. ఆ గాయం చెయ్యాలని చేశాక లభించిన తృప్తితో కొద్దిసేపు చాలా హాయిగా ఉంది వసంతకి. తర్వాత యింటికి వచ్చేస్తూ అతనేం మాట్లాడకపోవడం చూసి, అలా అనకపోతే బాగుండేదేమో ననుకుంది. అయినా, అందులో అంత పట్టించుకోవాల్సిం దేం కనబడలేదు. ఆ మాత్రం హాస్యం – తననుంచి – భరించగల గాలంత్రీ లేకపోతే యింకెందుకు?

* * *

మర్నాడుదయం వసంత చాలా హాయిగా, ఉల్లాసంగా లేచింది, రేడియో పాకిస్తాన్ మేలుకొలుపులికి. రెండు రోజులనాటి బిడియం, అనుమానం

వగైరా లేం లేవు. ఉదయాన్నే - అతని గదిలోకి తనే కాఫీ తీసికెళ్ళింది. అతను మంచం వెనక ఎత్తుగా లేచిన కమ్మీమీద తల పెట్టి ఏదో చదువుతున్నాడు.

''యివాళ యింత దయ కలిగిందేం?''

''ఎప్పటికైనా యీ సేవ చెయ్యాల్సిందేగా !''

"బలవంత మేముంది?" అందంగా దిద్దిన జ్యోతిలాంటి బొట్టువంక చూస్తూ అన్నాడు రావు.

ఆ మాట బాణంలా తగిలింది; అర్థం పూర్తిగా తట్టకపోయినా. అతని కళ్ళు ఏవో గూఢార్థాన్ని దాస్తున్నట్టున్నాయి. బలవంతం లేనిది సేవ చెయ్యడానికా, లేక... ! 'యిష్టం లేకపోతే మానెయ్యి, నాకేం పట్టింపు లే'దని చెప్పడమా? అతని అభిప్రాయాలు మారుతున్నాయన్న మాట. అంతదాకా తిరుగులే దనుకున్నది. యిప్పుడు అనిశ్చయంగా గాలిలో వేలాడుతోందన్న మాట. వసంతకి కొత్తరకం ఆలోచనలు మొదటిసారి కలిగాయి. అతను ఆమె మొగాన్ని చదువుతున్నట్టు చూస్తూంటే, ఆమె కోపం మొగంమీద కనబడిపోకుండా దాచుకోవా లని చూసింది. అతనిలాగే తనూ ఏదో ఒకటి అనేస్తేనేగాని మనశ్శాంతి దక్కేట్టు లేదు.

"యివాళ గోల్కొండ వస్తావా ?'' కాసేపటి కన్నా డతను.

"పని లేకపోతే సరి !"

"పని లేదుగా మరి !"

"అది కాదు నే ననేది !"

"మరింకేమిటి ? అనేదేమిటో ఒక్కసారే స్పష్టంగా అనకూడదూ !"

"అలా తిరగడాలు నాకు నచ్చవు.''

''నాతో కూడానా ?"

"అంతే అర్థం !" - నువ్వు పైనుంచి దిగి రాలేదుగా అన్నట్టు చూసింది.

రావు సాసర్లో కాఫీ వంక చూశాడు. ఆ తర్వాత మరి కాసేపు ఏదో మాట్లాడి వచ్చేసింది.

ఆరోజు కింక అతనిని, ఏవో కొద్ది నిమిషాలు తప్పిస్తే, చూడ్డం పడలేదు. సాయంకాలం కనబడకపోతే గదిలోనే ఉండిపోయా డనుకుంది. కాని వెంకయ్య చెప్పాడు ఏడింటికి - నాలుగింటికే వెళ్ళిపోయా రని ; రాత్రి వచ్చేసరికి పదవుతుందని అమ్మగారితో చెప్పమన్నా రని.

వసంతకి మొదట కొద్దిగా బాధ అనిపించింది. అయితే,... తన ప్రయోగాలు ఫలిస్తున్నా యన్న గుర్తింపు కొంత ఉపశమనం కలిగించింది కొంత సేపు. మహాఅయితే ఆరోజూ, మర్నాడూ అలా వెళ్తాడేమో ! అంతకన్నా యేం జరగదు!

కాని ఆమె అంచనాలు తారుమారైనా యన్న సంగతి తెలిసింది ఆ తర్వాత నాలుగు రోజులకి. ఆ నాలుగు రోజుల్లోనూ అసలు వాళ్ళిద్దరిమధ్యా మాటలు కలియలేదు. మొదట యింకా వేడి తగ్గలే దనుకుంది ; ఆ తర్వాత అతను ముందు

మాట్లాడితేనేగాని మాట్లాడకూడ దను కుంది. మొత్తానికి యిద్దరి మధ్య వాతావరణం స్తంభించింది ఆ నాలుగు రోజులూ.

క్రితంరోజుఉదయం—వసంత మెట్లపైనుంది. రావు హాల్లో అటువైపు తిరిగి నిలబడి ఉన్నాడు. కుడిచెయ్యి పాంట్ జేబులోకి పోనిచ్చి ఎడంచేత్తో ఫోన్ పట్టుకుని కాలితో టేబిల్‌ని తన్నిపెట్టి షోగ్గా నవ్వుతూ మెల్లిగా మాట్లాడుతున్నాడు. ఆగొంతు చాలా సన్నిహితంగా తియ్యగా వస్తోంది. ఆమెతో యెన్నడూ అంత గోముగా మాట్లాడలేదు. వసంత ఆగి అటే చూసింది; మాటలు సరిగ్గా వినబడ్డంలేదు.

"జస్ట్ ఏ మినిట్ కోమలీ! యింటో అడిగి చెప్తాను." రావు తటాలున వెనక్కి తిరగ్గానే ఎదురుగా ఆమెని చూశాడు. వెంటనే మొగం చిట్లించి లోపలికి వెళ్ళాడు. లోపల మాటలు వినబడ్డాయి.

"యివాళ ఓ ఫ్రెండ్ యింట్లో లంచ్‌కి పిలిచార త్తయ్యా! నాకు వండకు."

"ఆదేమిటోయ్! ఉన్న రెండు రోజుల్లోనూ..." కాసేపు వాదం జరిగింది. చివర్న "సరే, నీ ఇష్టం." అంది పార్వతమ్మ.

రావు మళ్ళీ వచ్చాడు హాల్లోకి.

"హల్లో, కో! అనుమతిదొరికింది."

.........

"స్ట్రెస్లీ!"

అతను గట్టిగా నవ్వి ఫోను పెట్టేసి ఎటో బయటికి వెళ్ళాడు. తిరిగి గదిలోకి వెళ్ళేటప్పుడు మెట్లమీద తనని పలకరించితీరతా డనుకుంది వసంత. కాని, అలా జరగలేదు. ఆ తర్వాత ఆమెకి ఒక వేళ తనతో మాట్లాడాల్సివస్తుం దనే అలా వెళ్ళిపోయాడేమో అని అనుమానమేసింది. ఏదీ యిదమిత్థ మని తేలలేదు. కాని అమితంగా వేధిస్తోంది.

ఆరోజు మొదలు ఆమె ఆమె కాదు.

ఎవ రీ కోమలి; పైగా 'కో' అని ముద్దుపేరు కూడాను! అస లా మనిషి నిజమా, లేకపోతే ఊరికే తనని యిబ్బంది పెట్టడానికి యెత్తు వేశాడా? కొంతసేపు యీ 'కోమలి' అనే పేరుతో పిలవబడే వ్యక్తి ఆడది అయ్యుండ దనుకుంది. ఎవరో మగ స్నేహితు డయ్యుంటాడు—కోమలరావో, కమలాకరరావో: అత గాడ్ని పట్టుకుని అలా పిలిచి తనని సాధించా లనుకు నుంటాడు. కథలు రాసే వాళ్ళకి పుట్టే ఐడియా లన్నీ యిలాంటివే!

కాని... అతను మాట్లాడే ధోరణి మగాడితో మాట్లాడుతున్నట్టు లేదు. మరీ అంత లాలిస్తున్నట్టు మాట్లాడతాడేం? ఎవరూ వినకూడ దన్నట్లు మెల్లిగా!

ఇప్పుడైనా మించిపోయిం దేం లేదు; మామూలుగా చనువుగా మాట్లాడేస్తే సరిపోతుందేమో అనిపిస్తుంది ఒకోసారి. అయితే యింతా జరిగాక అలా చెయ్యడాని కేదో అడ్డుపడ్తోంది. పైగా అతనికి

బాగా నాటా లని కొన్నిమాటలు వదిలింది; అవన్నీ వరసగా తిరిగి అప్పజెప్తేనేగాని తిన్నగా మాట్లాడడు ! యీ బింకం, జంకూ తనచుట్టూ గోడలు లేపుతున్న ట్టున్నాయి.

* * *

ఆరోజు ఉదయం ఆమె పిలుపు తను అందుకుంది. 'కోమలి' నిజంగా ఆడదే ! గొంతు తియ్యగా సన్నగా చిన్నమనిషిది లాగానే వినబడ్తోంది. వసంతకి అంత వరకు కళ్ళను కప్పుకొన్న మసకతెరలు తొలగిన ట్టుంది.

అసలు అతను యిక్కడికి వచ్చింది కోమలి కోసమేనేమో ! యీ మూడేళ్ళలో అతని అభిప్రాయాలు, ఆలోచనలు మార లేదని, మారకూడ దని యెక్కడుంది ? ఎప్పుడో యేళ్ళ క్రితం ప్రవ ర్తనబట్టి ఊహించుకున్న అతని అహాన్ని ంచి తనకి రక్ష ణన్నట్టు చుట్టూ ఓ పరదా లాంటిది దించుకుంది. దీన్ని 'అహ'మనే అంటారేమో ! అసలు తెలివైనవాళ్ళకీ, ఏదన్నా చెప్పుకోతగింది సాధించిన వాళ్ళకీ యీ జబ్బు ఉండనే ఉంటుంది ; అంతమాత్రానికి అత న్నేదో సంస్క రించా లన్నట్టు చుట్టూ గిరి గీసుకుంటే చివరి కదే తన పాలిటి బందిఖానా అయింది. తను మామూలుగా ఉంటే అత నలా దూర మయేవాడు కాదేమో ! అతనికి దూరంగా పోవాలని తన ఉద్దేశ్యం గాదు; కాని అలా కనబడింది. అప్ప దది సాకుగా అతను దూర మవుతున్నాడు !

ఇదంతా తను చేజేతులా చేసు కున్నది ; జరిగిందానికి పూర్తి బాధ్యత తనదే. ఆ విషయం గుర్తు కొచ్చినప్పు డల్లా వసంతకి బాధ యెక్కు వయ్యేది.

కోమలి చాలా పెద్దదో, పెళ్ళయి పోయినదో, లేకపోతే కనీసం రకరకాల వికారా లున్నదో ఐఉంటుం దని ఊహిం చింది వసంత — ఆమె అలా అవా లన్న ఆశని వేరే రూపంలోకి తర్జుమా చేసుకుని.

అలా కిటికీలోంచి బయటికి చూస్తూ ఆలోచిస్తుంటే యీ జ్ఞాపకాలు, ఆశలు, ఊహాలు అన్నీ కలిసి కళ్ళలోకి నీళ్ళు తెప్పించాయి. అవి చెంపలమీదకి కారు తూన్నా ఆమె తుడుచుకోడానికి ప్రయ త్నించలేదు. సరిగ్గా అదే సమయంలో అతను వచ్చి వెనక నిలబడ్డాడు. ఎంత సేపు నిలబడ్డాడో తెలియదు.

"ఏమి టాలోచిస్తున్నా"వని అడిగి నప్పుడు తన కన్నీళ్లు అతను చూస్తాడన్న భయం, అనుకోని అతనిరాకకి ఆశ్చర్యం, సంతోషం, తిరిగి వేలూనుతున్న ఆశా అన్నీ ఒక్కసారి మనసుని ముంచెత్తాయి. సాధ్యమైనంత మంచిగా మాట్లాడా లని చూసింది ; కాని ఏం మాట్లాడ్తోందో పూర్తిగా ఆమె స్వాధీనంలో లేదు.

అతను తనకన్నీటిని 'ఐడిల్ టియర్స్' అని కొట్టిపారేశాడు. సినిమాకి రమ్మని పిలిచాడు గాని రానంటే రెండోసారి అడ

క్కుండా వెళ్ళిపోయాడు. ఏదో మాటవరస కడిగిన ట్టుంది ! పైగా తను వద్దంటే, "కోమలి కని పెట్టుకుంటుం" దని స్పష్టంగా చెప్పాడుకూడా. గడిచిన విష యాల్ని గుర్తులో పెట్టుకుని ఆలోచిస్తే అతని తప్పేదీ ఉన్నట్టు కనబడదేమో ! తనే, వెళ్ళివుండాల్సింది ! కనీ సం కోమలి ఎలా ఉంటుందో చూడ్డానికయినా వీ లయేది !

యీమధ్య పశ్చాత్తాపాలు యెక్కు వయ్యాయి. చేసిన ప్రతిపనీ చేసేశాక తప్పుగా కనబడ్తోంది ! యీ ఆలోచన లన్నిటిమధ్యా నిద్ర పట్టేసింది.

మెలుకువ వచ్చేసరికి సాయంకాలం ఆరు. తొందరగా లేచింది. మూడు గంటలు నిద్రపోయిం దన్నమాట. అంత సేపు పగటి నిద్ర ఎన్నడూ అలవాటు లేదు. బయ టంతా చీకటిగా ఉంది, మబ్బులు దట్టంగా పట్టి. ఒక లయగా హెచ్చుతగ్గులు లేకుండా ఒకటే వరసని చినుకుతూంది. ఏదో తెలియని బాధ, విసుగు పుట్టించే వాన ! మామూలుగా ఉన్నప్పుడే బాధగా ఉండేది; మనసు సరిగా లేనప్పుడు మరీని ! వసంత మొగం కడిగి గదిలో కూర్చుంది. లైటు వెయ్యబుద్ధి కాలేదు. మంచం మీద కూర్చొని నిద్రకి ముందు రేగిన వన్నీ నెమరేసుకుంటూంటే —

యింటిముందు కా రాగింది. రావు దిగి, వరాండాలో నిలబడి చెయ్యూడించాడు. కారు అద్దాల్లోంచి ఓ ఆడమొగం కని పించింది మసకగా. ఆ మొగం యెలా ఉందో గుర్తించడానికి వీల్లేకుండా చీకటీ, చినుకులూ అడ్డుపడ్డాయి.

"ఎవరోయ్, కార్లో !" మూర్తిగారు అడుగుతున్నారు.

"కోమలి అని వాల్తేర్లో మేం చదువు తున్నప్పుడే యింగ్లీషు ఆనర్సు చదువు తూండేది. రెండేళ్ళు జూనియర్ మాకు. ఏవో యాక్టివిటీస్‌లో పరిచయ మైంది. యిప్పు డీ ఊర్లో లెక్చరర్ ... అన్నట్టు రేపు మధ్యాహ్నం యిక్కడికి టీ కి పిలిచాను.''

"మంచిపని జేశావు. అలాంటివాళ్ళు తెలిసుండడం మంచిది !"

వసంత కీ మాట లన్నీ వినబడ్డాయి. అదీ సంగతి ! యీ సాహితీప్రియుడికీ, ఆ సాహితీవేత్త అలా తెలుసన్నమాట ! ఒక్కసారి గుండెలో ఏదో బలంగా లోతుగా దించిన ట్టయింది! ఎంత తెగించి చెప్పేశాడు ? అవును, అతనికి భయ మేమిటీ! తనని ఊరికే చూడ్డానికి వచ్చాడు. రేపు యింటికి వెళ్ళి 'నేను కోమలినే గాని మరెవర్నీ చేసుకోను !' అంటే అడ్డుకో గలిగిం దెవరు ?

ఆరాత్రి భోజనం చెయ్యబుద్ధి కాలేదు. అయినా బలవంతంమీద ఏదో లోపలికి పోనిచ్చింది.

రాత్రి మంచాన జేరగానే యింతకు ముందున్న కలవరం, కలత అన్నీ పోయి

నిశ్చల సమాధిలాంటి నిరాశ ఆవహించింది. అతనికీ తనకీ మధ్య ఆమె చోటు జేసుకుంది. అతని నిర్లక్ష్యానికి అదే అర్థం. అందుకే తనెంత కవ్వించినా పట్టించుకోడంలేదు. యిదివరకైతే తనన్న మాటలకి వెంటనే కోపంగా జవాబిచ్చేవాడు! వసంత కంతా విడిపోయినట్టుంది. యింక అతనికి మళ్ళీ దగ్గర కావడం అసంభవమేమో! అసలు యెలా ప్రయత్నిస్తుంది?

అర్ధరాత్రి గదిలోకి వెళ్ళి మంచం కాళ్ళవైపు జేరి శరత్ పాత్ర లాగ "నీ పాదాల దగ్గిర కొంచెం చోటి య్యి రాముదా?" అని అడుగుతుందా?

లేకపోతే అతనికి ఉన్నపళాన ఏ చిన్న జ్వరమైనా వస్తే బాగుండును! రాత్రింబవళ్ళు జుట్టు రేగినా, బట్టలు మాసినా పట్టించుకోకుండా కాలెండరు కాగితాలు చిరిగి రాలిపోతుంటే, థర్మామీటరు, ఔన్సుగ్లాసు పక్కన పెట్టుకుని సేవ జేసి, "హే భగవాన్!" అని నిట్టూర్చి తిరపతి తీసుకొస్తానని భక్తి ప్రకటించి పాతివ్రత్యం ప్రదర్శిస్తే — చివర్ని మాసిన గడ్డంతో అతను తేరుకొని "నన్ను క్షమించు వసూ! నిన్ను అర్థం చేసుకోలేకపోయాను!" అంటాడేమో!

వసంతకి తన ఆలోచనలకి నవ్వొచ్చింది.

ఆ రాత్రి యెప్పుడు నిద్రపట్టిందో తెలియదు. కాని పన్నెండింటి కింకా మెలుకువగానే ఉంది. ఆతర్వాత యెప్పుడో? మర్నాడు ఉదయం కళ్లు తెరిచేసరికి యెండ చాలా పైకెక్కింది. టైం, ఏడున్నర. పదేళ్ళలో ఎన్నడూ అంత ఆలస్యంగా లేవలేదు. కాని ఆరోజు ఒళ్ళంతా బరువెక్కినట్టయి అప్పటికీ లేవబుద్ధి కావడంలేదు. కళ్ళు మూతలు పడుతున్నాయి. ముక్కులోంచి గాలి వేడిగా గాడుపులా వస్తోంది. నోరంతా చేదు. ఓపిక తెచ్చుకుని మొగం కడిగి మెల్లిగా థర్మామీటర్ తెచ్చుకుని గదిలో కూర్చుంది. నూటమూడు! ఆ దొకమాదిరి తృప్తితో మెల్లిగా మంచం మీదకి ఒరిగింది.

జ్వరంసరిగ్గా సమయానికి వచ్చి కాపాడింది. లేకపోతే సాయంకాలం టీకి కోమలి వచ్చినప్పుడు, తనూ వాళ్ళతోబాటు కూర్చోడం, వాళ్ళిద్దరూ ఒకరివంక ఒకరు మాట్లాడే కళ్ళతో చూసుకుంటూంటే బాధపడ్డం యివన్నీ తప్పిపోయాయి. పైగా తనకి జ్వరం వస్తే రావు ఏంచేస్తాడో 'స్టడీ' చెయ్యొచ్చు. అతని ఆలోచనలూ అభిప్రాయాలూ ఎలా ఉన్నాయో తెలుసుకోడానికిది అంతిమ పరీక్ష. వసంతకి శాంతిగా ఉంది.

ఆ మధ్యాహ్నం నిద్రలో ఒక కల.

యింటిముందు పందిరి వేశారు. పెళ్ళి జరుగుతోంది. తనది కాదు; రావుది, కోమలితో. తను కాసేపు పందిరిరాట కాసుకొని నిలబడి తర్వాత మెల్లిగా యెక్క




దీకో పోయింది. వెనకాల్నుంచి యెవరో విషాదంగా పాడుతున్నారు : అది మొదటి భాగం.

రెండోభాగంలో తను టేబిల్ దగ్గిర జుట్టంతా విరబోసు కూర్చుని ఉత్తరం రాసేస్తోంది. "బావకి, - నేను వెళ్తున్నా. బావా ; చాలాదూరం - ఎక్కడికో యింతవరకూ ఊహించలేదు. బహుశా యీ జన్మకింక చూడవు. కాని యీ ప్రపంచంలో ఏ మూల నున్నా, నీకు సుఖాన్నియ్య మనే దేవుడ్ని ప్రార్థిస్తూంటాను. కోమలి నీకు బాగా తగినది, ఆమె నీకు సుఖాన్నిస్తుందని తెలుసు నాకు.

ఏ నీరెండల సాయంకాలమో, ఏ వెన్నెలరాత్రో, సముద్రతరంగాల మ్రోత వింటూనో, మల్లెల గుబాళింపులు ఆస్వాదిస్తూనో - వసంత అనే అభాగిని ఉండేదన్న తలపు లీలగా నైన నీలో మెరిస్తే నా జన్మ సార్థక మైం దని తృప్తిపడ్తాను. మరోజన్మ అంటూ ఉంటే తప్పక నీ సేవలో వినియోగించ మని భగవానుని ప్రార్థిస్తూ - వెళ్తున్నా. సెలవు. ఎప్పటికీ నీ, - వసంత.

'వసంత' అని సంతకం చేస్తుంటే చెంపల్ని గోదావరి పాయ లయినట్టుంది.

ఉలిక్కిపడి లేచి చెంపల్ని తుడుచుకుంది. మొగ మంతా చెమట పట్టేసింది. బయట హాల్లోంచి గట్టిగా మాటలు వినబడుతున్నాయి.

కోమలి వచ్చింది ;

కోమలి యెలా ఉంటుందో చూడా

లన్న ఉత్సుకతని బలవంతాన అణుచుకుని అలాగే చెవులటు అప్పగించి పడుకుంది.

మూర్తిగారికీ ఆమెకీ మధ్యనే మాటలు జరుగుతున్నాయి. మధ్య మధ్య అప్పు డప్పుడు రావు చిన్న చిన్న మాటలు కలువుతున్నాడంతే. వాళ్ళిద్దరూ మాట్లాడు కోవాల్సిన పని లేదు ; వసంతకి చెప్పలే నంత కసిగా వుంది. మూర్తిగారూ, పార్వతమ్మా యిద్దరూ ఆమెతో చాలా ఆప్యాయంగా మాట్లాతూంటే కోమలి చాలావినయంగా నెమ్మదిగా మాట్లాడు తోంది.

ఓ అరగంట పోయాక కోమలి అడి గింది, "మీ అమ్మాయి యెక్కడ ?" అని.

"రండి, చూద్దురుగాని; ప్రొద్దు న్నుంచి జ్వరం. మంచం దిగలేదు.'' అంతా లేచారు.

వసంత గుండెలు వేగంగా కొట్టు కుంటున్నాయి. సర్దుకు కూర్చొంది, ఆమె గదిలో కడుగు పెట్టగానే నిలబడ్డా నికి వీలుగా.

అందరికన్నా ముందు అడుగు పెట్టారు మూర్తిగారు. వెనకనే కోమలి ఉంది. కోమలి పచ్చగా నాజూగ్గా ఉంది అంత సన్నంలోనూ బాగా పుష్టిగా కని పించే శరీరం పొడుగ్గా ఠీవిగా కన బడ్తోంది. రావు ప్రక్కన ఆమె నిల బడితే, రావు అలా మారిపోవడానికి కారణం అర్థమౌతున్నట్టుంది. వెంటనే మళ్ళీ ఏదో చెప్పలేనంత నిస్పృహ, నీరసం పట్టుకున్నాయి వసంతకి.

"మిస్ కోమలి, ఎం. ఏ. — మిస్ వసంత, కాబోయే బి. ఏ." రావు పరిచయం చేశాడు.

"కాబోయే మిసెస్ రావ్ !" కోమలి నవ్వుతూ జేర్చింది, అందరివంకా వరసగా చూస్తూ.

మూర్తిగారు అదేదో పెద్ద విట్ అన్నట్టు విరగబడి నవ్వారు.

"ఈ యేడు చేసెయ్యా లనుకుం టున్నాం !'' పార్వతమ్మగారు కలిసింది.

రావు వసంత మొగంలోకి చూశాడు. వసంత మొగం జేవురించి తల దించు కుంది.

అందరూ తలోచోటా కూర్చున్నారు.

"పరీక్ష లెలా రాశారు ?" కోమలి అడిగింది. ఆమె గొంతులో స్నేహం, సౌమ్యం చాలా సహజంగా హృదయం లోతునుంచి వస్తోన్నట్టున్నాయి.

''బాగానే రాశానండి.''

"వెదర్ బాగా లేనప్పుడు, పగటి

పూట యెక్కువసేపు నిద్రపో కండి'' అందామె మళ్ళీ. తన లాగా ఉద్రేకాలు, ఆవేశాలు ఏవీ రెగనట్టు. ప్రశాంతంగా కనబడే ఆమె కళ్ళలోకి చూస్తుంటే వసంతకి ఒక మాదిరి సిగ్గూ, నమ్రతా కలుగుతున్నాయి.

"ఆమె జ్వరానికి కారణం నిద్రపోడం కాదులెండి ! ఆకాశం నీలంగా యెందు కుందో, మనుషులు చేతులమీద యెందుకు నడవరో—యిలాంటి వన్నీ ఆలోచిస్తూం టుంది. అర్థం లేని వన్నీ తనకి తానే కల్పించుకుని మెదడు పాడుజేస్తే నే, అలా ఉన్నట్టుండి నూటమూడు నూట నాలుగు వచ్చేది !''

"ఆమె కంతటి ఆలోచనాశక్తి, అన్వే షణాశక్తి ఉన్నందుకు మీరు సంతో షించాలి !"

"యిదొకటికూడా నేర్పండి మీరు !'' రావు నవ్వాడు.

''అదలా ఉంచండి; మీ కిలా ఉండ గానే, ఆయన రేపు వెళ్ళిపోతా మంటు న్నారు. ఊరుకుంటారా, మీరు?" వసంత నడిగింది కోమలి.

''ఏమిటి రేపు వెళ్తావా ?'' పార్వ తమ్మగారు విస్తుపోయి పెద్ద అసంభ వాన్ని వింటున్నట్టు అడిగింది.

"అవును, రేపు వెళ్ళాలి !''

వసంత ఒక్కసారి అతనివంక చూసి, తల దించుకుంది.

"నో, నో, అది జరిగేపనిగాదు !' మూర్తిగారు స్పష్టంగా చెప్పారు.

రావు మాట్లాడలేదు. అది ముమ్మా టికీ జరిగేపనే అన్నసంగతి అందరికీ తెలుసునన్నట్టు నిర్లిప్తంగా ఊరు కున్నాడు.

కాసేపటికి కోమలి లేచింది.

''యీ ఊర్లోనే ఉంటాం కాబట్టి మళ్ళీ కలుసుకుందాం" అంది వసంతతో

''తప్పకుండా" వసంతకి యిన్నా ళ్టికి మాటలు పూర్తిగా మనసుకెంచి వచ్చాయి. హాయిగా ఉంది.

ఆతర్వాత మూర్తిగారు యెటో బయ టికి వెళ్లారు. పార్వతమ్మ లోప లెక్కడో ఉన్నారు.

రావు లోపలికి వచ్చి కుర్చీలో కూల బడ్డాడు, మంచానికి దగ్గరగా లాక్కుని వసంత మంచం కమ్మీపైకి ఒరిగింది

''జ్వరం వచ్చిం దన్న సంగతి నాకు తెలియదే !''

"నేను చెప్పాలా, మీతో ! మీరు తెలుసుకోవాలి ! అంతే !''

''ఉన్నట్టుండి సంబోధనావిభక్తిని మార్చేశావేం ? జ్వరలక్షణమా ?'

"యింక పైన యింతే. ఆ రంగం అయిపోయింది. యి దింకో రంగం వసంత తేలిగ్గా నవ్వింది.

రావులో ఒక్కసారిగా ఆ నీరసంగా నవ్వే కళ్ళని పెదాల్తో తాకా లన్న కోరిక తరంగం బలంగా లేచింది.

"యిప్పు డెంత ఉందో చూడు టెంప్!"

"చూడక్కర్లేదు. ఎప్పుడో పోయింది...అది సరే గాని, రేపు వెళ్తారా?"

"ఊఁ."

"వెళ్ళడానికి వీల్లేదు."

"మానేశాం." యాంత్రికంగా ఠపీమని అన్నాడు.

అతడు చెప్పిన ధోరణికి నవ్వొచ్చిందామెకి.

"రేపు గోల్కొండ వెళ్దాం.—" వసంతా!

"నా కలా తిరగడం నచ్చదు."

"నాతో కూడానా?"

"అంటే అర్థం?"

రావు నవ్వాడు.

అతని చేతిని రెండు చేతుల్లోనూ పట్టుకొని వేళ్ళతో ఆడుకుంటూంటే గాలి కెరటాలపైని తేలిపోతున్నట్టుంది. వసంతకి.

"నన్నిం కెన్నడూ ఆలోచించనివ్వకండి!" అంది కాసేపటికి మెల్లిగా, అతని చేతి మీద ఆనుకుని.

"అంటే అర్థమేమిటో?" రావు సగం పైకీ, సగం లోపలికీ అనుకున్నాడు.

"పెద్ద యిదిగా కథలు రాస్తారుగా! ఆలోచించండి."

రావు ఆలోచిస్తూనేఉన్నాడు. ★



బైటికి చూస్తోంది అనూరాధ. గుబురుగా పెరిగిన సరుగుడు చెట్లు వలయాకారంగా తిరుగుతూ మాయమౌతున్నాయి. ఎత్తుగా పెరిగిన పొలాలు, చిన్న చిన్న నీటి గుంటలు రెప్పపాటులో మాయమౌతున్నాయి.

వానజల్లు ముఖానికి కొడుతూ ఉండడంవల్ల బయటికి చూడలేక గ్లాసు తలుపులు వేసి ప్రక్కనే బల్లమీద మెత్తని పరుపు మీద నిద్రపోతున్న "బాబు" ముంగురులను సర్దుతూ కూర్చుంది అనూరాధ. 'వచ్చేదే విజయవాడ స్టేషను. దిగవలసిన ప్రయాణీకులంతా సర్దుకుని కూర్చోండి' అన్న



ట్టుగా యింజను ఓ పెద్ద కేక పెట్టి తన శక్తి నంతా కూడదీసుకుని పరుగు లంకించుకుంది. ట్రైను జోలపాటకు హాయిగా పడుకున్న బాబు యింజను కేకతోబాటు తను కూడ శృతి కలి పాడు. అనూరాధ బాబును సముదా యించేసరికి ఉసూరు మంటూ కలకత్తా మెయిల్ విజయవాడ స్టేషను లో ఆగింది. 'మీరంతా కాఫీ ఫలహారాలు పుచ్చుకోండి. నేను కడుపు నిండా నీళ్ళు త్రాగి వస్తాను' అన్నట్టుగా యింజను కేకేసింది. స్టేషనంతా ప్రయాణీకులతో నిండి పోయింది. దిగవలసిన వాళ్ళని దిగనీయకుండా ప్రయాణీకులు ఎక్కుతున్నారు. టీ, కాఫీ, పువ్వులు, పుస్తకాలు వగైరా అమ్మే వాళ్లు గొంతుక చించుకొని అరుస్తున్నారు.

బాబును ఎత్తుకుని ఫ్లాస్కు పట్టుకుని క్రిందికి దిగింది అనూరాధ. కాంటిన్ ప్లాట్‌ఫారం చివర వుంది. మెల్లిగా అక్కడికి దారితీసింది. ఫ్లాస్కులో రెండు కప్పుల కాఫీ పోయించుకుని టిఫిన్ పొట్లం కట్టించుకుని కంపార్టుమెంటు చేరుకుంది. అనూరాధ రావడం చూసి ఎదురు బల్లమీద కూర్చున్నవారు క్రిందికి దిగేరు. తను తెచ్చిన టిఫిన్ తింటూ బాబుకు కాస్త కాస్త పెడుతూ ముగించి కాఫీ త్రాగి, బాబుతో కబుర్లు చెబుతూ కూర్చుంది అనూరాధ.

"రాధీ!" అన్న పిలుపు విని తలెత్తి చూసింది అనూరాధ. ఎదురుగా చిరునవ్వు నవ్వుతూ నిలబడ్డ వ్యక్తిని గుర్తు తెచ్చుకోడానికి ఒక్కనిముషం పట్టింది అనూరాధకు.

"బావ, మాధవ్!" అప్రయత్నంగా రాధ నోటినుండి వెలువడ్డాయి.

"రాధీ! గుర్తు పట్టావా?" అన్నాడా వ్యక్తి చిరునవ్వు నవ్వుతూ. అదే చిరునవ్వు. మనిషిమాత్రం కొంచెంగా లావెక్కినట్టున్నాడేమో!'అందంగా, నిండుగా వున్నాడు' మనస్సులో అనుకుంది రాధ. మాధవ్ వెనుక నిలబడ్డ యువతిని చూసి మరీ ఆశ్చర్యచకితురాలయింది అనూరాధ.

"రాధా! కులాసానా? నన్ను మర్చిపోలేదు కదా" అని అంది ఆ యువతి.

"లలితా, నిన్ను మర్చిపోతే, నన్ను నేను మరచినట్లే. రండి లోపల కూర్చుని మాట్లాడుకుందాం" అంది రాధ.

వారు లోపలకు వచ్చాక లలిత చేతులు తన చేతుల్లోకి తీసుకుని ఆప్యాయంగా దగ్గర కూర్చోపెట్టుకుంది. మాధవరావు వారికి ఎదురుగా కూర్చునిబాబునుదగ్గరికితీసుకున్నాడు.

# మరుగుపడిన జీవన రాగాలు

కుమారి
మంగు పద్మావతి

జీవితంలో చిత్రవిచిత్ర మైన సంఘటన లెన్నో జరుగుతూ వుంటాయి. కొన్ని మనస్సులో పీఠం వేసుకుని శాశ్వతంగా వుండిపోతాయి. కొన్ని మనం మరచిపోయినా జీవితరాగంలో ఎప్పుడో ఎక్కడో ఒకసారి విచిత్రంగా గుర్తుకు వస్తాయి.

అనూరాధ తన జీవితంలో మాధవ్ బావను చూస్తుం దనిగాని, అతని ప్రక్క చిన్ననాటి స్నేహితురాలు లలిత కనిపిస్తుందని గాని కలలోకూడ అనుకోలేదు.

ఆకాశంమీద మబ్బులు గుంపు గుంపులుగా క్రమ్ముకొంటున్నాయి. గాలి రివ్వున వీస్తోంది. తుప్పర ప్రారంభ మైంది. మూడవ తరగతి "స్లీపరులో" కూర్చుని కిటికీలోనుండి

కుశలప్రశ్నలయిన తరువాత మాధవరావు అన్నాడు, "స్నేహితుడు కుటుంబంతో కలకత్తా వెళుతున్నాడు. వారిని సాగనంపడానికి వచ్చాము. నువ్వు కంపార్ట్‌మెంటు ఎక్కుతూవుంటే లలితచూసి చెప్పింది. ముందుగా ఉత్తరం వ్రాయలేక పోయావా రాధీ !"

"బావుంది. మీరు ఇక్కడ వున్నట్టు నాకేం తెలుసు ? అయినా మీకు నేను గుర్తున్నానా ? ఎన్ని ఉత్తరాలు వ్రాసాను. ఒక్కదానికి జవాబు వ్రాసారూ ?" నిష్టూరంగా అంది అనూరాధ.

"క్షమించు రాధీ ! అప్పట్లో నేను ఓ పిచ్చివాడిగా తిరుగుతూ వుండే వాడ్ని" అన్నాడు మాధవ్ బాధగా.

అప్పటికి గాని తట్టలేదు "బావ ప్రేమించి పెళ్ళి చేసుకున్న సరళ ఏమైంది ?" అన్న ఆలోచనతో ఒక్క నిముషం మౌనంగా వుండిపోయింది అనూరాధ.

"ఏమిటి రాధ ఆలోచిస్తున్నావు?" అన్నారు ఇద్దరూను.

"ఏం లేదు" అంది ముక్తసరిగా రాధ.

"నువ్వేం ఆలోచిస్తున్నావో నాకు తెలుసును రాధ ! ఆ గాధ ఇక్కడ చెప్పడం భావ్యం కాదనుకుంటాను" అన్నాడు మాధవరావు.

"అవును రాధీ. ఆయనన్నది బాగానే వుంది. నీకు వివరంగా వ్రాస్తాను సరేనా ?" చిరునవ్వు నవ్వుతూ అంది లలిత. ఆ చిరునవ్వు వెనకాల బాధ ! అగాధమైన జలపాతంలా కన్నీరు దాగివుందన్న సంగతి అనూరాధకి ఏం తెలుసు ?

అనూరాధ చిరునవ్వు నవ్వుతూ "నీ జీవితంలో చీకటి అంతరించినందుకు సంతోషంగా వుంది — 'వచ్చే జన్మలోనైనా మాధవ్‌ను భర్తగా పొందగలిగే అదృష్టం వుంటే చాలు రాధీ' అన్నావు గుర్తుందా లల్లీ ? ఈ జన్మలోనే చేపట్టగలిగావు. చాల అదృష్టవంతురాలివి లలితా !" అంది.

"అవును రాధీ ! నువ్వన్నట్టు నేను అదృష్టవంతురాలిని. జన్మ జన్మాలకూ ఆయనే భర్తగా వుండాలని కోరుతూ వుంటాను" మాధవరావు వైపు చూస్తూ చిరునవ్వు నవ్వింది లలిత.

ఆ చిరునవ్వులో ఆనందం వెల్లివిరుస్తూ కోటిసూర్యుల వెలుగు ప్రజ్వరిల్లుతున్నట్లు కనిపించింది అనూరాధకు.

"అదృష్ట వంతుడ్ని నేనూ రాధ!" అన్నాడు మాధవరావు.

"అవును మాధవ్ ! లలితవంటి ఉత్తమురాలు నీకు భార్యగా ఈ జన్మలో అవడం, నీ అదృష్టమనే అనాలి. మీ ఇద్దరికీ ఇద్దరూ అదృష్టవంతులు.

మీ ఇద్దరినీ ఒకదగ్గరగా చూడ్డం నా అదృష్టం కదూ ?'' అంది రాధ ముగ్గురూ నవ్వుకున్నారు. ఆ కొద్ది సేపట్లోనే తమ చిన్ననాటి సంగతులు జ్ఞప్తికి తెచ్చుకుని సరదాగా గడిపేశారు.

యింజను ఒక్క కేకతో వచ్చి ట్రైన్ని కలుసుకుంది. విడిపోయే సమయం వచ్చింది. అందరి హృదయాలూ భారంగా వున్నాయి.

మొదటి గంట కొట్టారు. మాధవరావు బాబును దగ్గరకు తీసుకుని మృదువుగా చెక్కిలి మీద ముద్దు పెట్టుకున్నాడు. లలిత తన మెడలోనున్న సన్నటి లాకెట్ తో నున్న గొలుసును బాబు మెడకి తగిలించింది.

అనూరాధ ఆ దృశ్యం చూసిందే గాని వారించలేకపోయింది. బాబును అనూరాధ తీసుకుంది. మాధవరావూ, లలితా క్రిందకు దిగారు. అనూరాధ నడిగి ఎడ్రస్సు వ్రాసుకుని తన ఎడ్రస్సువ్రాసి అనూరాధ చేతికి అందించాడు మాధవరావు.

''రాధీ ! బాబు పేరు ?'' అడిగింది లలిత.

''మాధవరావు'' అప్రయత్నంగా అనూరాధ నోటి నుండి వచ్చింది. తన మాటకు మాధవరావు కళ్ళు ఆనందంతో మిళమిళ మెరవడం చూసి సంతృప్తిగా నిట్టూర్చింది రాధ !

''రాధీ ! చేరగానే ఉత్తరం వ్రాస్తావు కదూ ! నువ్వు బావగారితో కలసి రావాలి సుమా !'' గాద్గదికంగా అంది లలిత.

''తప్పక వస్తాము లలితా !'' లలిత చెయ్యి మృదువుగా నొక్కుతూ అంది రాధ !

గార్డు పచ్చజండా ఊపుతున్నాడు యింజను ప్రియుడు వదిలిన ప్రియురాలులా భారంగా కదిలింది.

ట్రైను స్పీడు అందుకుంది. తన చేతిలో నున్న లలిత చెయ్యిని జార విడిచింది. ఒకరి నొకరు చేతులు వూపుకుంటూ విడిపోయారు.

అనూరాధ హృదయం ఆనందంతో పరవళ్ళు త్రొక్కుతోంది. తను కలలోకూడ అనుకోలేదు మాధవ్ లలిత ఒక్కటిగా కలుస్తారని. జరిగిన సంఘటనలన్నీ ఒక్కసారిగా కళ్ళముందు మెరిసాయి అనూరాధకు.

బరువుగా, కను రెప్పలు మూతబడ్డాయి.

* * *

అదో చిన్నగ్రామం. రాఘవయ్య, ఆ గ్రామమునసబు. పార్వతమ్మ రాఘవయ్య భార్య. మాధవుడు రాఘవయ్య చెల్లెలు కొడుకు. చెల్లెలూ, ఆమె భర్తా అకాలమృత్యువు వాతపడడంవల్ల మేనల్లుడ్ని చేరదీసాడు రాఘవయ్య. అతని భార్య పార్వతమ్మ మాధవుడిని

కన్న కొడుకుగా ఎంతో ప్రేమతో చూచుకొనేవారు. వారికి అప్పటికి సంతానం కలుగలేదు.

"ఏవమ్మా పార్వతమ్మా! అల్లుడ్ని చేరదీస్తున్నావు బాగానే వుంది. ఓ కూతురిని కనివేస్తూ" అనే వారు ఇరుగూ పొరుగూను.

పార్వతమ్మ నవ్వేసి "నాకు వీడు చాలమ్మా. కూతురు, అల్లుడు, కొడుకు వీడే" అంటూ దగ్గరున్న మాధవుడిని ప్రేమతో తల నిమిరేది.

"ఓ యబ్బ! మహా కనేసినట్టే పెంచుతున్నావు" అని వారంటే "కన్నప్రేమ కన్నా, పెంచిన ప్రేమ గొప్పదంటారు" అనేది పార్వతమ్మ.

మూడేళ్ళకి పార్వతమ్మ కన్నప్రేమకూడ చవిగొన్నది. అనూరాధ అని పేరు పెట్టారు మనమరాలకి. దుర్గమ్మగారు మాధవుడితో "ఒరేయి, నీ పెళ్ళంరా" అని అంటే "ఉహు, కాదు చిన్నిచెల్లాయి" అనేవాడు మాధవుడు.

అనూరాధకు ఐదేళ్ళు వచ్చేవరకూ మాధవుడి బుజం మీదే వుండేది. రాధ అంటే మాధవుడికి ప్రాణం. ముద్దుగా 'రాధీ!' అని పిలిచేవాడు.

రాధ మాధవుడ్ని 'అన్నాయ్' అనేది. దుర్గమ్మగారు విన్నప్పుడల్లా రాధను మందలించి 'బావ' అని పిలిపించేది. రాధా మాధవులే కాక ప్రక్కింటివారి అమ్మాయి లలిత కూడ వీళ్ళతో కలసి మెలసి వుండేది. ముగ్గురూ ఎక్కడికి వెళ్ళినా జట్టుగా వెళ్ళేవారు. చిన్నతన మంతా పచ్చటి పొలాల దగ్గర, చెరువుగట్లమీద ఆటపాటల్లో గడిచి పోయింది.

కాలచక్రం గిర్రున తిరిగిపోయింది. కాలంతో పాటు ముగ్గురు స్నేహితులూకూడ పెరిగి పెద్దవారయ్యారు. మాధవరావు పట్నంలో డిగ్రీ కోర్సు చదువుతున్నాడు. ఉన్న గ్రామంలోనే స్కూలు ఫైనలు పాసయి ఇంటి దగ్గరే గడుపుతున్నారు రాధా, లలితాను.

"ఆడపిల్లలకు ఇంతకన్నా ఎక్కువ చదువు అక్కరలేదు" అనే కోవకు చెందినవారు రాఘవయ్య దంపతులు. "ఎదిగిన పిల్లని స్కూలుకు పంపించడమే! హవ్వ" అని నోరు నొక్కుకునే వారు దుర్గమ్మగారు.

ఆ సంవత్సరంతో అయిపోతుంది మాధవరావు చదువు. ఈ నాలుగేళ్లలో మాధవ్ తన వూరు రెండు సార్లు వచ్చాడు. మాధవ్ దగ్గరికి వెళ్లాలంటే భయం, సిగ్గూ ముంచుకొచ్చేవి రాధకు. బావ ఎంతలా మారిపోయాడు? చాల అందంగాకూడ తయారయాడు. తను మాత్రం మారిపోలేదా? అందంగా తయారవలేదా? తనలో తాను ప్రశ్నించుకుని నవ్వు

కునేది అనూరాధ. మాధవరావు రాధకు తన కాలేజి సంగతులూ, పట్నంలోని వింతలు విశేషాలు చెప్పే వాడు. రాధ క్రమేపి భయం, సిగ్గూ పోయి, మాధవరావంటే, ప్రేమ, చనువు పర్పడింది. లలిత మొదట్లో మాధవునితో మాట్లాడడానికి సిగ్గు పడిందిగాని క్రమేపి లలితకూడ మాధవ రావుకు అతిసన్నిహితురాలయింది. మాధవ్ లేనిదే తను బ్రతకలే నసే అవస్థకు వచ్చింది. మాధవరావుకు తెలుసు. ఈ యిద్దరందగత్తెలు తనని ఆరాధిస్తున్నారని. అనూరాధమీద అమితమైన ప్రేమానురాగా లున్నాయి. అవి సోదర సోదరీలకున్న ప్రేమానురాగాలు. చిన్నప్పటినుండీ అదే అలవాటులో వున్న మాధవరావు పెద్దయిన తరువాతకూడ తన అభి ప్రాయం మార్చుకోలేకపోయాడు. లలిత అందం అసమానమైనది. ఆమె సన్నిధానంలో అనిర్వచనీయమైన ఆనందం కలిగిస్తుంది మాధవరావుకు. ముగ్గురూ రోజూ పికారుకు వెళ్లేవారు. తమ చిన్ననాటి ఆటపాటలు గుర్తుకు తెచ్చుకుని ఆనందంగా నవ్వుకొనే వారు.

ఒకరోజు లలితను ఏకాంతంగా కలుసుకోవడం జరిగింది మాధవ రావుకు.

"లలితా!" అన్నాడు ప్రేమపూరిత మైన కంఠంతో.

"ఉ" అంటూ తన విశాల నయ నాలతో మాధవరావు వైపు చూసి సిగ్గుతో తలవంచుకుంది లలిత.

"స్త్రీకి సిగ్గు, సింగార మన్నారు" నవ్వుతూ అన్నాడు మాధవ్.

"ఎవరన్నారుట?" చిలిపిగా ప్రశ్నించింది లలిత.

"ఎవరో మహాకవులు."

"పురుషులకు చిరునవ్వే అందం" అంది లలిత నవ్వుముఖంతో.

"ఎవరన్నారుట?" చిలిపిగా లలిత వైపుచూస్తూ ప్రశ్నించాడు మాధవ్.

"నేను" ఇద్దరు నవ్వేసారు.

అంతవరకూ వీరి మాటలు చాటుగా నిలబడి వింటున్న రాధ లేని నవ్వును బలవంతంగా తెచ్చిపెట్టు కుంటూ వీరి దగ్గరకి వచ్చింది. వీరి మాటలు తను పొంచివినా లని అక్కడ నిలబడలేదు. తను గదిలోకి వెళుతూ వుంటే 'లలితా'అని మాధవ్ గొంతుక వినబడింది. అంతే. అచేతనంగా నిల బడిపోయింది. కాని ఒక్క సంగతి మాత్రం అర్ధమైంది. 'లలిత తన బావను గాఢంగా ప్రేమిస్తున్న'దని. ఈ సంగతి రాధ మనస్సులో మెదల గానే ఎవరో అగాధంలో త్రోసినట్టు బాధపడింది.




రాధ మౌనంగా నిలబడిపోవడం చూసి లలిత కొంచెం బాధపడింది.

మాధవ్ నవ్వుతూ పలుకరించాడు "ఏం రాధీ! ఇంత ఆలస్యం చేశావు? చెరువు గట్టువైపు వెళదామనుకున్నాముకదూ?''

"సారీ, బావా! ఈ రోజు నేను రాలేను. తల నొప్పిగావుంది, మీరు వెళ్ళిరండి" అని మాధవరావుతో అని, "లలితా, నువ్వూ, బావా వెళ్లిరండి." అంది లలితతో.

''నువ్వు రాకపోతే నేను వెళ్ళను" అంది లలిత.

యేం ఎందుకు వెళ్ళవు? బావ నీకు కొత్తవాడా? వెళ్ళు లలితా! యివ్వాళ్ళకి మీరు వెళ్ళుదురూ. ఏం పరవాలేదు. వెళ్లిరండి బావా'' అనేసి సమాధానానికికూడ యెదురుచూడక వెళ్ళిపోయింది అనూరాధ.

అనూరాధ వెళ్ళిన తరువాత "రా లలితా! మనం వెళదాం" అన్నాడు మాధవరావు.

''నాకు ఇంట్లో పనివుంది, మీరు వెళ్ళిరాకూడదూ" అంది లలిత మెల్లిగా.

మాధవరావు నవ్వుతూ, "మీ ఆడవాళ్ళని అర్థం చేసుకోవడం బ్రహ్మ తరంకాదు. రా వెళదాం" అన్నాడు.

"క్షమించండి! రేపు వెళదాం! రాధ కూడ వస్తుంది" మాధవ్ సమాధానం వినకుండా వెళ్ళిపోయింది లలిత.

మాధవరావు లలిత వెళ్ళే దిక్కే చూస్తూ అక్కడే ఒక్క క్షణం నిలబడి ఏదో నిర్ధారణ చేసుకున్న వాడిలా లోపలికి వచ్చాడు అనూరాధని వెతుక్కుంటూ.

రాధ డాబామీద, పిట్టగోడపైన కూర్చుని ఆలోచిస్తున్నది. 'మాధవ్ తనని ప్రేమించడం లేదా? బావ చదువు పూర్తి కాగానే తమిద్దరికీ వివాహం జరపాలని నిశ్చయించారు కదా. ఈ సంగతి బావకూ, లలితకూ తెలుసు. మరి వారి ఉద్దేశాలు ఏమిటి? తనని లలిత అగాధంలోకి తొయ్యాలనుకుంటోంది. ఎందుచేత? ఒకవేళ వారి చనువు తను అపార్థం చేసుకోవడం లేదుకదా?' పరిపరి విధాల ఆలోచిస్తూ లేని తలనొప్పి తెచ్చిపెట్టుకుంది అనూరాధ.

"రాధీ!" మెల్లిగా పిలిచాడు మాధవరావు.

"........"

"ఏమిటి రాధీ ఆ దీర్ఘాలోచన." అనూరాధ బుజంమీద చెయ్యి వేసి అన్నాడు మాధవరావు.

ఉలిక్కిపడిలేచినిలబడిందిఅనూరాధ.

"ఏం, రాధీ, తలనొప్పి తగ్గిందా?" అన్నాడు మాధవ్.

మౌనంగా అటనివైపు ఒక సారి చూసి క్రిందకి వెళ్ళబోయింది రాధ.

"రాధీ!" అంటూ చెయ్యిపట్టుకుని కూర్చోపెట్టేడు, తనుకూడా ప్రక్కనే కూర్చుంటూ "రాధీ, నీకు కోపం వచ్చిందా?"

"లేదు" ముక్తసరిగా జవాబు చెప్పింది రాధ. "నా మాటలు నీవిప్పుడు వినే పరిస్థితిలో లేవు కానీ రాధీ! ఒక్క మాట చెప్పదలచాను, దయచేసి వింటావుకదూ!" అలా అంటున్నప్పుడు అతని కంఠం బాధగా మాట్లాడింది.

రాధ ఒక్క నిముషం వూరుకొని "చెప్పు బావా! నీ మాట ఎప్పుడు వినలేదు చెప్పు!" అంది.

"నాకు తెలుసు రాధీ! నీవు నాతో రాజీ పొతావని" అన్నాడు నవ్వుతూ.

రాధ కూడా నవ్వలేకుండా వుండలేకపోయింది.

మాధవ్ చెప్పడం ప్రారంభించేడు!

"చూడు రాధీ! నిన్ను చిన్నప్పుడు ఎత్తుకు మోసేవాడిని. ఎంత అల్లరి చేసేదానివో తెలుసా?"

"తెలీదు" అంది రాధ మాధవ్ కళ్ళల్లోకి చూస్తూ.

"అవును, నీ కెలా తెలుస్తుంది? నీవు చిన్నపిల్లవు" అన్నాడు.

"అది సరే గాని ఏమిటి చెప్ప దలచుకొన్నావో సూటిగా చెప్పు" అంది విసుగ్గా రాధ.

మాధవరావు అన్నాడు: "నేను చిన్నప్పటినుండి నిన్ను చెల్లెలుగా భావించుకుంటున్నాను."

"ఇప్పుడో?" తీవ్రంగా అంది రాధ.

"ఎప్పుడూ అంతే రాధీ! నీవు నా చెల్లివి. జన్మజన్మాలకైనా నిన్ను సోదరిగానే కోరుకుంటాను. ఈ జన్మలో కాకపోయినా వచ్చేజన్మలోనైనా ఒకతల్లి కడుపున పుట్టాలని వెయ్యిదేముళ్ళకి మ్రొక్కుతూ వుంటాను రాధీ! నన్ను నమ్ము" అన్నాడు మాధవరావు.

"........."

"రాధీ! నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు కానీ, అది సోదర ప్రేమ రాధీ!"

"బావా," గాద్గదికంగా అంది అనూరాధ.

"అవును రాధీ! నువ్వుబాగా ఆలోచించుకో. నీది నిర్మలమైన మనస్సు. ఎలాంటి కల్మషం లేనిదానివి. పవిత్రమైన నీ హృదయంలోనుండి వచ్చే మాటలు నాకు అమృతప్రాయమైనవి చెల్లీ" అన్నాడు మాధవరావు ప్రేమతో రాధతల నిమురుతూ.

"అన్నయ్యా, నన్ను క్షమించు. నీ ప్రేమను అపార్థం చేసుకున్నాను. నన్ను మన్నించు మాధవ్. అన్నయ్య లేని లోటు నాకు తీరింది" అంది రాధ.

ఆమె కనులనుండి నీరు కారి చెక్కిలిమీద జారుతున్నాయి.

మాధవరావు ప్రేమతో ఆమె చెక్కిలిమీదనున్న నీరును తుడిచి "ఈ సంగతులు ఇప్పుడప్పుడే ఇంట్లో తెలియనీయకు రాధీ!" అన్నాడు.

మౌనంగా తల ఆడించింది రాధ.

ఆ రాత్రి అంతా ఆలోచనతోనే గడిపింది రాధ. మాధవ్ అన్నదినిజమే. తను బావను ప్రేమించింది. అది సోదరిప్రేమ. చిన్నప్పటినుండి ఒక దగ్గర పెరగడం. తనని, చిన్నప్పటి నుంచీ ఎత్తుకున్న బావ, కలసిమెలసి తిరిగిన బావతో తన వివాహమా? బావను పెంచినవాళ్ళు తన తల్లీ దండ్రీను. తనకు మాధవ్ అన్నలాంటి వాడు అని ఆఖరికి నిశ్చయించుకుంది. 'లలితను క్షమించమని వేడుకోవాలి' అనుకుంటూ నిద్రాదేవి కౌగిలిలో ఒరిగిపోయింది.

మాధవరావు పట్నంనుండి మొదటి సారి గ్రామం వచ్చినప్పుడు జరిగిన సంఘటనలు ఇవి.

* * *

సెలవలు అయిపోయినాయి. మాధవరావు వెళ్ళిపోయాడు.

తరుచూ అనూరాధకు, లలితకు ఉత్తరాలు వ్రాస్తున్నాడు. ఇదివరకటికన్నా అనూరాధా, లలితలు అత్యంత ప్రియస్నేహితు లయ్యారు.

రోజులు దొర్లిపోయాయి. లలిత జీవితంలో అనుకోని అవాంతరం వచ్చిపడింది. ఏమిటంటే; లలిత తల్లిదండ్రులు లలితకు పెళ్ళిప్రయత్నాలు జరుపుతున్నారు. ఈ సంగతి తెలిసిన లలిత తల్లడిల్లిపోయింది. తను ఇప్పుడప్పుడే పెళ్ళిచేసుకోదలుచుకోలే దని చెప్పింది. ఆమెమాట వినేవా రెవరు? ఒక సంబంధం నిర్ణయించారు. ఈ సంగతి అనూరాధకు చెప్పుకుని యేడ్చింది.అనూరాధ లలితకు ధైర్యం చెప్పి వోదార్చింది. వెంటనే మాధవరావుపేర ఉత్తరం వ్రాసింది. జావాబు లేదు.

''రాధీ! దేనికైనా అదృష్టం వుండాలి. నేనా అదృష్టానికి నోచుకోలేదు. నాన్న చాల పట్టుదల మనిషి. అవతల పెద్దమనుషులకు మాట ఇచ్చారుట'' అంది లలిత.

"అలా అని నీకు ఇష్టంలేని పెళ్ళి చేసుకుని యేంసుఖపడతావులలితా?" అంది రాధ.

"......."

"నువ్వు బాధపడకు లలితా. ఆ సమయానికి మాధవ్ తప్పకవస్తాడు. నీకు ఈ పెళ్ళి ఇష్టం లేదని చెప్పు. తల్లిదండ్రులుకూడ తమపిల్ల సుఖపడా లనే కదా కోరుకుంటారు. నీ సుఖం వారికి సంతోషం కదూ!''

"అన్నీ చెప్పడం అయాయి రాధీ! నేను బలహీనురాలిని. కన్న తల్లిదండ్రులను యెదిరించే శక్తి నాలోలేదు. నేను నిస్సహాయురాలిని. క్రిందటి జన్మలో యే ప్రేయసీ ప్రియులని విడదీసానో? నిన్నూ నీ బావనుండి విడదీయ...."

"ఛ! అవేం మాటలు? మాధవ్ నాకు అన్నలాంటివా డని చెప్పానా!" లలిత మాటను పూర్తికానీయకుండా మధ్యలో అంది రాధ!

లలిత మౌనంగా రెండుచేతులూ ముఖానికి కప్పుకుని రోదించసాగింది. రెండు నిముషాలు వూరుకుని అంది, "మాధవ్ని ఈ జన్మలో భర్తగాపొందే అదృష్టంలేదు. వచ్చే జన్మలోనైనా మాధవ్ని భర్తగా పొంద గలిగేటట్టు చెయ్యమని ప్రార్థిస్తాను రాధీ! మాధవ్ వస్తే నన్ను క్షమించమను." అంటూ ఇక అక్కడ నిలువలేక ఒక్క పరుగున ఇంటికి చేరింది లలిత.

అనుకున్న ప్రకారం ముహూర్తం దగ్గరకు వచ్చింది. రేపే పెళ్ళి. మాధవరావు వస్తాడేమో నని వెయ్యికళ్ళతో ఎదురు చూస్తోంది రాధ. మాధవరావు రాలేదు. రేపన్నది రానే వచ్చింది. ఆ వివాహం తను చూడలేదు. ఒక

సారి లలితకు కనిపించి ఇంటికివచ్చి విచారిస్తూ కూర్చుంది రాధ.

ఆ మర్నాడు తెలిసింది రాధకు పీటలమీదిపెళ్లిఆగిపోయినట్టు. కారణం ఏమి టని తల్లిని అడిగింది. పార్వతమ్మ చెప్పిన సమాధాన మిది, పెళ్ళికుమారుడుకి హఠాత్తుగా గుండెనొప్పి వచ్చి పడిపోయా డని, ఇతనికి ఇలా తరుచు రావడం జరుగుతోం దని తెలిసి లలిత తండ్రి కోపంతో మగపెళ్ళివారిమీద విరుచుకు పడ్డాడు. ఫలితం దెబ్బలాట. తరువాత ఎవరిదారిన వారు వెళ్ళారు. ఆఖరికి తేలిం దేమంటే మూడుముళ్లూ పడలేదు. ఇదీ ఒకందుకు మంచిదే అంది పార్వతమ్మ.

రాధ ఒక్క పరుగున లలితా వాళ్ళింటికి వెళ్ళింది.

లలిత గదిలో కూర్చుని కంటికి మంటికి ఒకేలా ఏడుస్తోంది. ఆ స్థితిలో రాధ లలితను పలుకరించలేక తిరిగి ఇంటికి వచ్చేసింది. తరువాత లలితను కలుసుకో లేకపోయింది. తన అన్న గారింటికి వెళ్ళిం దని తెలిసింది. తనతో మాటమాత్రమైనా చెప్పకుండా వూరు వెళ్ళిం దని బాధపడింది అనూరాధ.

ఒక రోజు అనూరాధ గదిలో కూర్చొని పుస్తకం చదువుతున్నది. ప్రక్కగదిలోనుండి మాటలు వినబడుతున్నాయి.

"రాఘవా, రాధమ్మ పెళ్ళిమాట యేం చేశావురా? నేను బ్రతికివుండగా చెయ్యవులా వుంది" అన్నారు దుర్గమ్మ గారు.

"ఏమిటమ్మా యిప్పు డేం తొందర వచ్చింది" అన్నారు రాఘవయ్య గారు.

"అదేవిట్రా అలా అంటున్నావు? పిల్ల ఎదిగి కూర్చుంది; చెట్టంత అల్లుడు వుండనే వున్నాడు. సంబంధాలు వెతకాలా, కట్నాలు పోయాలా! చిన్నప్పటినుంచీ పెంచి పెద్దవాణ్ని చేశావు, పెద్దచదువు చెప్పిస్తున్నావు. నీ కళ్ళఎదుట వాళ్ళు చిలకా గోరింకల్లాగ తిరుగుతూవుంటే సంతోషం కదూ! అయినా మాధవుడు పరాయివాడు కాదుగా! నీ చెల్లెలుకొడుకు. వాడిదురదృష్టంవల్ల చిన్నప్పుడే తల్లినీ తండ్రినీ పోగొట్టుకున్నాడు. మీరు పెంచినంతమాత్రాన మీ కొడుకు అవుతాడా? నా కళ్ళఎదుటనే ఈ పెళ్ళి జరిపించాలి" అన్నారు దుర్గమ్మ గారు.

ఆవిడ ఉపన్యాసం విన్న రాధకు ఎక్కడలేని కోపం ముంచుకొచ్చింది. 'మామ్మా,' అంటూ కేక వేయబోయి తనలో తానే సముదాయించుకుంది అనూరాధ. మాధవ్ అన్నమాటలు ఒక్కసారి ప్రతిధ్వనించిన ట్లయింది,

''రాధీ ! వొచ్చేజన్మలో నైనా ఒక తల్లి కడుపున పుడదాం."

ఈ సంగతులు మాధవ్ కి వ్రాద్దా మనుకుంది రాధ. కాని రెండురోజుల క్రితమే తను లలితనుగురించి అన్ని విషయాలూ వ్రాసింది. ఆ ఉత్తరం తనబావ హృదయంలో ఎంత అలజడి లేపిందో ? మళ్ళీ ఈ సంగతులు వ్రాసి అతనిమనస్సు బాధ పెట్టడం ఇష్టంలేక విరమించింది.

ఈ ఆలోచనలతో మామ్మకి నాన్న ఏం సమాధానం చెప్పేరో వినలేదు రాధ.

తరువాత పార్వతమ్మతో అంది రాధ. "అమ్మా, నేను బావను పెళ్ళి చేసుకోను, చేసుకోలేను. నాకు అన్నయ్యలేనిలోటు బావ తీరుస్తున్నాడు. ఇకముందు కూడా అట్లాగే వుంటాము.''

సమాధానంగా పార్వతమ్మ నవ్వి ఊరుకుంది.

ఆ నవ్వువెనక ఏమి సమాధానం ఉందో రాధ గ్రహించలేకపోయింది.

రెండోసారి మాధవరావు తన గ్రామం వచ్చాడు. మాధవ్ ని చూసి ఆశ్చర్యపోయింది రాధ. మాధవ్ లో ఎలాంటి మార్పూలేదు. హుషారుగానే వున్నాడు.

"ఏం, రాధీ ! అలా నిర్ఘాంతపడి చూస్తున్నావు ?"

"ఏంలేదు, నువ్వు చాలామారావు" అంది రాధ.

"అవును మారాను. లలితనన్ను మోసంచేసిం దని బాధపడ్డాను. ఆ బాధైనా అట్టేరోజులు లేదు. ఆరిపోయిన నా హృదయజ్యోతిని సరళ తన చిరునవ్వుతో వెలిగించింది'' అన్నాడు మాధవరావు.

రాధ ఆశ్చర్యంతో అడిగింది. "సరళ ఎవరూ ?"

''నా క్లాసుమేటు రాధీ.''

"నిన్ను నమ్ముకున్న లలితగతి ఏం కావాలనుకున్నావు మాధవ్ ? నేను మొదట వ్రాసిన ఉత్తరం అందలేదా?"

"ఏ ఉత్తరం రాధీ ? లలిత వివాహం ఆగిపోయిం దని, అన్నగారి ఊరు వెళ్ళిపోయిం దని వ్రాశావు;అది అందింది."

'నిజంగా అందలేదా ? మాధవ్ అబద్ధం చెప్పటంలేదు కదా ?' అనుకుంది మనస్సులో రాధ.

వారంరోజు లయిన తరువాత మాధవరావు సరళఫోటోను చూపించి ''ఏలా వుంది ?'' అని అడిగాడు.

రాధ ఆ ఫోటోను పరీక్షగా చూసి ''అందమైనది; నీకు తగినది" అంది.

''రాధీ ! నువ్వు బాధపడుతున్నావు ?'' అన్నాడు మాధవరావు.

''ఎందుకు ? లేదన్నయ్యా ! నాకు బాధఎందుకు" తడబడుతూ అంది రాధ.

నిముషం అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు.

ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ అన్నారు రాఘవయ్యగారు.

"అయితే నే విన్నది నిజమే నన్న మాట."

"ఏమిటి ?" దుర్గమ్మ, పార్వతమ్మలు ఇద్దరూ ఒక్కసారిగా అన్నారు.

"ఆ ఏముందీ. ఓ రెండుజడలమ్మాయిని వెంటవేసుకుని తిరుగుతున్నా డని...."

"మామయ్యా."

"ఏం. నువ్వక్కడ యెన్ని వేషాలు వేస్తున్నావో నాకు తెలీ దనుకుంటున్నావు కాబోలు. ఈ గ్రామం కదిలి ఎలా వెళతావో చూస్తాను. ముహూర్తం నిశ్చయించాను 'పదిహేను రోజులే వ్యవధి వుంది,' బాగా ఆలోచించుకో! అయినా నీ ఆలోచనలతో నాకు సంబంధం లేదు" అన్నారు తీవ్రంగా రాఘవయ్యగారు.

"మాధవా ? రాధ పుట్టగానే నీ పెళ్ళాం మనుకున్నాము రా ? మామయ్యని నలుగురిలో తల యెత్త నీయరా! నీకు అదెక్కడ దొరికిందిరా తండ్రీ" అంటూ వాపోయారు దుర్గమ్మగారు.

పార్వతమ్మ ఏమీ మాట్లాడలేదు.

"మాధవా! చిన్నప్పటినుండీ నిన్ను పెంచి పెద్దవాణ్ని చేశాము. పెద్ద చదువు చెప్పించాము. నువ్వు నా అల్లుడవని అందరికీ తెలుసు. రాధ నీ భార్య. ఇద్దరూ నాకళ్ళెదుటే వుంటారని భావించాను" రుద్ధకంఠంతో అన్నారు రాఘవయ్యగారు.

"మామయ్యా! నన్ను చిన్నప్పటి నుండీ పెంచి పెద్దవాడిని చేసేరు. ఎన్ని జన్మ లెత్తినా మీ రుణం తీర్చుకోలేను. తల్లితండ్రి లేని నన్ను కన్నకొడుకు కన్నా ఎక్కువగా చూసుకున్నారు. రాధ నాకు చెల్లెలువంటిది. మా ఇద్దరి హృదయాలలో సోదర సోదరీ ప్రేమతప్ప మరే భావాలులేవు. నన్ను క్షమించండి" అన్నాడు మాధవరావు.

అంతవరకు గదిలో కూర్చుని వారి మాటలు వింటున్న రాధ లేచివచ్చింది.

రాధను చూసి అన్నారు దుర్గమ్మగారు: "విన్నావా రాధా! నీ బావ మాటలు"

"నిజమే మామ్మా! మాధవ్ నా అన్నయ్యలాంటివాడు" అని తల్లి దగ్గరకి వెళ్ళి "అమ్మా, నాన్నగారికి నువ్వు నచ్చచెప్పు. నేను పుట్టకముందు మాధవ్‌ని కన్నకొడుకుగా చూచుకొని నేను పుట్టగానే మీ అభిప్రాయం మార్చుకోవడం యేమీ సబబుగాలేదు. నాకు ఈ పెళ్ళి ఇష్టంలేదు" అని నిర్భయంగా చెప్పింది రాధ.

"నాకు ఎవరూ నచ్చచెప్ప నవసరం

లేదు. మీ వివాహం ఎందుకు జరగదో నేను చూస్తాను'' అన్నారు కోపంగా రాఘవయ్యగారు

''ఈ వివాహం జరగడానికి వీల్లేదు'' దాదాపు గట్టిగా అరచినంతగా అన్నాడు మాధవరావు.

''ఎలా వీలుండదో నేను చూస్తా?'' కోపంగా లేచి నిలబడ్డారు రాఘయ్యగారు.

''నాన్నగారూ! మీరు మాధవ్‌ని అర్థం చేసుకోండీ'' అంది రాధ.

''ఆ, నిన్నూ అర్థం చేసుకున్నాను'' కోపంగా అని వెళ్ళిపోయి మరల వెనక్కివచ్చి గట్టిగా అన్నారు రాఘవయ్యగారు:

''మాధవ్! నీ ఉద్దేశం అదే అయితే తక్షణం నా ఇంట్లోనుంచి వెళ్ళిపో, నీ ముఖం నాకు చూపించవద్దు." ఎవరి సమాధానం వినకుండా చరచరా వీథిలోకి వెళ్ళిపోయారు.

మాధవరావుకు దుర్గమ్మగారు, పార్వతమ్మకూడ శతవిధా నచ్చచెప్ప బోయారు. మాధవరావు నోటినుండి ఒకటే మాట.

''రాధీని నా చెల్లెలుగా నే ప్రేమిస్తున్నా'' నని.

ఆ మర్నాడు ప్రొద్దుట మాధవరావు ఎవరికీ కనుపించలేదు. కనీసం రాధతో కూడా చెప్పకుండా వెళ్ళినందుకు చాల బాధపడింది.

ఆ ముహూర్తానికే రాధకు చక్కని యువకునితో వివాహం స్థిరపరిచారు రాఘవయ్యగారు. మగపెళ్ళివారు తమంతట తామేవచ్చి అడిగారు. 'సరే' అనక తప్పలేదు రాఘవయ్యగార్కి. ''మాధవ్ లేకుండా తన వివాహమా?" రాధమనసు తల్లడిల్లిపోయింది. పెళ్ళి నాలుగురోజు లుండగానే ఊడిపడ్డాడు, మాధవరావు. ''అన్నయ్యా" అంటూ వచ్చి మాధవ్‌ని చుట్టేసింది రాధ, ''రాధీ! నేను రా ననుకున్నావా? వెర్రిపిల్లా! మీ అన్నయ్య దగ్గరుండే, నీ పెళ్ళి జరిపిస్తాడమ్మా!'' ప్రేమతో రాధతల నిమురుతూ అన్నాడు మాధవరావు.

ఈ దృశ్యం చూసిన రాఘవయ్యగారు ''మాధవ్! చెల్లెలితోమాట్లాడు కుంటూ కూచోవడం కాదు, వెళ్ళి స్నానం అదీ కానీ. అవతల చాలపను లున్నాయి" అంటూ కళ్ళుతుడుచుకుని అక్కడినుండి నిష్క్రమించారు. ''బాబూ'' అంటూ పార్వతమ్మ మాధవ్‌ని అక్కున చేర్చుకున్నారు. మాధవా! అంటూ దగ్గరకు తీసుకున్నారు దుర్గమ్మగారు.

అనూరాధ వివాహం అయిపోయింది. తను అత్తగారి వూరు వెళుతూ మళ్ళీ నీ పెళ్ళికే రావడం అంది మాధవునితో. ''నా వివాహం ఇప్పుడప్పుడే కాదు. ఉద్యోగం దొర



కాలి; వివాహం చేసుకోవాలి "ఈలోగా ఇక్కడికి ఒకసారి రావచ్చును" అన్నాడు నవ్వుతూ మాధవ్. అంతా నవ్వుకున్నారు.

* * *

అనూరాధ మెల్లిగా కనులు తెరిచింది. ఆమెకన్నులనుండి చెక్కిలిమీద పడుతున్న కన్నీటిని తుడుచుకుంది.

అవి కన్నీళ్ళుకావు; ఆనంద భాష్పాలు.

నున్నటి తారురోడ్డుమీద జెర్రిపోతులా దొర్లుతూ వెళుతూందికారు.

"ఏం. అనూ ; ప్రయాణం సుఖంగా వుందా ?" పశ్నించాడు స్టీరింగు పట్టుకున్న వ్యక్తి.

"ఆహా, బాగానేవుంది ప్రయాణం. విజయవాడలో మాధవ్, లలిత కనుపించారు." చుచాయగా వారి విషయాలు భర్తకు చెప్పింది అనూరాధ

"మరి సరళ ఏమైనట్టు ?" ప్రశ్నించాడు అనూరాధ భర్త.

"ఈ సందేహమే నాకూ కలిగింది. నేను అడగకుండానే అన్నిసంగతులు ఉత్తరం వ్రాస్తానన్నది లలిత" అంది అనూరాధ.

"మీ వాళ్ళ గొడవల్లో పడి మావాళ్ళసంగతి చెప్పావు కావు" అన్నాడు, ఒకచెయ్యి అనురాధ భుజం మీదవేసి, ఆమెభర్త.

"ఏముంది అత్తయ్య, మామగారు కులాసాగా వున్నారు. శశిని వుంచ

మన్నారు. పుంచేసాను" అంది నవ్వుతూ.

"ఆ సంగతినువ్వుదిగుతూవుంటేనే గ్రహించాను. పాప నిన్ను వదిలి వుంటుందా ?"

"వుంటుందిలెండి. అక్కడ బాగా చేరిక అయింది" అంది రాధ. కారు ఓ చిన్న బంగళాముందు ఆగింది.

ఆనంద్ పెద్ద ఉద్యోగస్తుడు; అనూ రాధ అతనిభార్య.

వారికి శశీ, బాబు ఆణిముత్యా ల్లాంటి బిడ్డలు. ఈ మధ్యనే చక్కటి ఇల్లు కట్టుకుని చిన్నకారు కొనుక్కు న్నారు. ఆనంద్ తల్లికి సుస్తీ చేస్తే భార్యాసమేతంగా మద్రాసు వెళ్ళేడు. తను ఓ పదిహేనురోజు లుండి భార్యను పిల్లలను అక్కడ వుంచి తనుమాత్రం వచ్చేశాడు. రెండునెలలు అత్తగారికి సేవచేసింది. అత్తగారి వంట్లో కులా సాగా వున్నతరువాత బయల్దేరింది. శశిని వుంచమన్నారు. శశికూడా వుంటా నని అల్లరి చేయడంమూలాన వదిలివచ్చింది అనూరాధ.

అనూరాధ వచ్చినవెంటనే లలితకు ఉత్తరంవ్రాసింది కులాసాగా చేరినట్టు. నాలుగురోజు లయినతరువాత లలిత దగ్గరనుండి పెద్ద వుత్తరం వచ్చింది అనూరాధకు. అతృతతో విప్పి చదవ సాగింది అనూరాధ.

"రాధీ! ఆ రోజు నీతోకూడా చెప్ప కుండా అన్నయ్యవెంట బయలుదేరి వచ్చేశాను. వొదిన చాలా మంచిది. నాకు జరిగిన అన్యాయం విని బాధ పడ్డది. అసలు ఈ సంబంధం వొద్దని అన్నయ్య నాన్నకు వ్రాసేడుట. పాపం, నాన్నకైనా ఏం తెలుసు చెప్పు ? ఏదో కలలో జరిగిపోయినట్టు జరిగింది. అంతా మర్చిపోయాను గాని మాధవ్‌ని మర్చిపోలేక పోయేను. మాధవ్ కూడ ఇక్కడ వుంటున్నాడు కదా ? ఎప్పుడు ఎక్కడ తటస్థ పడ తాడో అని భయపడేదాన్ని. కాని అప్పుడప్పుడు మాత్రం మాధవ్ ని చూడా లనీ క్షమించమని వేడుకోవా లనీ అనుకొనేదాన్ని. ఒకసారి హఠా త్తుగా కనుపించాడు మాధవ్. ఒంటిగా కాదు జంటగా. మాధవ్ వెనకాల అందమైన అమ్మాయిని చూసి క్షణ కాలం అలా నిలబడి పోయాను. మాధవ్ నన్ను చూడలేదు. నాకు కావలసినది అదే ! ఇంటి కొచ్చిన తరువాత ఆలోచిస్తూ ఆ రాత్రి అంతా గడిపివేసేను. ఆ అందమైన అమ్మాయి ఎవ రన్న ప్రశ్న నాలో కలిగింది. ఎందుకో చాల బాధపడ్డాను, రాధీ ! ఆ రోజు నువ్వెంత బాధపడివుంటావో అప్పుడు తెలుసుకున్నాను. కానీ రాధీ! నీలా నేను త్యాగం చెయ్యలేక పోయాను. నే నెంత స్వార్థపరురాలిని? నా వెర్రిగాని మాధవ్ నావా డెలా

అవుతాడు ? కావా లని నాకు నేనుగా వస్తున్న అదృష్టాన్ని జారవిడుచుకున్నాను. రాధీ ! నీకు గుర్తుందా నువ్వు మాధవ్‌కి ఉత్తరం వ్రాశావు లలిత వివాహం స్థిరపరుస్తున్నారు. నిన్నే నమ్ముకుంది లలిత.ఉత్తరం అందగానే బయలుదేరి రమ్మని వ్రాశావు" కాని ఆ ఉత్తరం మాధవ్‌కి చేరలేదు. పనిమనిషి దగ్గరనుండి నేను తీసుకున్నాను. నీతో చెప్పవద్దని దానికి కొంత ముట్టజెప్పానుకూడా. నాన్న సంబంధం స్థిరపరచారు. అవతలవారికి మాట ఇచ్చినతరువాత హఠాత్తుగా పెళ్ళి ఆగిపోతే, ఎంత తలవంపు, నాన్నకి ఎంత అప్రతిష్ట అనుకుని ఆ ఉత్తరంచదివిచింపివేశాను.కాని పెళ్ళి ఆగనూ ఆగింది; నాన్నకూడా బాధపడ్డాడు జరిగిన అవమానానికి. ఆరోజు ఎంతో ఏడ్చాను. రెండేళ్ళు గడిచాయి. ఒకరోజు అన్నయ్య కారుకింద ఎవరో మనిషి పడ్డాడని అతన్ని అన్నయ్యాఆసుపత్రికి తీసుకెళ్ళి కట్లుకట్టించి ఇంటికి తీసుకువచ్చాడని పనివాడు చెప్పేడు. నేను అన్నయ్యగదిలోకి వెళ్లేను. అక్కడ మంచంమీద ముఖంనిండా కట్లతో పడుకునివున్నాడు మాధవ్. మాధవ్' అని కేకేసి పడిపోయాను. తెలివి వచ్చేసరికి వొదిన దగ్గ రుంది. ఏమయిందమ్మా' అని అన్నయ్య ఆత్రుత్తో అడుగుతున్నాడు. ఇక ఏమీ దాచకఅంతాచెప్పేశాను. వొదిన బాధపడింది. అన్నయ్య మౌనంగా విని వూరుకున్నాడు. వారం రోజులకి మాధవ్ కోలుకున్నాడు. దగ్గరుండి నేనే సేవచేసేను, తరువాత మాధవ్ చెప్పేడు సరళని వివాహం చేసుకున్నట్టు, మశూచికం వచ్చి చనిపోయిందని వాపోయాడు. కొన్నాళ్ళకి ఆయన భార్య నయ్యాను. రాధీ! ఇప్పుడు ఆయన హృదయంలో నాకొక్కదానికే స్థానం. నేను అదృష్టవంతురాలిని కదూ ! రాధీ ! నీకు చెప్పడం మర్చాను. కాదు ఇద్దరం మర్చిపోయాము. మా ఇంట్లో ఓరాధీ వుంది తెలుసా? ఆ రోజు స్కూలుకువెళ్ళిపోయింది. మా అనూరాధకు ఎనిమిదేళ్ళు. ఆ రాధీ, 'సరళపాప' మా బాబూ నిద్రపోతున్నా రని స్టేషనుకు తీసుకురాలేదు. ఈ సంగతులు చెప్పడానికి వ్యవధి లేకపోయింది. మరి వుంటాను.

నీ లలిత."

ఉత్తరంచదివి అక్కడే కూర్చున్న భర్తఆనంద్‌కి అందించింది అనూరాధ.

లలిత వ్రాసిన ఉత్తరాన్ని చదివి "బాగుంది. లలితజీవితం బాగుపడింది. నీకుకావలసిందికూడ అదే''అన్నాడు.

అనూరాధ మౌనంగా ఆకాశంవైపుగా అట్లా చూస్తూ కూర్చుండిపోయింది. 





9 బొమ్మలకే ప్రాణాలొస్తే




వెన్నెల నీ కన్నులలో వెతికి తెచ్చుకున్నానే
అమృతము నీ మనసునుండి అందిపుచ్చుకున్నానే

మబ్బు క్రమ్మి యున్న నేటి మసిరాతిరి చీకటిలో
వెన్నెల మేడలు కట్టుక విర్రవీగుతున్నానే

ఆకలితో కేక వేయు అంతరాత్మ గొంతుకలో
నీ కమ్మని జ్ఞాపకాల నీళ్లు చల్లుతున్నానే

పాములవలె తిరుగాడే పాపులు పవళించుటకై
ముచ్చటైన మొగలిపొదను మొలిపించుతున్నానే

మనసు మనసు కలియుటయే మహాపాప మని కసిరే
మనుషులలో మనసుకొరకు మరీ వెతుకుతున్నానే

దగ్గరలూ దూరాలూ తనవులకేనే, సకియా!
దూరా లెరుగని మనసున చేరి ఒదిగి యున్నానే.



ప్యాంట్ జేబుల్లో చేతులు పెట్టుకొని వొక్కొటీ, వొక్కొటీ ఆఫీసు మెట్లుగి, సాలోచగా లెఖ్ఖపెట్టుకొంటూనది రోడ్డుమీద అడు గెట్టేసరికి అసలు సమస్యేదురైంది నరశింహారావుకి.

'ఎటు వెళ్ళా లనుకుంటున్నావురా ? అనడిగాడు, బద్ధకంగా ఆవులిస్తూ నరశింహారావు మనస్సులోని నరిసిగాడు.

'అదే తేలటంలేదురా' అన్నాడు నరశింహారావు ఓసారి కసిదీరా రోడ్డు రెండువేపులా కలీజూసి.

'అయితే యింటికే నడు. కాస్సేపు సర్దాగా నీ - వేణితో సివిల్వా రేసుకుందాం' అన్నాడు నరిసిగాడు లోపల్నుంచి.

'వొద్దురా — ఇంకా యే మొహం పెట్టుకొని దాంతో మాటాడ మంటావ్ ? నిన్నట్నుంచీ — మొగుణ్నన్న యిదన్నా లేకుండా ఛడామడా అనేస్తోంది గదా — దాని మనస్సులో అదే వనుకుంటూందీ అంట ?'

'అదే తేల్చేసుకుందాం పద మరి.'

ఇష్టం లేకపోయినా, నరిసిగాడి బలవంతంవల్ల, యింటివేపు నడక మొదలెట్టాడు !

'వారే నరిసీ! ఇందులో నా తప్పేవన్నా వుందట్రా ? నేను చిలక్కి చెప్పినట్టు చెప్పాను; దానిమీద వొట్టేసి మరీ చెప్పాను, తప్పకండా వొచ్చే నెల కొనుక్కొస్తా నని ! అంతకంటే అభయ మింకేం గావాల్రా మరి ?'

'సరే ! అదంతా అడిగేద్దాం వెళ్ళి.'

'నా కేవిటో యింటి కెళ్ళా లని లేదురా, దాని ప్రవర్తన ఈ రెండ్రోజుల్నుంచీ చూసున్నాక ! పోనీ, మినర్వాలో నందా పిక్చ రేదో కొత్త దొచ్చినట్టుంది,

ఆ హాలుకి పోదామేంటి ?' అని అరిచాడు. పెద్ద ఏక్సిడెంటుని తప్పించేవాడ్లా !

'ఏక్స్యూజ్ గానీ, ఇంటికి పద !' — లోపల్నుంచి డొక్క చించేస్తా పదన్నట్టు పొడిచేస్తుంటే ఎలా కాదనడం ?

మరీ బరూ బరూగా అడుగు లేసుకొంటూ యింటికి చేరుకున్నాడు.

వాకిట్లోనే ఎదురైంది హీరోయిన్.

'వారే ! నువ్వేం ముందుగా డైలాగులెత్తుకోకురా' లోపల్నుంచి వార్నింగిచ్చాడు నరిసిగాడు.

'సరే...గాని చూడ్రా అది. నే నొచ్చినట్టు చూసిగూడా వాల్జడ నా ముఖానికి కమ్చీలా తగిలేట్టు తిప్పుకొని లోపలికి ఎలా పోతోందో —' ఫిర్యాదు చేశాడు నరశింహం.

'పీస్, పీస్ రా...క్షణంలో అన్నీ తేలిపోతాయ్...లోపలికి నువ్వా వెళ్లు..'

నరిసిగాడి మాట మన్నించి లోపలికెళ్ళాడు నరశింహం !

నీలవేణి వసార్లోకి వెళ్ళింది.

నరశింహారావు నరిసిగాడు చెప్పిన ట్లెళ్ళి కుర్చీలో కూలబడ్డాడు.

వో రెండు నిమషాల తర్వాత నీలవేణి కాఫీ తీసుకొని వచ్చింది. వచ్చి కాఫీ కప్పూ ప్లేటూ టేబులుమీద పెట్టేసి మళ్ళీ వెనక్కి తిరిగి లోపలికి పోబోయింది.

'ఒరే నరిసీ ! చూడ్రా దాని పెడసరం— ఎవడో ముష్టాడికి పడేసినట్టు పడేసి పోతోంది. దా న్నేం జెయ్యా లంటావిప్పుడు ?' పటపట రావణాసురుళ్ళా పళ్ళు కొరికాడు.

'మరో క్షణ వాఁగరా — ఏం చేస్తుందో చూద్దాం.'

'నో నో ! నువ్వడ్డం రాకు — వెళ్ళి ఛడామడా నాలుగు తిట్టేస్తా'

'నువ్వు తిడితే, అదేం తక్కువ తెలుగు పిక్చర్లు చూళ్ళేదు — గుభుక్కు నెళ్ళి ఓ సినీ పాట పాడేస్తుంది. కాస్తో మరి, దేవుడొచ్చి నీ డొక్క చీల్చేస్తాడు.'

'ఏడిశావ్. నా వెనకాల వో ఘంటసాలున్నాడు ఏ వనుకున్నావో మరి' ఎదురు ఛాలంజ్ చేశాడు నరశింహారావు.

'అయితే చావ్ !'

నరశింహారావు వోసారి లేవబోయాడు. 'ఇదిగో వేణీ...నిన్నే...... ఏయ్...ఏవిఁటా పెడసరం' అనబోయాడు. కాని, గమ్మత్తు, అన్లేకపోయాడు. చెమట యింత కక్కేసుకొని, మళ్ళీ కుర్చీలో కూలబడిపోయాడు.

'ఏఁరా కూలబడిపోయావ్ ?' లోపల్నుంచి నవ్వేస్తున్నాడు నరిసిగాడు.

'నేనేం కూలబళ్ళేదు. చేయిదాటి అదే లోపలికి పోయింది. మళ్ళీ రానియ్ — తిట్టేస్తా, చూడు నా తడాఖా.'

'సర్లే — ఆ కాఫీ కాసింత తాగు, వొంట్లో శక్తొకటొస్తుంది.' అని కాఫీ కప్పు న్యూచిపించాడు నరిసిగాడు.

కాఫీ న్యూచడగానే నోరూరింది

నరశింహారావుకి. కాని మళ్ళా పంతం పుట్టుకొచ్చింది — అంత నిర్లక్ష్యంగా వున్న దాని చేతి కాఫీ తాగడమూ అని.

'వారే, వాస్తోందిరోయ్ జనతా ఎక్స్‌ప్రెస్' మోచేత్తో పొడిచాడు నరిసిగాడు లోపల్నుంచి.

'అదేవిఁట్రా, వొత్తి బ్రూట్లా అంతలా గావుకేక లేస్తావ్' అని కసురుకున్నాడు నరసిగాణ్ణి.

నీలవేణి ఏదో పనిమీ దొచ్చి, వెళ్ళిపోబోతోంది.

'వారే, వెళ్ళిపోతోంది అడిగేరా ఛట్టున.'

'ఇదిగో అడుగుతా — ధైర్యం లేదనుకున్నవా ?' అని వోసారి కంఠం సర్దుకొని అరిచాడు — 'ఏయ్ — ఓ — నిన్నే'—

నీలవేణి ఆగింది.

నరశింహారావు తడబడ్డాడు— ఏవిఁటి మాటాడాలి అనుకొంటూ.

లోపల్నుంచి నరిసిగాడు నవ్వుకున్నాడు, 'పో. వెధవా ! నే నేం సాయం చెయ్యను' అంటూ.

నరశింహారావు వొంటిరిగా డైపోయాడు. తడబడ్డాడు —

'ఆఁ...ఏవిఁటి... రెండ్రోజుల్నుంచి ముతలా ముడుచుక్కూచున్నావ్ ?' నీలవేణి మరింత మూతి ముడుచుకొంది.

'తెలీదా ?' అంది కసిరేట్టు.

'తెలుసు. కాని యివతల నా పరిస్థితి కూడా నువ్వోసారి ఆలోచించావా?'

'ఏవిఁటాలోచించడం

'ఈ నెల జీతం ఎంత తక్కువొచ్చిందో —'

'అందు క్కారణం నేనా ?'

'మీ చెల్లాయి.'

'అనవసరంగా దాని మీదెందుకు నేరాలు మోపడం ?'

'కాక ? డబ్బు నాకు చేతిలో లేనప్పుడు ఎందుకు పెళ్ళాడాలి ?'

'అయితే దాని పెళ్ళికి వెళ్ళడం వల్లా, ఈ నెల జీతం తక్కువ వస్తా ?'

'కాక ?'

'కాస్త సిగ్గుండండి ఆమాటన్డానికి.'

'సిగ్గెందుకు ?'

'వచ్చేది వరలక్ష్మి వ్రతం — వ్రతానికో కొత్త చీర కొనమంటే, మధ్య దానిపెళ్ళి వంకగా చూపిస్తున్నారు.'

తన వాదనని బలపర్చుకోడానికి పూజనో ఆయుధంగా వినియోగిస్తోందని నరశింహారావు కనిపెట్టకపోలేదు : ఈ నగ్న సత్యాన్ని డిస్కవర్ చేయడంతో అతనికూడా మంకుపట్టు హెచ్చింది

రింగు రింగు మంటూ తనూ ఆవిడా వున్నా రిక్కడ. ఈ యిద్దరికీ నెలకు నూర్రూపాయలు పైగా ఎటూ గాకండా అయిపోతున్నా యంటే విన్నవాళ్ళవరైనా నవ్విపోతారు. ఈ జీతం చాలక పైనో ఐదొందలు అప్పులు కూడా చేశాడు. ఏం నిర్వాకాలు వెలగబెడుతున్నావ్రా అప్పు ల్చెయ్యడానికి ? అని నాన్న

గారి గోల అక్కణ్ణుంచి! ఇక్కడ చూస్తే ఈవిడగారు నెల్నెలా చీరలకూ సింగారాలకూ లేదని గోల!

'అన్నా!' అని ముక్కుమీద వేలేసుకున్నాడు లోపల నరిసిగాడు. 'ఒరే! నరశింహంగా! ఆ అయిదొందలప్పూ ఎవరివల్ల జరిగిందిరా? అదంతా నువ్వు నందా పిక్చర్ల కోసం ఖర్చు పెట్లేదురా?' అని, మధ్య పెద్ద సలహా యిచ్చేవాళ్లా లేచాడు, లింగు లింగు మంటూ.

'ఛట్! నోర్మూస్కొని పడుండ్రా వెధవా! నీ హితబోధిప్పు డెవడడిగాడు?' అని లోపల కుక్కేసుకున్నాడా నరిసిగాణ్ణి.

'నాకెందుకులే' అని తిరిగెళ్ళి అంతరంగంలో చాపేసుక పడుకున్నాడు తన్నుల్దిన్న నరిసిగాడు.

'నేను మగాణ్ణి! గడిస్తున్నానేమో, ఖర్చు పెట్టుకుంటాను. ఎవరన్నా ఎందుకు లెఖ్ఖలడగాలి? నేను పిక్చర్ల కెడుతున్నాననే యిదివల్లేనా నువ్వు నెలనెలా చీరలూ, నగలూ అడుగుతూంట?' అని సొంతంగా అరచాడు నరశింహారావు.

'ఓహో! మహా నెలనెలా తెచ్చి పడేస్తున్నా రండీ — ఇదిగో కొత్తచీరలు కట్టుకోలేక చచ్చిపోతున్నాను.'

నీలవేణి ఎత్తిపొడుపుకి అంతరంగం లోని నరిసిగాడు ఎగతాళిగా నవ్వాడు. నరశింహారావుకి శివాలెత్తాయి.

'ఇంతవరకూ ఎవరు కొనిస్తూంటే కట్టుకుంటున్నావో?'

'అహాఁ! మీరే కొనేస్తున్నారు యివిగో లక్షలక్షలు...ముఖానికి సిగ్గన్నా లేకండా మాటాడుతున్నారు!...మీరు మ్యూషెర్రాకులూ, బిస్కీలూ గజం నాలుగేసి రూపాయ లెట్టి నెకుమూడేసి జతలు కుట్టించేసుకుంటున్నా ఫర్వాలేదు గాని, మూణ్ణెల్ల కోసారి ఓ చీరడిగితే —'

నరశింహారావు మగసిరి చిన్నసైజు షాక్ తిన్నది. ఈ మనిషిని తిట్టడంవల్ల లాభం లేదని దెప్పిపొడిచాడు:

'అవు న్నా యిష్టం! నేను మగాణ్ణి నా యిష్టం వచ్చిన బట్టలు నేను కుట్టించుకుంటాను.'

స్కూల్ఫైనల్ చదివిన నీలవేణి లోని నీలూ ఉలిక్కిపడి లేచి—'అదేవిఁటే, అత నలా మన అబలత్వాన్ని దెప్పి పొడిచేస్తోఁటే వూరుకుంటావు?' అని ప్రేరేపించింది మోచేత్తో పొడిచేస్తూ.

నీలవేణి ఓ సారి జలదరించుకొని —

'మీ యిష్టమా? సరే, నా యిష్టమొచ్చినట్టు నేనూ చేస్తాను.'

అంతరంగం లోని నరిసిగాడు నరశింహాన్ని పొడిచాడు 'ఒరే! వూరోక్కొద్దురోయ్; అడుగు — ఏం జేస్తుందో?'

'అవును — ఏం జేస్తావ్?' అనరచాడు ఘట్టిగా ఝడుసుకునేట్టు.



"నీళ్ళ పాలంటారా! చిక్కటిపాలు మీకు పోస్తే మా పాడితో పద్నాలుగు వాడికల వాళ్ళు ఏమయిపోతా రమ్మా?"

---

'ఏం జేస్తానా...' నీలవేణి నసుగుతోంది.

నీలవేణ్లోని నీలూ లేచి నుంచుని 'అనవే, నువ్వూ వూళ్ళేల్తానని' అంది.

'అవును; నేనూ వూళ్ళేల్తాను మీలా' అంది నీలవేణి మరింత ఘట్టిగా.

'ఒరే ఒరే! నరశింహం! చంపేసింద్రా: నీ పెళ్ళాం వూళ్ళేల్తానంటోంది —' అని గోలెట్టి వెర్రెత్తించాడు నరిసిగాడు లోపల్నుంచి.

నరశింహారావు కళ్ళు తేలేశాడు సమాధానం చెప్పలేక!

'వొరే! అలా దిగాలుపడిపోతావేంరా?' అని గోలెడుతున్నాడు నరిసిగాడు గుండెల్లోనుంచి.

'ఏవనమంటావ్‌రా అయితే?'

'నేన్లోపల్నుంచి ప్రోమ్టింగ్ చేస్తూ వుంటాను. నువ్వు పోర్షనప్పచెప్పెయ్.'

'సరే!'

'వొరే! ముందోసారి ఘట్టిగా దగ్గరా'

నరశింహారావు, గోడలబూజొదిలేట్టు ఘట్టిగా దగ్గేశాడు.

'వోసారి కాలరెత్తు'

నరశింహారావు కాలరెత్తాడు.

'షర్టు చేతులైపైకెత్తి దండలు చూపించు.'

నరశింహారావు అడ్డాడు. 'వొరే, స్నానం చేసేటప్పుడు చాలా సార్లు చూసింద్రా నా దండల్ని'.

'ఫర్వాలేదు — ఈసారి కోపం కక్కుతూ చూపించు. కళ్ళల్లో నిప్పులు కురిపించు; నాసికారంధ్రాలు పెద్దవి చెయ్; ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తీవ్రం చెయ్.'

'ఒరే, ఈ పోజు లన్నీ పెళ్లేక ఛస్తున్నా న్రా; ముందు డైలాగు చెప్పరా!'

'ఆగాగు, అంతా జాబితా ప్రకారం చెయ్యాలి......గొంతు సినీ విలన్లా మార్చు...'

నరశింహారావు విసుగెత్తిపోయాడు పూర్తిగా —

'వొరే! ముందు డైలా గేడవరా! లేటయిపోతే అది నన్ను ఓవర్‌కమ్ చేసేస్తుంది.'

'ఆఆఁ, అయితే అను: ఏవిఁటన్నావ్?'

'ఏవిఁటన్నావ్?' పాఠం అప్ప చెప్పాడు నరశింహారావు.

'ఊళ్ళేలుతావా?'

'ఊళ్ళేలుతావా?'

'ఏవిఁటే, వూళ్ళేలడానికి నీకున్న క్వాలిఫికేషనూ?'

నరశింహారావుకి ఛప్పున జ్ఞాపకాని కొచ్చింది, 'వొరే! అది స్కూల్ ఫైనల్ పాసయిందిరా!' అన్నాడు పుసుక్కున.

'ఛట్! నే నన్నట్టను' విసుక్కున్నాడు లోపల్నుంచి నరిసిగాడు.

'సరే సరే! కోప్పడిపోకు మరి! ఆ...వూళ్ళేలుతావా? ఏవిఁటే నీకున్న క్వాలిఫికేషనూ?'

నీలవేణి కూడా నిప్పులు కక్కుతోంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో తీవ్రంగా వూగిపోతోంది. చీరచెంగు బిగించి, నాసికారంధ్రాలు పెద్దవి చేసి —

'నే స్కూల్ ఫైనల్ ప్యాసయ్యాను.' అంది

'వొర్తి బోర్ మార్కులతో' చెప్పాడు నరశింహారావు.

'మహా నాకంటే మీకు స్కూల్ ఫైనల్లో ఎక్కువొచ్చినట్టు?'

'కాక? ఇంగ్లీషులో 36 పెర్సంట్; సైన్సులో 37 పెర్సంట్; జాగ్రఫీలో 37 పెర్సంట్...'

'ఆఁ, తర్వాత? ఆగారేం — లెఖ్ఖల్లో యెన్నొచ్చాయ్ — చెప్పండి?'

'ఒరే! కనిపెట్టేసింద్రా! నీకంటే దానికే లెఖ్ఖల్లో మార్కులెక్కువొచ్చేశాయి' అని అరిచాడు, ఛాతీలోంచి బైనాక్యులర్స్‌తో తమాషా చూస్తున్న నరిసిగాడు.

'ఏడిసింది! ఆ లెఖ్ఖ లిద్దేవాడు ఆడపిల్లలంటే వొర్తి అయిసైపోతాడు!'

'ఆ ఆఁ - పరుగెత్తలేక వెనకటి కెవడో నామీద బలాదూ రన్నాట్ట'

మళ్ళీ లోపల్నుంచి నరిసిగా డరిచాడు:

'వొరే : నువ్వు, స్కూల్ఫయినల్తో చదు వెత్తిపేట్టేలేదుగా — బియ్యే పాస య్యావ్ — అది చెప్పరా ?'

భుజాలు సర్దుకొని నరశింహారా వోసారి ఘర్జించాడు : 'నేను బియ్యే పాసయ్యాను...'

'ఉద్ధరించారు : నన్నూ చదివిస్తే నేనూ ఎమ్మే పాసై వుండేదాన్ని. అప్పు డెవరిమీ దెవ రాధారపడుండేవారో తెలిసొచ్చేది.'

'ఒరే, దెప్పుతోంద్రోయ్ :...అందు కేరా, మీ మొగరాయళ్ళ నందర్నీ హెచ్చరించేవాణ్ణి : ఆడదాని కంత స్వాతంత్ర్యం యిచ్చేకంద్రా అని : వొాఖడు, వొాఖడన్నా వినిపించు కున్నాడూ - యిప్పు డేడవండి — ఆ దెప్పు ల్వీని' మధ్య నరిసిగాడు దెప్పేస్తు న్నాడు, సమయం కల్సొచ్చింది దని :

నరశింహారావుకి యిప్పుడు నర్సిగాడి మీద చిన్న కోపం పుట్టుకొచ్చింది :

'వొరే నర్సీ' అన్నాడు గంభీరంగా, పౌరానిక్ యాక్టర్ పో జెట్టి.

'వోయ్ : వున్నా లోపలే, చెప్పు'.

'ఇహ నువ్వు నోర్మూసుకోరా : నీ సలహా లిహ నుంచి నా కనవసరం. నాకూ మరి బియ్యే నాలె డ్జేడిసింది. దీన్ని తిట్టడానికి నీ ప్రోబ్లిం గిహ అనవసరం.'

'వొరే : గ్యాపక ముంచుకో, నాతో ల్లేకపోతే ఛస్తావ్'

'ఛర్వాలేద్లే : నువ్వు నోర్మూసుకొని లోపల పడుండు.'

గొణుక్కుంటూ నరిసిగాడు లేచినట్టే మళ్ళా లోపలికి పోయి చాపేసుక పడుకున్నాడు.

నరశింహారావు మళ్ళీ కాలర్ సర్ది చొక్కా చేతు లెత్తి, కోపంతో ముఖ ద్యుతులు మార్చి -

'అయితే నువ్వేవిఁటంటావ్ నువ్వాళ్ళేలి నన్ను పోషిస్తా నంటావ్? అనేశాడు ఘట్టిగా నరశింహారావు, వోసారి నరిసిగాడి వేపు 'ఎల్లా వుందిరా నా డైలాగూ ?' అన్నట్టు చూసి.

'వొర్తి ఇమిటేషన్ కొటేషన్స్ అనేశాడు, బుంగమూ తెట్టి నరిసిగాడు లోపల్నుంచి.

నీలవేణి చేతులు కట్టి, ముక్తసరిగ అంది 'తప్పకండా పోషిస్తాను.'

'హాఁ : : :' అంటూ హాశ్చర్య పోయాడు నోరింత చాపి నరశింహారావు

'ఏవిఁటే — నువ్వు నన్ను పోషి స్తావా ?' అన్నాడు లావుగా హాశ్చర్యాన్ని ముఖంలో కనబర్చి, అవఁదంతా గిన పోజులో.

'వొరే : రాంగ్ డైలాగు వినిరే స్తున్నావ్రోయ్ — ఏంటీ క్లయిమ క్సొస్తుంద్రోయ్ జాగర్త' అన్నాడు లోప ల్నుంచి నర్సిగాడు పుసుక్కున :

'ఏవిట్రా రాంగ్ డైలాగు? అది వూళ్ళ మీద పడి వుద్యోగాలు జేస్తా నంటూంటే, నా మొహం అవదం తాగి నట్టు గాక, అమృతం తాగిన ట్టుంటుంద్రా? అది వుద్యోగం జేసి, నన్ను పోషిస్తా నని అంత ఘట్టిగా ఢంకా పగల్గొట్టిన ట్టుంటూంటే, ఇహ నీ మీసక ట్టుండెందుకు చెప్పు? రాజకపూర్ మీసా లెట్టుకున్నం దుకు సగం పౌరుషం తగ్గిపోయింది గాని, నాన్నార్లా మిలట్రీ మీసా లుంటే ఈపాటికి దీ న్నేం జేసేద్దునో తెలుసా?'

'ఏవిటే నీలవేణీ మీ ఆయన స్వగతంలో మాటా డేసు కొం టు న్న ట్టున్నాడు?' అంది నీలవేణి గుండెల్లో వున్న నీలూ చెంపకు చేతు లాన్చి!

'మనం వో షా కిచ్చాంగా దిమ్మ దిరిగేట్టు! దాంతో బే జా రె త్తి పో యి లోప లున్న నరిసిగాడ్తో రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్ చేసేస్తున్నట్టున్నారు' అంది నీలవేణి తన వాగ్ధాటికి తానే ముచ్చట పడిపోతూ.

'అందుకేనే మగాళ్ళకు ముందుచూ పెక్కు వంటారు' అంది నీ ల వే ణి లా పాయింట్ తీస్తూ.

'నాకు మాత్రం లేదటే?'

'వుంటే, యేదీ వొఖసారైనా నాతో యెప్పుడైనా సంప్రదించావటే? అందుకే స్వర్గంలో దేవుడు - ఆడదానికి అంత రంగమై పుట్టమని శాశించినపుడు ఏ ఆత్మా మీ లోపలికి రా నని గోలెడుతుంది—'

'మా పిచ్చినీలూ! ఇప్పుడు నాలో వుండటంవల్ల నీ కొచ్చిన లోటేవిటి?.. అదిగో మళ్ళా ఆయన సివిల్వార్కి తయా రవుతున్నారు: ప్లీజ్ సాయం చెయ్యి —'

నరశింహారావు ఘట్టిగా దగ్గాడు.

నీలవేణీ, నీలూ కంబైండ్గా నవ్వు కున్నారు ఎగతాళి చేసేట్టు!

'సరే అయితే, రేపట్నుంచి నువ్వు వుద్యోగానికి వెళ్ళు: నేను యిం ట్లో కూచుంటాను, నన్ను పోషించు.'

లోపల్నుంచి నీలూ గోలగా కిలకిల మంది, 'ఒసేవ్! మాంచి వి ట్టొకటి విసరానికి మాంచి ఛా న్సిచ్చాడేవ్ - అను, అను — మ రి యిం టో కూ చు ని వొంటొండుతారా? మా బదులు పిల్లల్ని కంటారా?' అని.

'ఛఛ! బావుండదే! అ వేం మాటలు' అని వారించబోయింది నీలవేణి!

'విట్టు విసరానికి బా గూ వో గూ ఏవిటే? అలా అనకపోతే, మళ్ళీ నీ లోకువ కనిపెట్టి నె త్తి నెక్కుతాడే! అను, ఉఁ, అను...'

నీలవే ణో గుటక వేసింది. స గం సి గ్గు తో చచ్చిపోతూ — 'ఏవండీ — అయితే — మీరు...అయితే —'

'ఏవిటే ఆ న సు గు? ఘ ట్టి గా అన్లేవూ?' గోలెడుతోంది లోపల్నుంచి, మగసిరి వన్నెర్నంటు అబ్బిన నీలూ!

'సిగ్గేస్తోందే!'

తున్నాను. సాల్వ్ చేయాల్సింది మరి నీ మీదుంది.'

'సరే ఏడు' అనేశాడు, ఇదేదో ఆలూ మగల తగువులమీద థీసిస్ వ్రాసి డాక్టరేట్ కోసం కక్కూర్తి పడుతోంది కావోసు అనుకుంటూ.

'ఈ చుట్టూ వున్న వాతావరణం మానవ వాతావరణం. ఈ మధ్య వో కుర్రాడూ, కుర్రదీ పెళ్ళాడి చచ్చేవరకూ వొదలకూడదని అగ్గెదుట, ఒట్లేసి దండలు మార్చుకున్నారు.'

'అవును, రెండేళ్ళక్రితం మా నరశింహంకి తగిల్న గండంలే.'

'ఏం? మా నీలవేణికి తగిల్న గండ వని యెందుకనుకోకూడదు?'

'సరే, యిద్దరికీ జాయింట్‌గా జరిగిన గండం – ఉఁ – క్యారీ ఆన్ –'

'మళ్ళీ బొట్లే రింగ్లీషు' అనుకుంది నీలూ. 'పెళ్ళాడుకున్నవాళ్ళు చాలా సర్దాగా ఖులాసాగా కబుర్లాడారు కొంత కాలం.'

'కాలమేవిఁటి – పాతిక నెల్లేగా?' అడ్డాడు నరిసిగాడు.

'నెల్లూ, ఏళ్ళూ మానవమాత్రులకు. మనకి వాట్లతో లెఖ్ఖ లేదుగా?'

'దట్సాల్ రైట్. ము వ్వాన్.'

'ఇదిగో నరిసీ – ఆ బొట్లే రింగ్లీషు మానేస్తావూ కొంతసేపు?'

'ఈవాళ యింగ్లీషు మానేమన్నావ్, రేపు నాలికే పీకేసుకోమంటావ్. నీకు భావం ప్రధానంగాని భాష కాదుగా?

'అచ్చా!... అమీ బోల్చీ

'ఆదేం బొల్చీభాష పిల్లోయ్?

'ఏం? భావం ప్రధానంగ – బెంగాలీలో చెబుతున్నా విను మరి...'

'సర్లే, తెలుగులోనే యేడు

క్షణం ముఖం మాడ్చుకొని నీలూ మళ్ళీ అంది.

'భార్యంటే ఏవిఁటి?'

'అదీ నువ్వే చెప్పు'

'అర్ధాంగేనా?'

'కామోసు.'

'కామోసేవిఁటి! అవును. అర్ధాంగంటే అర్ధం?'

'తెలుగులో నా కంత జనరల్ నాలెడ్జి లేదు. నువ్వే చెప్పు.'

నీలు వోసారి ముఖం చిట్లించుకొని – 'అర్ధ శరీరం' అంది. 'అర్ధ శరీరం గాబట్టి ఏ కష్టా లొచ్చినా సుఖాలొచ్చినా యిద్దరూ సగం సగం పంచుకోవాలి.'

'ప్లా నేస్తోంద్రోయ్ నరసింహం!' అన్నట్టు నరసింహం వేపు చూశాడు నరిసిగాడు.

'అవునా? అయినప్పుడు, మీ నరసింహం సంపాయించే దాంట్లో సగభాగం మా నీలవేణికి రావాలి.'

'సరే, నీ సమస్యను డిస్ప్లే చేశావ్ కదా – నా కథనం విను.'

'ముందు వొప్పుకున్నావా?'

'నా వాదనకూడా చెప్పనీ! తర్వాత

తేల్చుకుందా మెవ రెవరిని వొప్పుకో వాలో.'

'సరే అంది నీలు చతికిల బడుతూ.

'నే నడిగిన ప్రశ్నలకు సూటిగా సమాధానం చెప్పాలి మరి.'

'ఉఁ, అడుగు.'

'నీకు ఈ వర లక్ష్మీవ్రతానికి చీర కావా లన్నావ్.'

'అవునూ.'

'ఎంత ఖరీదులో కావాలి?'

'వో పాతిక ముప్పై రూపాయల్లోపు నై తే చాలు.'

నరిసిగాడు నరసింహారావు వేపు తిరిగి 'వొరే, నరసింహం! సరే, సాంక్షన్ చేసెయ్‌రా' అన్నాడు.

నరసింహారావు నిటారుగానిలబడ్డాడు. 'తగూ తీర్చమని పంపిస్తే మొదటికే ఎసరెడుతున్నా వేవిఁట్రా?'

'వొరే! అంతా మన మంచికోసవేఁ వేస్తున్నారా ప్లాను — నీకెందుకు - ఉఁ, అనేసెయ్'

'ఉఁ' అన్నాడు నరసింహారావు తటపటాయించి.

'సరే! వరలక్ష్మీవ్రతానికో చీర కొనేస్తాడు, మరి ఈ యేడా దంతా యిహ చీరలడగవ్ గదా మరి?'

'అ దెలా గవుతుంది' అంది నీలు దబాయింపుగా.

'ఏం?'

'ఇంకా యెన్ని పండగ లున్నాయి— ఆ పండగల్లో పాతవి కట్టుకోమంటావా?'

'నే నదేం అన్లేదు. సరే మొత్తం యేడాదిలో యెన్ని పండుగలో వరసాగ్గా చెప్పేసెయ్, పండగ పండక్కీ యెన్ని చీరెలో మొత్త మొకేవూపున చెప్పు.'

అక్కణ్ణుంచి నరసింహారావు అరుపులు మొదలెట్టాడు 'ఒరే నరిసీ, నరిసీ.'

'నువ్వాగరా ఇడియట్! బియ్యే అంటావ్— ఎందుకూ, బొత్తిగా జనరల్ నాలెడ్జ్ లేదు.'

నీలూ కాస్సేపు ఆలోచించుకొంది.

'అయితే విను.'

నరిసిగాడు సావధాను డయ్యాడు.

'మొట్ట మొదట సంక్రాంతి పండగొస్తుంది. అప్పుడు కనీసం మూడు చీరలు గావాలి.'

'ఉఁ'

'తర్వాత పండగ ఉగాది. అప్పుడు ఒకటి చాలు.'

'ఏం, రెం డేసుకో.'

'వద్దులే—ఛస్తాడు మీమిత్రుడుకొ న్లేక

'తర్వాత?'

'మంగళగౌరీ వ్రతాని కొకటి.

'ఉఁ'

'వరలక్ష్మీవ్రతాని కొకటి'

'ఉఁ'

'వినాయక చవితినా డొకటి.'

'ఉఁ'

'దసరా కొకటి, దీపావళికి మరొకటి

'ఉఁ...అంతేనా?'

'అంతే'




"సినిమా చాల పెద్ద దని చెప్పారు ."

'సరీఘా గ్యాపకం తెచ్చుకో; మళ్ళీ తర్వా తేడుస్తే లాభంలేదు. ఫైనల్‌గా కేస్ సెటిల్ చేస్తాను.'

ఎందుకైనా మంచి దని మరోసారి ఆలోచించుకొంది నీలూ. సర్లే యివి కొనిచ్చేటప్పటికి తాతల్దిగొస్తార్లే— బ్రేకేద్దూ – అన్నట్టనిపించింది 'ఆలోచించా! అంతేచాలు' అంది.

'ఆఁ, అయితే ఎన్నయ్యాయి మొత్తం ఏడాదికి?.. థ్రీప్లస్ వన్;ప్లస్... మొత్తం తొమ్మిది, అవునా?'

'ఆఁ.'

'ఒక్కోటి పాతిక చొప్పుని తొమ్మిది పాతికలు – చెప్పు తొరగా — లెఖ్ఖల్లో నీ మిత్రురాలికే నా మిత్ర శేఖరుడికంటే ఏక్కు వొచ్చాయిగా –'

నీలూ గుణించుకొని చెప్పుకొంది. 'రెండొందల యిరవై అయిదు.'

'గుడ్! ఇహ అక్కడితో ఆగి, మా వాడివిషయం ఆలోచిద్దాం. వాడి నెజ్జీతం నూటిరవై. అంటే సాలుకి పధ్నాలుగొందల నలభై యన్నమాట! నీకు, ఏడాదివాటా రెండొందలపాతికిస్తే, వాడి అర్ధభాగంవాటా వాడూతీసుకోడూ?'

'తీసుకోమను.'

'థట్సాల్ రైట్. టూట్వన్టీఫైవ్ ప్లస్ టూట్వన్టీ ఫైవ్ ఈక్వల్‌టూ నాల్గొందల యాభై. అంటే నరసింహానికి మిగిలింది పధ్నాలుగొందలనలభై మైనస్ నాల్గొంద లేభై; ఈజీక్వల్‌టూ తొమ్మిదొందల తొంభై! అంటే నెలకు వాడికి సగటున మిగిలిన పైసా తొమ్మిదివందల తొంభై

డివైడెడ్ బై పన్నెండు; ఈక్వల్ టూ ఎనభై రెండూ పాయింట్ అయిదు రూపాయలు ; అవునా ?'

'ఈ సోదంతా ఎందుకు ?'

'విను మరి....నీ చీరలకూ బట్టలకూ పోగా సగటున నెలకు మిగిలింది ఎనభై రెండూ పాయింట్ అయిదు. అంటె బట్టల ఖర్చు ఆదాయంలో ముప్పై ఒకటి పాయింట్ రెండూ అయిదు పెర్సంట్. అవునా ?..కాని మన నాయకులేమన్నారో తెలుసా ?'

'వాళ్ళేమనుకుంటే యిప్పు డేవంట ? పేద్ద ప్లానింగ్ కమీషన్ అధ్యక్షుళ్ళా గుండె గాబరా పెట్టించేస్తున్నావ్ !'

'ఎప్పుడూ కూపస్థ మండూకంలా ఆ పిల్ల అంతరంగంలో పడుకుంటావ్ నీ కేంతెలుస్తుంది, మన బ్రతుకులకీ రాజకీయాలకూ పేద్ద లంకె వుందని ?'

'మహా, నువ్వే యెంతో బయట తిరిగేసి జనరల్నాలెడ్జి సంపాయించేట్టు_'

'కాక ? మా నరసింహంగాడు నందా పిక్చర్లు చూస్తా నంటే, వాడ్తో దెబ్బలాడి గోదారొడ్డుకి షికారు పోతూంటాను.'

'ఎందుకు ? షికార్ల కొచ్చే కాలేజీ అమ్మాయిల్ని చూట్టానికా ?'

'ఏదైతే నేం బయట కొస్తున్నానా లేదా ?.....విను సోది మానేసి : మన ఆదాయంలో నూటికి రెండొంతులు చొప్పున బట్టలకు ఖర్చు పెట్టినా సరే జంబూద్వీపంలో ఘోరమైన కరువేర్పడి పోతుందట ! మరినువ్వు నూటికి ముప్పై ఒకటి చొప్పున బట్టలు కొనేసు కొంటూంటే మీగతా నలభై కోట్ల జంబూ ద్వీపవాసులూ ఏమైపోవాలి ?'

'ఏమై( పోతే నాకేం ? వాళ్ళకోసం నా కోర్కెల్ని చంపుకోమంటావా

'చచ్చినట్టు చంపుకోవాలి.'

'చచ్చినా చంపుకోను.'

'అయితే చావు.' ఒక్కమాటలో తేల్చే( వెనక్కి పోవాలని వెనుదిరిగాడు.

మడతకుర్చీలో నరసింహంగాడు లేడు

'వారే ! నరసింహం ! ఎక్కడ్రా

సమాధానంగా వో బొంగురుగొంతూ వో సన్నని గొంతూ విన్పించాయి.

'వారే ! వారే ! సిగ్గులేని వెధవా అ దేవి(డ్రా ? నిన్ను వెనకేసుకొచ్చి చావు దెబ్బ ల్తిని, దాంతో పోట్లా టేసు కొంటూంటే, నువ్వు మంచమె(క్కి పోయి ఆ పిల్లతో ముచ్చట్లాడేసుకొంటు న్నావ్ ! పైగా నవ్వుతున్నావా ? ఆ( నవ్వు నవ్వు ! చూడు వెధవా ! యిహ నువ్వు చచ్చి అరచినా సాయం రా న్నీకు ఆడపిల్ల చిరునవ్వుకి ఐసైపోయి సంధి పత్రం మీద సంతకం పెట్టేసేంత చవట వనుకోలేదు.' అని మూతి మూడుచుకొని గబగబ అంతరంగంలోకి పోయి ధభీ మని తలుపు లేసుకున్నాడు నరిసిగాడు

వాణ్ణి మరింత వెక్కిరించేట్టు టేబిల్ మీది లైటుగాడు కన్నుగీటుతూ కళ్ళు మూసుకున్నాడు !



# సినిమా క్విజ్




పై రెండుబొమ్మలూ రెండు సినిమాల పేర్లు తెలియజేస్తవి...ఏమి టవి?

(జవాబులు 117 వ పేజీలో)



# యువతీలోకం



## ఆడవాళ్ళ స్వగతాలు

"అబ్బ సేవ్ రేఖా, రేఖా! ఒక్కసారి ఇలా రామ్మా. అబ్బబ్బ ఒరేయ్ ఆనంద్, నువ్వయినా ఇలా రారా బాబు. చూసేవుగా? ఎవ్వరూ సాయం చేయక పోతే నే నొక్కర్తెనే ఎలా చచ్చేది? ఛి ఛీ వెధవ ఆడబ్రతుకు. అందుకే అన్నారు. 'ఆడదై పుట్టేకంటే అడవిలో మానై పుట్టడం మేలని.' వుట్టిన దగ్గర నుండి చచ్చేటంతవరకూ బండ చాకిరే. సుఖంగా వుందామన్నా వుండనివ్వరు, వెధవ ప్రపంచం. లేచిన దగ్గరనుండి వంటా వార్పులతోనే తెల్లారిపోతుంది. ఇంక పిల్లల గోల; ఆయనగారి చికాకులు, అత్తగారు, ఆడపడచుల ఎత్తి పొడుపులు, ఛీ ఛీ సుఖ మంటూ లేదనుకో వెధవ ప్రాణానికి. ప్రొద్దుట లేచిన దగ్గిర నుండి, రాత్రి 10 గంటలైనా ఈ పనికి అడ్డూ ఆపూ వుండదు. అందుకే అంటారు 'తింటున్న కొద్దీ గరిక చిగురు పెడుతునే వుంటుంది, రోజూ తింటున్నా గాడిద ఎండిపోతుంటుంది' అని. ఆడది భరిస్తున్న కొద్దీ కష్టా లెక్కువ అవుతునే వుంటాయి. మగవారు సుఖపడుతున్న కొద్దీ ఇంకా సుఖం కావాలనే అంటారు. లోకం ఎంత మారుతున్నా కష్టాలు భరించటం మాత్రం ఆడదాని వంతే అయిపోయింది. ప్రపంచంలో ఏది మారినా కాలచక్రంలో ఇది మాత్రం మారటంలేదు'' అంటుంది ఆడ బ్రతుకు మీదే విసుక్కొంటూ, 20 ఏళ్ళ బట్టీ సంసారం సాగిస్తున్న మా లక్ష్మి అత్తయ్య.

* * *

''అవునులెండి, నేనూ మా చెల్లెలిలా హాయిగా పెద్ద చదువులు చదువుకొని ఉద్యోగం చేసుకొంటే నన్నెవరైనా ఒక్క మాట అనగలిగేవారేనా? నేను మీమీద ఆధారపడి వున్నాననేగా మీకింత చులకన? ఎంత పని చేసినా మాట మాత్రమైనా పొగిడేవా ళ్ళుండరు. ఒక్కపూట మా చెల్లెలు కూర వండితే ఇంటిల్లిపాది పొగడతారు. అది చదువుకుందనేగా దానిని పొగడటం? హాయిగా నేనూ చదువుకుంటే ఈ వెధవ పెళ్ళి చేసుకొనే

దాన్నే కాదు. ఛీదరింపులు, ఛీ వాట్లు, చికాకులు అన్నీ తప్పేవి. అయినా నా కా అదృష్ట మెక్కడిది ? ఇలా బాధ పడాలని వుంటే భగవంతుడు నన్ను చదువుకో మని ఎలా వ్రాస్తాడు నా నుదుట ? అందరికీ కలుగుతుందా, దానిలా స్వతంత్రంగా గడించుకొని కాలు మీద కాలు వేసుకొని సుఖంగా బ్రతుకగలిగే అదృష్టం ? అందరూ దానిలా సుఖం అనుభవిస్తే ఈ లోకంలో కష్టా లనుభ వించేవా ళ్లెవరు ? అందుకని నాలాంటి వాళ్ళను సృష్టిస్తాడు భగవంతుడు'' అంటుంది, హాయిగా చదువుకొని ఉద్యోగం చేయడానికి నోచుకోలేని మా పెద్ద వదిన వనజ వాళ్ళ చెల్లెలి మీద అసూయపడుతూ, తన భర్తను దెప్పుతూ.

* * *

''పాపం అక్కయ్యకు ఏమీ తెలియదు. ఈ వెధవ ఉద్యోగం చేస్తూ నే నేదో సుఖపడిపోతున్నా ననుకుంటుంది, పిచ్చి అక్కయ్య. ఈ ఉద్యోగం లోని లోటుపాట్లు తన కేం తెలుసు? వెధవ ఆఫీసు-వెళ్ళిన దగ్గరనుండి ఎవరి మీదో ఒకరిమీద ఏడుపే కదా ? మగ వాళ్ళ ఆఫీసులో వాళ్ళ పిచ్చి కూతలు, వెధవ కామెంట్లు భరించలేక మానివేసి ఆడవాళ్ళ ఆఫీసులో చేరేను. ఇక్కడ ఇంకా గోల ఎక్కువగా వుంది. ఆ మగ వాళ్ళ ఆఫీసు కాస్త మెరుగేమో దీనిమీద అని అనిపిస్తుంది. ఆఫీసుకు వెళ్ళగానే ఒకటిరెండు కామెంట్లు పాస్ చేసి నెమ్మదిగా వూరుకొనేవారు. ఇక్కడ అలాకాదు. రోజంతా ఏడుపే ! కాస్త మంచి చీర కట్టుకొని 'సూటైన' (matching) జాకెట్టు వేసుకుంటే ఆ రోజంతా తప్పు చేసినట్లు బాధపడేటంత వరకూ వూరుకోరు. చదువుకొన్నా సంస్కారం లేని చోట్ల ఇలానే వుంటుంది, ఎవరి పరిస్థితి అయినా. ఏమి చేసినా వీళ్ళకు తప్పుగానే వుంటుంది. ఒక్కొక్కసారి ఈ వెధవ ఉద్యోగానికి ఒక్క దణ్ణంపెట్టి హాయిగా పెండ్లి చేసుకుందా మనిపిస్తుంది. అక్కయ్యే నయం, హాయిగా పెండ్లి చేసుకొని సుఖంగా, గౌరవంగా బ్రతుకుతోంది. చదువుకొని ఉద్యోగం చేస్తున్న ఆడపిల్లంటే అందరికీ చులకనే. ఛీ ఛీ చదువుకొన్నా సార్థకం లేకపోతుంది. చదువుకొన్న రోజుల్లో ఉద్యోగం చెయ్యాలని ఎంత ఆశించేనో ఇప్పుడంత నిరాశకు లోనయ్యేను. చదువుకొన్నప్పుడున్న సుఖం, శాంతి, స్వేచ్ఛా ఇప్పుడు లేవు.'' అంటుంది రెండేళ్ళ బట్టీ ఉద్యోగం చేస్తూ విసుగెత్తిన మా పెద్ద వదిన చెల్లెలు, విజయ.

* * *

"ఇప్పు డీ వెధవ స్కూలు జీవితం కంటె కాలేజిలో చదువుకుంటే లైఫ్ చాలా బాగా ఎన్‌జాయ్ (enjoy) చెయ్య వచ్చట. ఈ స్కూలులో చదివినన్ని రోజులు మన పేర్లు గోడలమీద, బోర్డుల

మీదే వుంటాయి. ఈ వెధవకూత లన్నీ స్కూలు జీవితంతోనే ఆఖరట. కాలేజీలో అబ్బాయిలు అమ్మాయిల్ని ఏమీ అనరట. పైగా చాలా అభిమానంగా వాళ్ళతో మాట్లాడతారట. కాలేజీలో మేష్టర్లు, మన మేష్టర్లులాగ అల్లరి చేస్తే అమ్మాయిలను నిలుచోపెట్టరట, పైగా ఎంతో ప్రేమగా చూస్తారట. మా అన్నయ్య చెప్పేడు. ఎంచక్కా కాలేజి చదువు చాలా బావుంటుంది కదూ? మన కెప్పుడు అంతటి అదృష్టం కలుగుతుందో? కాలేజిలో చదువుకుంటే భలే భలేగా వుంటుంది కదూ?" అంటూ స్కూలు జీవితం మీద తన కున్న చికాకు కాలేజి చదువుమీద గల ఆశలు, ఆశయాలు వల్లించి వేస్తుంది, వాళ్ళ ఫ్రెండ్‌తో ఫిఫ్తు (V th) ఫారమ్ చదువుతున్న మా చెల్లెలు పద్మ, చక్రాల్లాంటి కళ్ళు గిరగిరా తిప్పుతూ.

"ఛీ ఛీ వెధవ కాలేజి చదువు. హాయిగా ఒక్క దణ్ణం పెట్టి హైస్కూలు చదువుతోనే ఆపివేస్తే ఉత్తమం. ఎందుకొచ్చిన కాలేజి చదువులు? ఇంట్లోవాళ్ల తిట్టడం కాకుండా వీధిలోవాళ్ళచేత కూడా తిట్టించుకోవడానికి కాకపోతే! ఎంత పరువుగా బ్రతుకుదామన్నా బ్రతుకనివ్వరు కదా? క్లాసుల్లోని గోల వుండనే వుంది. ఆ వున్న కొద్దిసేపైనా సుఖంగా వెయిటింగ్ రూమ్‌లో (enjoy) ఎన్‌జాయ్ చేద్దామంటే అదీలేదు. "మంద ఎక్కువైతే మదానికి చేటన్నట్లు" అంతమందీ అమ్మాయిలుంటారేమో, గ్రూప్స్ గ్రూప్స్‌గాచేరి ఎవర్నోకర్ని దెప్పుతారు. తమకంటె అందంగా వున్న వాళ్ళని చూడలేక కొందరూ, చక్కగా మంచి చీరలు కట్టుకొని (స్మార్టైన) జాకెట్లు వేసుకొన్నవారిని కొందరూ, తమకంటె ఎక్కువగా లెక్చరర్స్‌కి ఫేవర్ అయిపోతున్న వాళ్ళని చూసి అసూయ పడే వాళ్ళు కొందరు, తమకంటె ఎక్కువగా లైబ్రరీలో గడిపేవాళ్లని కొందరూ రకరకాలుగా విమర్శిస్తూ వుంటారు. ఛీ ఛీ చదువుకున్నా ఆడబుద్ధి పోనివ్వలేదు. వీళ్ళ గోల చాలక అబ్బాయిల గొడవొకటి. వెకిలివేషాలు, వెర్రికూతలూను. ఎంత మంచిగా వున్నా ఏదో ఒక లోపం కనిపెడుతూ వుంటారు, గొప్ప పరిశోధకులులాగ. లెక్చరర్స్-మంచిగా వుంటే ఎంత బాగా చూస్తారో వాళ్ళకు ఆగ్రహం వస్తే అంత చులకనగా చూస్తారు, (strikes) స్ట్రయిక్స్ గట్రా జరిగినప్పుడు చూడాలి, ఆ అమ్మాయిల పని. అబ్బాయిలు చెప్పినట్లు వినకపోతే వాళ్ళు భజనగీతాలు పాడిస్తారు; లెక్చరర్స్ చెప్పినట్లు వినకపోతే చీమను సలిపినట్లు నలుపుతారు. అమ్మాయిల పరిస్థితి అడకత్తెరలో పోకచెక్కలా వుంటుంది. వున్న నాలురోజులు హాయిగా కుషీగా గడపాలని మాత్రం లేదు, ఎప్పుడు పూర్తిచేసి వెళ్ళిపోదామా అన్న ఆత్రుత తప్పిస్తే. కాలేజికి వచ్చిన దగ్గర నుండి ఇంటికి క్షేమముగా వెళ్ళేవరకూ గండమే, ఎవరేమి అంటారో అని, ఎంత భయపడతామో అంతా జరిగి తీరుతుంది. ఈ కాలేజి చదువులు కుషీగా తిరిగే అబ్బాయిలకు, ఏమన్నా పట్టించుకోని వాళ్ళకు, ఏమైనా ఆనందాన్నిస్తాయేమో గాని నాకు ఏమీ సుఖం కనపడ

లేదు. హాయిగా హైస్కూలు జీవితమే నయ మనిపిస్తుంది. గంతు లేసుకుంటూ చదువుకొనే రోజులు రమ్మంటే వస్తాయా?

పెండ్లి చేసికుందామంటే వనజ వదిన మాటలవలన పెండ్లంటే (bore) బోర్ కొడుతుంది. సంసార మంటేనే చికాకు పుడుతుంది, లక్ష్మి అత్తయ్య మాటలు వింటే. చదువుకుంటే ఎంతో లాభ మను కొంటుంది, వనజ వదిన. ఇందులో లోటుపాట్లు ఆమెకేం తెలుసు? విజయ మాటలు విననదగ్గరనుండి, ఉద్యోగం చేయడ మంటే అసహ్య మేస్తుంది. అమాయకురాలైన పద్మ కేమి తెలుసు? ఈ కాలేజీ జీవితంలోని కష్టనిష్ఠూరాలు, అదేమిటో పెద్దగా ఊహించేసికొంటుంది; వెర్రిమొహం, దానికేమి తెలుసు ఆ హైస్కూలు జీవితంలోని ఆనందం. హాయిగా బాల్యంలోని రోజులు ఎంత ముచ్చటగా ఉండేవి. ఆనందంగా గడిచేది. ఆ అమాయక బాల్యంలోనే ఆనందం కనిపిస్తుంది. అమూల్యమైన చిన్నతనం అతి తొందరగా గడచి పోయింది. అప్పటిలా ఇప్పుడు గెంతు కొంటూ తిరిగితే చెప్పుతీసుకు తంతారు, ఇప్పుడీ పెద్దోళ్ళు. అప్పుడైతేనాఎంచక్కా ముద్దుపెట్టుకొనేవారు అక్కయ్యావాళ్ళు. అమృత మైన ఆ చిన్నతనం రోజులు ఆనందాన్ని ఒలికిస్తూ, సుధాసాగరంలో డోల లూగించేది. అప్పు డేమిమాట్లాడినా ముద్దుగా వుండేది. ఎవ రేమి చెప్పినా వింతగా ఆలకించటమే. ఇప్పుడా? ఎదుటవాళ్ళు మాట్లాడితే వాళ్ళభిమానంతో మాట్లాడుతున్నారో లేక వ్యంగ్యంగా మాట్లాడుతున్నారో ఇట్టే తెలిసిపోతుంది. ఎవరో ఒకరిద్దరు స్నేహితులు సహృదయులు వున్నా రన్నమాటేగాని, మిగతా అందరూ నోటితో మాట్లాడి నొసలుతో ఎక్కిరించేరకాలే! నాగరికతా, సంస్కారం వేషభాషలలో మనకు గోచరించినా హృదయమందు మాత్రం కనిపించటము లేదు. వీటన్నిటికి నాందీ యైన ఆ చిన్నతనమే అతిఅమూల్యం; అమృతమయం. అందులో లభించే ఆనందానుభూతులు జీవితంలో మరెక్కడా లభించవేమో నని పిస్తుంది. అంతటి మంచిరోజులు తిరిగి ఎప్పటికో? ఇంక నా జీవిత మింతే కాబోలు?" అని గాఢంగా నిట్టూర్చింది, కాలేజి స్టూడెంట్ సుధ. 

---

## సినిమాక్విజ్ జవాబులు

*1.* ప్రేమవిజయం (మొట్ట మొదటి తెలుగు సాంఘిక చిత్రం)

*2.* యోగి వేమన

# డుంబు పిక్నిక్

రచన

బొమ్మలు

బుజ్జాయి
















పిచ్చిగాడిదా!
మాస్టారూ!

మాస్టారూ! నిజంగా పులి ఆట ఆడుకున్నాం! ఈ ఆట బావుంది మాస్టారూ ఇంకా ఆడుదాం మరి
ఏడిశావ్!


తిరిగి ఇంటికి వచ్చాకా----
ఆగండి! ఓ!
ఆగండి!

ఎలా వుందిరా పిక్నిక్, డుంబుయా!
ఇంతే బావుంది, నాన్నా! మాస్టారూ, నేనూ మొసలి ఆట, పులి ఆటా ఇదే ఆడుకున్నాం!

నిజంగానా! మాస్టారూ!
ఏడిసాడు లెండి. ఇహ పిక్నిక్లు లేవు- ఉన్నా మీ డుంబుగాడు రానక్కర్లేదు!

# చక్రనేమి

## కోడూరి కౌసల్యాదేవి

*[ఇంగ్లీషు లెక్చరర్ చక్రపాణిని తిరుపతిలో మాధవి అనే విద్యార్థి పరిచయం చేసుకుని యింటికి ఆహ్వానిస్తుంది. ఆమె తండ్రి సెనెట్ సభ్యుడైన అనంతయ్యా కోరికపై మాధవికి తన తీరిక సమయాల్లో పాఠాలు చెప్పటానికి పాణి అంగీకరిస్తాడు.*

*కాలేజీలో చిన్న విషయంపై ఒక విద్యార్థికీ, చక్రపాణికీ ఘర్షణ వచ్చి విద్యార్థులు సమ్మెచేసే పరిస్థితివరకు వస్తుంది. ప్రిన్సిపాల్ పాణిని విద్యార్థులకు అపాలజీ ఇమ్మనగా పాణి నిరాకరిస్తాడు. శ్రీహరి అనే విద్యార్థి పాణి ఇంటికివచ్చి మాట్లాడుతుండగా అనంతయ్యాగారి వద్దనుండి పాణికి పిలుపు వస్తుంది. అనంతయ్యాగారు చక్రపాణితో కాలేజీ పరిస్థితులు మాట్లాడి, కాలేజీకి రెండురోజులు సెలవు పెట్టి తరువాత మామూలుగా కాలేజీకి వెళ్లమంటాడు. తరువాత విషయం తాను చూచుకుంటా నంటాడు.*

*మాధవి అన్న కేశవరావూ, తల్లీ శ్యామసుందర్ విషయమై ఘర్షణ పడతారు. ఇంటికి తిరిగివచ్చిన చక్రపాణికి చెల్లెలు పద్మ పెళ్లి విషయం తల్లితో ప్రస్తావన జరుగుతుంది.]*

ఇక చదవండి —

నిద్రపోతూన్న పాణికి సాయంత్రం అయిదు గంటలకు మెళుకువ వచ్చింది. అలాగే బద్ధకంగా పడుకొని కప్పువైపు చూస్తున్నాడు. ప్రక్క గదిలోంచి సన్నసన్నగా చెల్లెళ్ళిద్దరి గొంతుకలూ విన్పిస్తున్నాయి.

"ఇందూ, కాఫీ తే" అని కేకేశాడు.

ఎవరూ పలుకకపోగా, వింటూండగానే గొంతులు స్థాయి పెరిగి, యేదో తగవులాడుకొంటున్నట్లు విన్పించింది కొంచంసేపు విని యేమిటో చూద్దామని లేచి వెళ్ళేడు.

పద్మ యిరుగు పొరుగు పిల్లల్ని నలుగుర్నీ చేరదీసి చింతగింజ లాడుతోంది. చేతిలో పుస్తకాలతో ఇందిర ఆట మధ్య నిలబడి ఘర్షణ పడ్తోంది. పాణి వచ్చి గుమ్మంలో నిల్చోవడం యెవరూ గమనించలేదు.

''చదువు విలువ తెల్సినదానవైతే అలా మాట్లాడవు" అంటోంది ఇందిర.

"మహా తెల్సినదానవు బయల్దేరావు లెద్దూ. మిడిసిపడి పోతున్నావు,'' అంది



పద్మ. మిగిలిన పిల్లలు నవ్వుతున్నారు, ఆ అక్కా చెల్లెళ్ళ పోట్లాటకు.

"ఏమిటది పద్మా?" విసుగ్గా ప్రశ్నించాడు చక్రపాణి.

అందరూ ఒక్కసారి పులిక్కిపడి చూచారు.

ఇందిర ఖంగారుపడ్తూ "ఏం లేదన్నయ్యా, కాఫీ యిమ్మంటావా నీకు?" అంటూ అక్కడనుంచి వెళ్ళిపోయింది. పాణికూడా చెల్లెలి వెనుకే వెళ్ళి కాఫీ అందుకొంటూ, "చెప్ప వన్నమాట దేమిటో" అన్నాడు.

ఒక్కసారి చూచి, 'యిక తప్ప' దన్నట్లు "ఏంలేదన్నయ్యా. కాస్త చదువుకోవటానికి మంచి గది అదొక్కటే గదా: అక్కడే అక్కయ్య అల్లరిచేస్తూ కూర్చుంటుంది. నలుగుర్నీ చేరదీసి. ప్రశాంతంగా వుంటేనేకాని యీ 'మేథమేటికల్ థీరమ్స్' తల కెక్కవు" అంది మెల్లగా.

పాణి మాట్లాడలేదు; ఆలోచిస్తున్నాడు.

"నీకు కోపం వొస్తుం దని చెప్పలేదన్నయ్యా. స్కూలుకు రెగ్యులర్‌గా రాదని, వచ్చినా యేమీ చదవటం లేదనీ వాళ్ళ టీచరు అస్తమానూ చెప్తూంటుంది. ఎందుకు రావంటే అక్కయ్య కూ కోపమే, అమ్మకూ కోపమే. మళ్ళీ, నిన్న, యివాళాకూడా స్కూలుకు రాలేదు. అడిగితే నన్ను తిడుతోంది."

"ఊఁ. పోనీలే, దాని కసలు చదువు మీద శ్రద్ధలేదు. డబ్బు దండగ కాని ఎందుకు? మానేయ మన్నాను."

"మానెయ్యడమే?" షాక్ తిన్నట్లయింది ఇందిర. "వద్దన్నయ్యా, మాన్పించెయ్యకు" అంది బ్రతిమాల్తున్న ధోరణిలో.

"ఏం?" అన్నాడు నవ్వుతూ పాణి, "నీ కున్నంత శ్రద్ధ దానికీ వుంటే చదివించినా ప్రయోజన ముంటుంది."

"అదికా దన్నయా. చదివినా చదవకపోయినా యేదో ఓ వ్యాపకమంటూ వుంటుంది. కొంచం కాకపోతే కొంచమైనా చదువుతుంది నీ భయంవల్ల. లేకపోతే మరీ విధం చెడిపోతుం దని నా భయం."

"అంటే?" ఆశ్చర్యంగానూ, అనుమానంగానూ అడిగాడు పాణి.

కొంచెంసేపు తటపటాయించి కడకు చెప్పింది యిందిర "ప్రక్కింటి రాధా, ఇంకా ఎవరెవరో నువ్వెరుగవులే, ఓ నలుగురైదుగు రున్నారు — వాళ్ళ యిళ్ళకు తిరగడం, లేకపోతే అందరూ కలిసి యిష్టం వచ్చినట్లు సినిమాలకో, పువ్వులకోసం పండ్లకోసం తోటలమ్మట తిరగడమో, యేదోఒకటి. అమ్మ మందలించదు. నే నేమని చెప్పను, తనకంటె చిన్నదాన్ని" అంది నేల చూపులు చూస్తూ.

ఆశ్చర్యంగా వినసాగాడు పాణి. "అయితే పద్మకు యిటువంటి అలవాట్లు కూడా వున్నాయన్న మాట. నా కెప్పుడూ చెప్పలేదేం?''

ఇందిర మాట్లాడలేదు.

''మెల్లగా మాన్పించాలి మరి. సరే నువ్వెళ్ళి చదువుకో. ఆ గది ప్రత్యేకం నీ చదువుకోసం వదిలెయ్యమని నేను తర్వాత చెబుతాను, ఆ పిల్లలు వెళ్ళి పోయాక. అందాక పెరటి వసారాలో చదువుకో'' అన్నాడు.

''అలాగే," అందికాని యిందిర వెళ్ళ లేదు. స్తంభానానుకుని దొడ్లో మొక్కల వేపు చూస్తోంది.

కాస్సేపు చూచి, ''వెళ్ళవేం?" అని అడిగాడు.

"వెళ్తానులే.'' అంది ఇందిర. కాని కదలలేదు.

ఆశ్చర్యంగా చూచాడు పాణి. ఏదో అనుమానం రాగా వరండావైపు వెళ్ళి చూచేడు. అక్కడ జానకమ్మ మరో నలుగురైదుగు రమ్మలక్కలతో లోకాభి రామాయణంలో మునిగి తేల్తోంది. అర్థమైంది పాణికి. 'పాపం. యెంతో అవసరమైతేకాని ఒకరిపై ఫిర్యాదు చెయ్యదు ఇందిర' అనుకొన్నాడు.

''చూడమ్మా. నా గదిలో చదువుకో వెళ్ళి. నేనలా గెక్కడికైనా వెళ్దామను కొంటున్నాను" అని చెయ్యి పట్టుకు తీసుకువెళ్ళి ఇందిరని తన గదిలో కూర్చోబెట్టి, తాను స్నానం చేయడానికి వెళ్ళిపోయాడు.

నూతి దగ్గర స్నానం చేస్తున్నంత సేపూ చక్రపాణి అనేక ఆలోచనలతో సతమత మయ్యాడు. 'తానెంతో శ్రద్ధతో శ్రమపడి చదువుకొన్నాడు. తమ్ముడు రఘు తనకంటె తెలివైనవాడు. దైవం కూడ అనుకూలించాడు. స్కాలర్‌షిప్ దొరికింది. లేకపోతే అంతటి ఎం.బి.బి.ఎస్. చదువు తను చదివించ గలడా, అంత డబ్బు పోసి? భగవత్కృపవల్ల యీ సంవత్సరంతో చదువై పోతుంది. ఆ తర్వాత ఆరు నెలలు హౌస్ సర్జన్‌కూడ చేసేస్తే ఎక్కడో మంచి వుద్యోగం దొరుకుతుంది. ఇద్దరం ఒకరి కొకరం తోడైతే యింకేలోటూ వుండదు'. 'తమ్ముడు డాక్టరౌతున్నాడు. తనకంటె గొప్పవాణ్ణి చేసేశా'ననే వూహ వచ్చేసరికి మనస్సు ఆనందంతో వుప్పొంగిపోయింది. 'మగవాళ్ళిద్దరం ఫర్వాలేదు; ఒకరు వ్రేలెత్తి చూపలేరు. ఆడపిల్లల్లో ఇందిర విషయంలో బెంగ లేదు; గుణవంతురాలు, అన్నీ వున్నత మైన భావాలు, దానికితోడు మంచి రూపం. ఆమాటకొస్తే రూపం విషయంలో ఎవరు మాత్రం తక్కువ యీ యింట్లో? అందరిదీ చెప్పుకోదగిన అందమే. కాని విచారమల్లా ఒక్క పద్మ విషయంలోనే. వయసుకు తగ్గ ఆలోచనా, విచక్షణా

లేదు. కాస్త బుద్ధి చెప్దా మన్నా అమ్మ వీలుపడనివ్వదు.'

ఆ ఆలోచనలు మాధవిని గుర్తు తెప్పించాయి. 'నిజానికి పద్మా, మాధవీ ఒకేరకం పిల్లలు. బాధ్యత, బరువు తెలియని పసిపిల్లల తంతు' అనుకొంటూ 'ఒక్కసారి వాళ్ళింటికి వెళ్ళాలి' అనుకొన్నాడు. స్నానం ముగించి బట్టలు ధరించి బయల్దేరాడు.

అనంతయ్యగారింటిముందు చక్రపాణి రిక్షా దిగుతుండగా కారు వచ్చి ప్రక్కనే ఆగింది. పాణి తల అటు త్రిప్పగానే, కేశవరావు 'విష్' చేస్తూ కారు దిగాడు.

"అయ్యో, రిక్షామీద వచ్చే రేమిటండీ? ఇంకా యిప్పుడే కారు పంపించుదా మనుకుంటున్నాను," అన్నాడు.

"ఎందుకండీ? రోజూ కార్లు?" అని పాణి పర్సు తీస్తుండగానే, కేశవరావు రిక్షాకు డబ్బు లిచ్చేశాడు.

"అరే, అదేమిటండీ. ఇలా గైతే నేను రావడమే మానుకోవాల్సొంటుంది." అన్నాడు పాణి.

"ఏం ఫర్వాలేదుకాని, రండి లోపలికెళ్దాం. మీ రనుకొంటే మేం మానుకోనివ్వద్దూ?" నవ్వుతూ పాణి భుజంమీద చెయ్యివేసి లోనికి దారి తీశాడు.

ఆవరణలో ఫౌంటెన్ దగ్గర పచ్చికమీద మోచేతిపై తలానించి పడుకొంది మాధవి. ఆ ప్రక్కనే కూర్చుని సరోజిని సన్నజాజుల మాల కడ్తోంది. పాణీ కేశవ్ లిద్దర్నీ చూడగానే, లేచి ఎదురు వచ్చారు. నమస్కారా లనంతరం "లీవ్ గ్రాంట్ చేశారా మీ కీ రెండు రోజులూ?" అనడిగాడు కేశవరావు.

"ముందు యివ్వ నన్నాడు. 'హై టెంపరేచర్' అంటే తప్పనిసరిగా యిచ్చాడు. చిన్న బద్ధం ఆడవలసొచ్చింది" అన్నాడు చక్రపాణి నవ్వుతూ.

"ఆఁ. తెల్లారి లేచి ఎన్నబద్ధా లాడనిది యీ మానవ శరీరానికి రోజులు గడుస్తాయి మాష్టారూ? పూర్తిగా సత్యం, అహింస అమలులో పెట్టాలంటే తప్పనిసరిగా కొల్లాయిగుడ్డ కట్టవలసిందే'' అన్నాడు కేశవరావు.

మాధవి విరగబడి నవ్వింది ఆ మాటలకు. ''అయితే ఎప్పుడో ఒకప్పుడు మ మాష్టా రంతపనీ చేస్తా రన్న మాట దేవుడుమాష్టారు కదా మరి!" అఁ! మళ్ళీ నవ్వింది.

"అయితే నా పేరు దేవుడుమేష్టా రన్నమాట,మీ పరిభాషలో!" నవ్వుతూనే అడిగాడు చక్రపాణి.

'అవు నన్నట్టు తలూపుతూ ఇంకా ఇంకా నవ్వసాగింది.

నవ్వొద్దన్నట్టుగా సరోజిని మోచేత్తో పొడిచింది ఆడబిడ్డని! అయినా మాధవి నవ్వు మానలేదు. కేశవరావు కళ్ళెర్ర

జేయడంతో నవ్వాపేసి మూతి ముడిచింది. చక్రపాణి అందరి ముఖాలను మార్చి మార్చి చూసి నవ్వేసి మళ్ళీ వాతావరణాన్ని తేలిక పరచాడు.

"షోస్లెండి కాని, అంత గౌరవానికి నేను తగను. ఉప్పూ పులుసూ తినే

కరుణాకరరావట — ప్రొద్దున్న యిక్కడకు వచ్చాడు, మాధవిని కల్సుకోవాలంటూ. అదేమిటో నాతోనే మాట్లాడమన్నాను. నిన్న క్లాసులో మీచేత చీవాట్లు తిన్నవాళ్ళల్లో మాధవికూడ ఒకర్తట. అంచేత ఈ 'రివల్యూషన్ కమిటీ'లో



సామాన్య మానవ మాత్రుడ్ని; గాంధీజీని కాలేను."

"ఈ విశేషం విన్నారా మాస్టారూ? మీ పై యెదురుతిరిగిన స్టూడెంట్

ఆవిడకూడ ఒక మెంబరు కావాలట. సమ్మెనాయకునికి సాయం చేయాలట" అంటూ నవ్వేశాడు కేశవరావు.

పాణి వింటున్నాడు; మాట్లాడలేదు.

తిరిగి కేశవరావే చెప్పాడు. "ఈ మాత్రం ఘనకార్యానికి మాధవితో మాట లాడ నవసరంలేదు. లెక్చరర్ నెదిరించి, బాగుపడలే వని నాలుగు చీవాట్లు పెట్టి పంపేశాను."

నిట్టూర్చాడు పాణి. "ఒక్క కరుణా కరాన్నని ప్రయోజన మేమిటి కేశవ రావ్‌గారూ? విద్యా సంస్థలలా వున్నాయి. అధికారులలో మెతకతనాలు కొన్ని అనర్థాలకు మూలం. ఒకప్రక్కన కుల మత తత్వాలు మాసిపోవాలంటారు. కాని, చూడండి ; మనం ఒక స్కూలులో చేరాలంటే, ఒక వుద్యోగానికి ధరఖాస్తు పెట్టాలంటే తప్పనిసరిగా అందులో కులం తెలియజేసుకోవాలి. దీన్నేమనాలి? దీనికితోడు మిడిమిడి జ్ఞానాల ప్రభావా లెక్కువయ్యాయి. ఎ.బి.సీ.డీ లు రాని వాడుకూడా ఇంగ్లీషు భాషను విమ ర్శించడం, బిచ్చగాడుకూడ రాజకీయాలు మాట్లాడడం. ప్రతి విషయాన్నీ విప్ల వాత్మక భావంతో చూడటం అలవడింది. అధికారి నౌఖర్ని మందలించినా, అధ్యాప కుడు విద్యార్థిని శిక్షించినా కారణ మేమి టని నిలదీయడం, సమ్మెలూ సత్యా గ్రహాలతో మారణాస్త్రాలను మించి భయపెట్టడం. ఈ స్థితిలో యిక మనం సాధించగల ప్రగతి యేమిటి ?"

శ్రోతలు ముగ్గురూకూడా విస్ఫారిత నేత్రాలతో వింటున్నారు, పాణి మాటలను.

"మీరు ప్రతిదీ చాలా నిశితంగా విమర్శిస్తారు మాష్టారూ!" అంది సరోజిని కళ్ళలో అభిమానం తొణికిస లాడ్తూండగా.

కేశవరావు అడిగాడు. "అయితే అప్పుడప్పుడిలాటి ఆలోచనలు నాకూ వస్తూంటాయి మాష్టారూ. ఇపుడు కుల మతాలు ధరఖాస్తులలో వుండడం గూర్చి మాట్లాడారే ? దీనికి పరిష్కార మేమి టంటారు మాష్టారూ ? ఊరికే అడుగు తున్నాను. మన చేతుల్లో యేమీ లేదను కోండి."

"ఏముంది ? పసిబిడ్డలోచీకటిని చూసి జడిసే నీరస గుణం వుందనుకోండి. చూచీ చూడనట్టు వొదిలేస్తే కొంత కాలాని కా భయం అదే పోతుంది. కాని, 'బాబూ, అది చీకటి, అయినా, భయ పడకు' అని మనం పదేపదే హెచ్చ రించడంతో అతని భయం పోదు సరి కదా, నిద్రాణమైవున్న ఆ నీరసం మేల్కొని వెర్రితలలు వేస్తుంది. అలాగే యిదీని. ఈ కులం, మతం అనేది పెద్దవర్గాలలో, పెద్దతలకాయ లలో మెదలడం మానేస్తే క్రమేణా ఆ నిర్లక్ష్యమే చిన్నవారికీ సంక్రమించి మనం కోరిన అభ్యుదయం లభిస్తుంది. వేదికలపై కుల మత నిర్మూలనగురించి వుపన్యాసాలిచ్చే మహానుభావుడు తన బిడ్డల నెవరినైనా అన్య కులాలలో యిచ్చి వివాహం చేస్తున్నాడా ? ఈ

చిలుక పలుకులు కేవలం వేదికలకె అంకితం: గాలిలోనే యిగిరిపోతాయి. ఓప్రక్క స్త్రీ స్వాతంత్ర్యం, స్త్రీ విద్య గురించి లెక్చర్లు యిస్తూ మరో ప్రక్క కూతురికి బాల్యవివాహం చేసేవారూ, వరకట్న పిశాచాన్ని దూషిస్తూ కొడుక్కి వేలూ లక్షలూ కట్నం పుచ్చుకొనేవారూ వున్నంతకాలం యీ సంఘానికి మార్పు లేదు. ఈ దేశానికి అభ్యుదయం లేదు."

"నిజమే, కాని యీ మార్పు హృదయాలకు సంబంధించినది. కొన్ని వందల యేండ్లు పట్టవచ్చు!''

నవ్వాడు పాణి. "వందలా? వేలు-వేల యేళ్ళకైనా వస్తే వందలకు వచ్చినట్టు సంతోషించవచ్చు.''

కొద్దిసేపు ఎవ్వరూ మాట్లాడలేదు. మాధవి 'మోతీ'ని దగ్గరకు పిల్చుకుని దువ్వసాగింది.

''అయితే, నిన్న నేను తిట్టినందుకు నీ కేమీ కోపం రాలేదా మాధవీ?" అనడిగాడు నవ్వుతూ.

ఆశ్చర్యంగా చూచింది మాధవి. "కోపమా? ఎందుకండీ? అయినా మీ రేమన్నారు? నే నప్పుడే మర్చిపోయాను, నాకు జ్ఞాపకం లేదు.''

"బాగానేవుంది. అయితే యిలా పార్కు షికార్లూ, కుక్కపిల్లలతో ఆడుకోవడమేనా? చదివే దేమైనా వుందా? నీ చదువు పరిస్థితి అస లెలా వుంటుందో చూద్దామనే వచ్చా నివాళ.''

కేశవరావు ముఖం విప్పారింది. "మెనీ మెనీ థ్యాంక్సు మేష్టారూ; లే మాధవీ. మాష్టార్ని నీ రీడింగ్ రూమ్ లోనికి తీసుకెళ్ళు.''

ఇబ్బందిగా పెట్టింది మాధవి ముఖం.

"ఏం ఒద్దా? పోనీలే. నీ కింటరెస్టుంటేనే. మరైతే నే వెళ్తాను," అంటూ లేవబోయాడు చక్రపాణి.

కేశవరావు ముఖం చిన్నబోయింది. "మీరు దాని మాటలు లెఖ్ఖ జేసుకొంటే యెలా మాష్టారూ? కేవలం చిన్నపిల్లల తంతు;'' అంటూండగానే మాధవి. ''నేను వద్దనలేదు. ఇక్కడే చెప్పించుకుంటాను. రీడింగ్ రూమ్‌లో చిరాకు నాకు, సాయంత్రం వేళ్ళల్లో'' అని "ఒరేయ్ గోవిందూ, నా గదిలో బల్లమీద పుస్తకాలూ, పెన్నూ యిలా తీస్కురా'' అని నౌఖరుకు పురమాయించింది.

"బాగుంది. పుస్తకాలు తెచ్చుకోవడానిక్కూడా బద్ధకమే? ఇక్కడే చదుకుంటుందట. చెప్తారా మాష్టారూ?'' అన్నాడు కేశవరావు.

"ఓ. నే నెక్కడైనా చెప్తాను. ఎటొచ్చీ యీవిడ కుక్కపిల్లల వెంట, సీతాకోకచిలుకల వెంట పరుగులెట్టకుండా వుండగలదా అని?"

పకపకా నవ్వేశాడు కేశవరావు. ''పోనీ, అదీ చూద్దాం. ఈరోజు కిలా కానివ్వండి. మరి నేను వస్తానండీ. పనుంది. నాన్నగారు లేరుకదూ — ఒక

సారి గొడౌన్స్‌దగ్గర కెళ్ళాలి. పగ లంతా ఆఫీసులోనే సరిపోయింది.''

"అలాగే, వెళ్ళిరండి" నమస్కరించాడు పాణి.

సరోజిని రెండు కప్పులతో కాఫీ తీసుకొచ్చింది. ఒకటి పాణికిచ్చి, మరోటి తాను తీసుకున్నాడు కేశవరావు.

గుమస్తాను పిల్చి, ''నేను గొడౌన్సు దగ్గరకు వెళ్తున్నాను. వీలైతే కారు వెంటనే పంపించేస్తాను. లేకపోతే టాక్సీలో పంపించండి మాష్టార్నింటికి. అమ్మాయ్, విన్నావు కదూ? బాగా చదువుకో" అంటూ వెళ్ళిపోయాడు కేశవరావు.

"అయితే ఒక్క యింగ్లీషే కాని, యింకేసబ్జక్టూ డౌటు లేదా నీకు?" అన్నాడు పాణి మాధవిని.

"ఆమాట కొస్తే యింగ్లీషూ డౌటు లేదు నాకు" నిర్లక్ష్యంగా జవాబిచ్చింది మాధవి. "ఎటొచ్చీ మిగిలిన సబ్జక్ట్సన్నీ క్లాస్‌లో వింటూండగానే అర్థమైపోతాయి. ఇంగ్లీషు మాత్రం కొంచం మళ్ళీ మళ్ళీ రిఫర్ చెయ్యాలి. ఇంతంత లావు డ్రామాలు పెడ్తే ఎవడు చదవగలడు మరీ?"

నవ్వొచ్చింది పాణికి "మరీ చదివే వాళ్ళంతానూ? చదువు దగ్గర బద్ధకం, నిరసనా పనికిరాదు. కొంచం శ్రమపడాలి. సరే, ముందే పాఠం తీస్తావ్?"

''యేమో అన్నీ ఒకలాగే వున్నాయి నా కంటికి" అంది పేజీలు అటూ యిటూ త్రిప్పుతూ.

ఉసూరు మంది చక్రపాణి ప్రాణం. ''మరీ యింత శతమొండీ, బండా గనుకే, ఆ అన్నా, తండ్రీ అంత గోల పెడ్తున్నారు. మరీ యింత పెంకెఘట మని తెలుస్తే ఒప్పుకోక పోదునే? ఎలా చెప్పేదీ? చంటిపిల్లలైతే రెండు వాక్కెట్లతో లాలించో, నాలుగు దెబ్బలతో బెదరించో చెప్పొచ్చు. ఇంట్లో పద్మా, ఇక్కడ ఈ గడుగ్గాయీ సరిపోయారు నా ప్రాణానికి" అనుకున్నాడు. మాష్టారు మాట్లాడకపోవడమే బాగుందేమో మాధవికి, తీరిగ్గా క్రోటన్ చెట్టు ఆకులు త్రుంచుతూ కూర్చుంది.

కాస్సేపు ఆలోచించి చక్రపాణి, "చూడు మాధవీ. నేను కొన్ని ప్రశ్నలు ఇంగ్లీషులో అడుగుతాను నిన్ను. ఇంగ్లీషు లోనే నువ్వు సమాధానం చెప్పాలి. నీ 'యింగ్లీషు నాలెడ్జ్' యెంతో నేను తెల్సుకోవాలి" అన్నాడు.

"ఓయస్" అంది మాధవి అదేవిధమైన నిర్లక్ష్యంతో.

కాలేజీ విషయాలు, యితర సామాన్య విషయాలు అనేకం గూర్చి ప్రశ్నించేడు పాణి. అన్నిటికీ తడుముకోకుండా చక్కటి యింగ్లీషులో తేలిగ్గా జవాబులు చెప్పేసింది మాధవి. పాణి చాలా ఆశ్చర్యపోయాడు.

"మెచ్చుకొంటే నీకెక్కడ గర్వము చేస్తుందోనని భయపడుతున్నాను మాధవీ. ఇంత చక్కటి యింగ్లీఘు నీకెలా పట్టుబడింది ?" అనడిగాడు పాణి.

"ఏమండోయ్, నేనంత మొద్దునని అంచనా వేసుకున్నారా మీరు ? నా నాలుగోయేడు నుంచి పన్నెండో సంవత్సరం వరకూ మా నాన్న ఒక ఆంగ్లో యిండియన్ లేడీచేత యింగ్లీషు చెప్పించారు తెలుసా ?"

"అదేం ? తలచుకొంటే మీ నాన్నగారు కాన్వెంటుకే పంపగలరే ?"

"అవు ననుకోండి. కాని నన్నొదిలి



పెట్టి వుండగలరా ? ఇప్పుడే వుండలేరు. ఇక చిన్నతనంలో యెలా వదుల్తారు ?"

"ఓహ్" అన్నాడు చిన్నగా నవ్వుతూ. "అయితే నీకు మొన్న హాఫ్ ఇయర్లీ పరీక్షలలో మార్కు లెలా వచ్చాయి ?"

"అన్నీకూడ ముప్ఫైఎనిమిదీ — నలభైఅయిదూ మధ్యన."

"ఇంగ్లీషు ?"

"నలభై నాలుగు."

"ఇంత తెలివుండీ, యివీ ఒక మార్కు లేనా మరి ? ఫస్ట్‌క్లాస్ మార్కు లెందుకు రావు ?"

"అయ్యబాబోయ్. అంత ఓపి కెవరి కండీ ? నిత్యం పుస్తకాలతోనే గడప మంటారా ? ఇక వేరే జీవితమే లేదూ ? పరీక్షలముందు పది రోజులు తప్ప రోజూ నేను పుస్తకాలతోనే బ్రతుక లేను."

"పోనీ యిప్పుడు ? వెనుక నేనుండి చదివిస్తే చదవగలవా ? అదీ లేదా ?"

కొంచం సేపాలోచించి, "చదువుతాను. లేకపోతే నాన్నగారు బాధ పడ్తారు" అంది.

"పోనీ, నాన్నగారి మీదైనా ఆ మాత్రం భక్తి వుంది. అయితే నేను మళ్ళీ వచ్చేప్పటికి యేదో ఒక పాఠం - నీ కిష్టమైనదీ — క్లాసులో అయినదీ బాగా చదువు. మొక్కుబడిగా కాదు నీకు తెలియని పదాలను అండర్‌లైన్ చేస్తూ బాగా నాలుగైదుసార్లు చదువు, డిక్షనరీ దగ్గరుంచుకొని. ఆ తర్వాత నేను వచ్చి చెప్తాను."

తలూపింది మాధవి.

"నే వెళ్తాను." అంటూ పాణి లేచాడు.

"బాబోయ్, కూర్చోండి. అన్నయ్య ఆజ్ఞ విన్నారు కదూ ! టాక్సీ వచ్చాక అందులో వెళ్ళదుగాని" అంటూ చప్పట్లు కొట్టి నౌఖర్ని పిలిచింది.

చక్రపాణి టాక్సీ ఎక్కుతూండగా, "రేపూ యీ టైమ్‌కే వస్తారా ?" అంది.

"యేమో. తీరికనిబట్టి. రెగ్యులర్‌గా రావటానికి నాకు వీలుపడదు."

"నాన్నగా రెపుడు వస్తారు ?"

"నాకు తెలియదండీ."

"సరే" అంటూ కా రెక్కాడు.

"బహుశః రేపు రాత్రికి వస్తా రను కుంటా నండి" అన్నాడు గుమస్తా.

"థాంక్స్, సెలవు." అంటూండగా కారు సాగిపోయింది.

## 9

మర్నాడు మధ్యాహ్నం శ్రీహరీ, వెంకటేశమూ వచ్చి కొంచం సేపు కూర్చుని వెళ్ళిపోయారు. యేదో మామూలు యిష్టాగోష్టి తప్ప మిగిలిన విషయాలు వాళ్ళెత్తలేదు, పాణి చెప్ప లేదు. ఆ సాయంత్రం మళ్ళీ 'అనంతయ్యగా రింటికి వెళ్దామా ?' అనుకొన్నాడు. కాని మళ్ళీ ఎందుకో

'వ'ద్దన్పించింది. తెల్లవారగానే తన వుద్యోగం వుండదమో – వూడదమో యేదో ఒకటి జరుగుతుంది. అది తన నిర్ణయంపైనే ఆధారపడి వుంటుంది. కాని, దానికి అనంతయ్యగారు చేయబో తున్న సాయం యేమిటో, యే రూపం లోనిదో తెలియదు. పైకి ఎంత బింకంగా వున్నా, లోలోపల అతడికి చాలా గాభ రాగా వుంది. సాయంత్రం అయిదు గంటల వేళ "అలా చల్లగాలికి తిరిగి వస్తా" నంటూ యింట్లో చెప్పి బయల్దేరాడు.

కొంతసేపు నది ఒడ్డున తిరిగాడు. మనస్సు కొంత తేరుకున్నా ఉల్లాసంగా లేదు. అరుణరాగంతో సంధ్యా కాంతను చుట్టివేస్తూ పశ్చిమాద్రిలో గ్రుంకుతూన్న భానుడిని చూస్తూ కాస్సేపు ప్రపంచాన్ని మరచిపోయాడు. ఎవరిదో చెయ్యి భుజంపై పడగా వులిక్కిపడి చూచాడు. హిస్టరీ లెక్చరర్ ముకుందరావూ, ఎకన మిక్స్ లెక్చరర్ ఆనందవర్మా నవ్వుతూ నిల్చున్నారు.

"ఏమయ్యా ఒంటరిగా కూర్చు న్నావ్?" అన్నాడు నవ్వుతూ ముకుందం.

లేని నవ్వు తెచ్చిపెట్టుకున్నాడు చక్ర పాణి "క్రొత్తగా ఒంటరితన మేముంది? రండి కూర్చోండి."

భావగర్భితంగా నవ్వాడు ముకుందం. "ఊఁ జంట లభించే రోజులు దగ్గర పడ్తున్నాయిలె. మన ట్యూషన్సెలా సాగుతున్నాయి?" అన్నాడు కనుబొమ లెగరేస్తూ.

"ట్యూషన్సేమిటి? నేనా వృత్తి పెట్టుకోలేదే?"

"పెట్టుకోపోయినా వచ్చి మీద పడ్తుంటాయిలే. నా కన్నీ తెల్సు. మాధవీకుమారికి నువ్వు ట్యూషన్ చెప్పడంలేదూ?"

"ఏ సి.ఐ.డీ. బ్రాంచికో పోకూడదూ నువ్వు? బాగా పనికొస్తావు." కసిగా అన్నాడు పాణి. "ఇతరుల విషయాలలో అంత శ్రద్ధేమిటి నీకు? అయినా నేను మాధవికి ట్యూషన్ చెప్తున్నట్టెవరు చెప్పారు?"

"పోనీ యేమిటో ఆ రాచకార్యం చెప్పకూడదూ? రోజూ తప్పకుండా అనంతయ్యగారింట్లో హాజరు వేయించు కొంటున్నా వెందుకు?"

"ఎందుకో తప్పకుండా చెప్పివుండే వాడిని నువ్వు సరసంగా అడిగివుంటే. కాని నీలాటివాడికి చెప్పాల్సిన అవసరం లేదు. చూడు ముకుందం, నిష్కర్షగా చెప్పేస్తున్నాను. ఇలాగైతే మన స్నేహం అట్టేకాలం నిలువదు."

ఇక ముదురుతోందని గ్రహించిన ముకుందం కొంచం తగ్గాడు.

"పోనీ నా కెందుకుగాని – మేం సిని మాకు పోతున్నాం, వస్తావా?"

ముందు రానన్నాడు. మళ్ళీ "సరే, పద. వెళ్దా మన్నా కంపెనీ దొరకొద్దూ?" అంటూ లేచి అనుసరించాడు.

దారిలో ఆనందం అడిగాడు ''ఏం నిశ్చయించుకొన్నావు? రేపు 'అపాలజీ' యిస్తావా?''

హేళనగా నవ్వాడు పాణి. "నువ్వైతే యేం చేసేవాడివి? ఇచ్చేద్దువా?'' అని ఎదురుప్రశ్న వేశాడు పాణి.

ముకుందం చెప్పాడు సమాధానం. "మే మసలు అటువంటి పరిస్థితులు రానివ్వమోయ్. యేదో పాఠం చెప్పేసి, కోర్సు అయిం దనిపించడమే మనవంతు గాని ఎవడి కర్థమైందో లేదో తెల్సుకోవడానికి మనకేం పట్టింది? వాళ్ళేం చంటి పిల్లలు కాదుగా; తిట్టీ, కొట్టీ చదివించడానికి? చదువు కావలసినవాడు శ్రద్ధగా వింటాడు, లేనివాడు పోతాడు. మనకేం?"

''మరి మన బాధ్యత? మన విధి బాగా నిర్వహిస్తున్నామనే తృప్తీ, మన శిష్యులు అభివృద్ధిలోకి వస్తున్నారనే సంతోషమూ యెలా వస్తాయి?''

నవ్వాడు ముకుందం. "వెఱ్ఱివాడా! ఏమి టందువల్ల నీ కొరిగేది? అందువల్ల నీకు లభించిన ఫలితం చూస్తున్నావా? ఇటువంటి ఆదర్శాలు తీరేది పూర్వకాలపు ఋష్యాశ్రమాలలో — ఈ కలియుగంలో కాదు. ఈనాడు ఆనాటి గురుశిష్య బాంధవ్యమూ లేదు; గురు దక్షిణలూ లేవు. దేహశుద్ధి కాకపోతే అదే పదివేలు.''

చక్రపాణి మాట్లాడలేదు.

తిరిగి ముకుందం పాణి భుజం తడ్తూ చెప్పాడు,

"నువ్వింకా చిన్నవాడివి. లోకం పోకడ అర్థం చేసుకోలేక పోతున్నావు. సినిమా హీరోల ఆదర్శాలు చూచీ, చచ్చిన వీరుల ఆదర్శాలు వినీ మాత్రమే సంతోషించగలరు లోకులు. అటువంటి వాడిని తమ మధ్య సజీవంగా చూచి మాత్రం సహించలేరు. తెల్సుకో.''

థియేటర్ సమీపించేసరికే పిక్చర్ మొదలుపెట్టేశారు. త్వరత్వరగా సర్దుకు్కూర్చుని ఆట చూస్తున్నారు. కొంతసేపయ్యాక పాణికి యేవో పరిచిత కంఠస్వరాలూ, నవ్వులూ విన్పించాయి వెనుకసీట్లోంచి. వెనుకకు తిరిగి చూద్దామనుకొని మళ్ళీ ఆ ప్రయత్నం నుంచి విరమించుకొన్నాడు. నిజానికి సినిమా చాలా బాగుంది. కథాసంవిధానం బాగుంది; నటీనటుల పాత్ర పోషణ మనోరంజకంగా వుంది. మరి వాళ్ళావిధంగా ఎందుకు అల్లరి చేస్తున్నారో బోధపడలేదు పాణికి. 'అసలు వాళ్ళు సినిమా చూడ్డానికే వచ్చారా?' అన్పించింది పాణికి. ముకుందం కూడా అదే అభిప్రాయం వెలిబుచ్చాడు. కడకు ఇంటర్వెల్‌లో పాణీ, ముకుందం ఒక్కసారే వెనుదిరిగి చూచారు; కరుణాకరం! అతడితోపాటు

కళాశాల ప్రముఖ రాజకీయ వేత్తలు, సమ్మె నాయకులూ అయిన మరో యిద్దరు స్టూడేంట్సును ప్రక్కన కూర్చుండబెట్టుకొని దర్జాగా సిగరెట్ పీలుస్తూ అందర్నీ పరికిస్తున్నాడు.

పాణీ, ముకుందరావుల్ని అపుడే చూచినట్టుగా "నమస్కారం, గురూజీ" అన్నాడు.

పాణి చటుక్కున ముఖం త్రిప్పేసుకున్నాడు. ముకుందం నవ్వి, యిటుతిరిగి "ఎంత నిర్లక్ష్యం ?" అన్నాడు పాణితో. వెనుక హేళనగా నవ్వులు, గుసగుసలు విన్పించాయి. పాణి మరి తల త్రిప్ప లేదు. పిక్చర్ ముగిసే సమయానికి కరుణాకరం బృందం జాడలేదు.

పాణి యిల్లుజేరి దుస్తులు మార్చి భోజనానికి కూర్చోబోతూండగా ఎవరో వీధితలుపు తట్టిన శబ్దం విని లేచి వెళ్ళాడు. పద్దెనిమిదీ – యిరవై యేళ్ళ కుర్రాడొకడు నిల్చుని వున్నాడు. "అనంతయ్యగారు వూరినుంచి వచ్చారు మిమ్మల్నొకసారి రమ్మన్నారు." అన్నాడు.

ఆశ్చర్యంగా చూచాడు పాణి. 'అనంతయ్యగారు నాల్గు రోజుల నుంచీ తన కోసం ఎప్పుడైనా సరే కారును పంపిస్తున్నారు. నిన్న సాయంత్రం రిక్షా మీద వెళ్ళినందుకే కేశవరావు చాలా నొచ్చుకున్నాడు. అటువంటి దీ రోజు యిలా గాలికబురు పంపించా రేమిటి ?' కొంచం సేపు ఆలోచించి,

"నువ్వెవరవ్ ?" అనడిగాడు.

ఆ కుర్రాడు కొంచం తడబడి "ఆఫీస్ ప్యూన్‌ను" అన్నాడు.

"సరే. నువ్వెళ్ళు. నేను తర్వాత వస్తాను."



"ఇప్పుడే రమ్మన్నారండి. ఆయన ఎదురుచూస్తున్నారు'' అన్నాడు బెదుర్తూ.

"సరే, అయితే, ఒక క్షణం నిల్చో. ఇప్పుడే వచ్చేస్తాను."

బయిల్దరబోతాం బ అదములబాబూ, భోజనందగ్గర్నుంచి లేచిపోయావ్ ? చేసి వెళ్ళకూడదూ ?" అంది తల్లి.

"భోజనాని కేంలేమ్మా ? పెద్ద మనుష్యులతో వ్యవహారం. జాప్యం చేస్తే బాగుండదు.'' అంటూ వెళ్ళిపోయాడు.



# 10

అప్పుడే సూర్యోదయ మైంది. పక్షుల కలకలారావాలతో, లేగదూడల అంబా రావాలతో, పిల్లతెమ్మెరల మంద గమనాలతో ప్రకృతి చైతన్యవంత మైంది. అప్పుడే నౌకర్లు యజమానుల గృహాలు చేరుకుంటున్నారు.

నిద్రలేచి పూల మొక్కల మధ్య పచార్లుచేస్తూ తోటమాలికి పనులు పురమాయిస్తున్న కేశవరావు దృష్టి కీచుమంటూ తెరచుకొన్న వీధిగేటువైపు తిరిగింది. రుక్మిణీ, మరొకమ్మాయీ తనవైపే వస్తున్నారు. తెల్లవార్లూ నిద్రపోని అలసత్వంతో వాడిపోయిన వదనాలూ, భయాందోళనలు వ్యక్తం చేస్తున్న నేత్రాలూ చూచి భయపడ్డాడు కేశవరావు.



అసలు ఎక్కడైనా వెళ్లేటప్పుడు వేసుకొనే దుస్తులలో లేరు. నిల్చున్న పాటున వచ్చిన ట్లున్నారు.

"ఏమిటి రుక్మిణీ, ప్రొద్దున్నే వచ్చావు? మాధవి యింకా లేవలేధూ" అన్నాడు.

"మాధవికోసం కా దన్నయ్యా. నీ కోసమే" రుక్మిణికి కేశవరావు దగ్గర మాధవి కున్నంత చనువూ వుంది.

"నాకోసమే? ఏమి టలా గున్నావు? ఆ అమ్మా యెవరు?"

రుక్మిణి చుట్టుప ట్లంతా ఒక్కసారి చూచింద. ఆ నేత్రాలలో మరింత భయం ద్యోతక మైంది. "ఈ అమ్మాయి చక్ర పాణిగారి చెల్లెలు ఇందిర. రాత్రి ఆయన మీ యింటి కొచ్చాక తిరిగి యింటికి రా లేదు. ఇక్కడే వుండిపోయారా?"

"రాత్రి మా యింటి కొచ్చారా?" ఆశ్చర్యంగా కనుబొమలు ముడివేశాడు, కేశవరావు.

"ఏమిటిందిరా?" అంది రుక్మిణి ఇందిరవేపు తిరిగి.

ఇందిర ముఖం ఇక యేడ్చేయటానికి సిద్ధంగా వున్నట్టుంది. "రాత్రి పదిన్నరకు అనంతయ్యగారు వూరినిం చొచ్చారు. అర్జంటుగా మాట్లాడా లని కబురంపితే నిల్చున్నపాటున వెళ్ళిపోయాడు, భోజన మైనా చేయకుండా."

"వ్హాట్!" అరిచాడు కేశవరావు. "నాన్నగా రింకా రాందే వూరినుంచి! ఇవాళ మెయిలులో వస్తారు. ఇంతకూ ఆ కబురు తెచ్చిన దెవరు?"

"మీ ఆఫీసు ప్యూన్."

"మా ఆఫీసు ప్యూనా? వాడురాత్రంతా యిక్కడే వున్నాడే? నువ్వా మనిషిని చూచావా ఇందిరా?"

"ఓ ఇరవైయేళ్ళుంటా యేమో. నల్లగా వున్నాడు. షర్టూ, పైజమా వేసు కున్నాడు. కేశవరావు కళ్ళు అటూ యిటూ త్వరగా చలించాయి. "ఏమి టిదంతా? ఆఫీసుప్యూనేకాదు. ఆస లింట్లో నౌక ర్లెవరూ కూడా అలాటి కుఱ్ఱాళ్ళు లేరే? అయినా నాన్నగా రూర్నించి రాందే? యేదో మోసం జరిగిన ట్టుంది." అంటూండగానే ఇందిర బావురు మంది, "అన్నయ్యా" అంటూ, కేశవరావు ఖంగారు పడిపోయాడు. ఏం మాట్లా డాలో, ఎలా ఓదార్చాలో తెలియలేదు.

"వూరుకో ఇందిరా. పర్వాలేదు. ఏదో పొరపాటు జరిగింది. కేశవన్నయ్య ఆరా తీస్తాడు" అంటూ ఓదార్చసాగింది రుక్మిణి.

అప్పటికే ఇంటినౌఖర్లూ, గుమస్తాలూ, శ్యామసుందర్ అంతా అక్కడ గుమి గూడారు.

"ఒక వేళ రాత్రి ఎక్కడైనా పడు కున్నాడేమో పనుండి. ఏవూ రైన వెళ్ళాడో?" అన్నాడు శ్యాం.

"ఎంత రాత్రైనా ఇల్లువదలి ఎక్కడా వుండడు, అసలు అన్నయ్య. అంతగా చెప్పుకోదగిన స్నేహితులూ, బంధు వులూ లేరీ ఊళ్ళో. చెప్పకుండా ఏ

వూరూ వెళ్ళడు" అంది ఇందిర వెక్కెక్కి ఏడుస్తూ.

"అయినా ఆ అనుమానాలు దేనికీ; నాన్నగారు రమ్మన్నట్టుగా ఎవరో తీసుకెళ్ళారని చెప్తోందిగా?" అంది రుక్మిణి.

అప్పుడే నిద్ర లేచి కళ్ళు నులుపుకుంటూ వచ్చింది మాధవి. "ఏమిటే రుక్మిణీ గొడవ ?" అంటూ.

అంతా విని "అయ్యబాబోయ్, మాష్టారు చాలా అమాయకు లన్నయ్యా. వెళ్ళి చూడవూ ?" అంది మాధవి.

"ఎక్కడికి వెళ్ళమంటావ్" తీక్ష్ణంగా చూచి కసిరింది మాధవితల్లి ఆదిలక్ష్మి. "ప్రొద్దున్నే పాచివాకిట్లో ఏడుపులూ. మొత్తుకోళ్లూను" అని విసవిసా లోనికి వెళ్ళిపోతూ "ఓసారిలా రా అబ్బాయ్" అంది.

అందరూ ముఖముఖాలు చూచుకున్నారు.

"వస్తానులే" అన్నాడు కేశవరావు ముఖం మరోవైపుకు త్రిప్పుకొని. నలుగురిలో తల్లి ప్రవర్తనకు అతడు కుంచించుకుపోయాడు.

ఇందిర ఏడుపు మానేసి ఒక్కసారి ఆదిలక్ష్మివైపు, మరోసారి రుక్మిణి వైపూ చూచింది. "ఇక మనం వెళ్దామా రుక్మిణీ ?" అంది.

వెళ్ళి మన మేం చెయ్యగలం?" అంది రుక్మిణి.

"పోలీస్ రిపోర్టిద్దాం. చిన్నన్నకు వైరిస్తే రేపటి కొచ్చేస్తాడు. రా" అంది.

కేశవరావు హృదయం ఆర్ద్రమైంది. ఇందిర చాలా తెలివైనదీ, అభిమానవంతురాలూకూడా నని గ్రహించాడు.

"చూడమ్మా. నేనుండగా మీ కేం భయములేదు. ఆ ప్రయత్నాలన్నీ నేను చేస్తాను. నువ్వెక్కడకీ వెళ్ళొద్దు. మా అమ్మగారి తరహాయే అంత. పట్టించుకోకూడదు" అని చెల్లెలివేపు తిరుగుతూ "ఏం మాధవీ, అలా చూస్తూ నిల్చుంటావ్ ? అమ్మాయిని లోపలికి తీసికెళ్ళి కాఫీల సంగతి చూడు."

పెద్దవాళ్ళు యేడవటం మాధవి ఎప్పుడూ చూడలేదు. కనీసం చూచినా ఆమెకు ఎలా ఓదార్చాలో తెలియదు. కదలకుండా అలాగే నిల్చుంది.

సరోజిని కలుగజేసుకొంది. "రామ్మా లోపలికి వెళ్దాం. ఆయన చూస్తారులే ఆ విషయాలన్నీ. రా రుక్మిణీ నువ్వుకూడా."

ఇందిర చెయ్యి మృదువుగా విడిపించుకుంది. "వద్దండీ. ఇంటిదగ్గర మా అమ్మ, అక్కయ్యా చాల ఖంగారు పడ్తున్నారు. నన్ను వెళ్ళనివ్వండి."

సరోజిని భర్తవైపు తిరిగింది. "ఏమండీ, ఒకపని చేస్తే ? మీరు కార్లో వెళ్ళి వాళ్ళనుకూడ ఇక్కడకు తీసుకొచ్చేయండి. ఇంత జరిగాక ఆడవాళ్ళొక్కళ్లా వుండటం మంచిది కాదేమో నన్పిస్తోంది."

"అవును. అదే నాకూ మంచి

దన్పింస్తోం దబ్బాయిగారూ ?" అన్నాడు గుమస్తా.

"సరే అయితే. నేను కార్లో తీసుకొస్తాను. వెళ్ళమ్మా యిందిరా. నువ్వు లోపలి కెళ్ళు." అంటూ బయల్దేరాడు. ఇహ ఇందిర తృణీకరించలేకపోయింది.

"బహుశః వాళ్లు నిన్ను నమ్మరేమో. నేనూ వస్తా నన్నయ్యా." అంటూ రుక్మిణికూడ బయల్దేరింది.

"ఉండు. కాస్త నేనా నైట్ డ్రెస్ మార్చి వస్తాను. నువ్వీలోగా హాల్లో ఫోనుదగ్గర కెళ్ళి పోలీస్ స్టేషన్ కి రింగప్ చెయ్యి." అని మేడమీదకెళ్ళాడు కేశవరావు. కేశవరావు దుస్తులు మార్చి క్రింది హాల్లోకి వస్తూండగా తల్లి ఎదురు వచ్చింది.

"ఎందు కబ్బాయ్ మన కీ లేనిపోని గొడవ లన్నీ, జిడ్డు రాసుకోవడం ?"

"మనుషులకు మంచితనం ప్రధానం గనుక;" అంటూ వెళ్ళబోయాడు.

అక్కడే ఉన్న శ్యామసుందర్ "అయినా యీ తండ్రీ కొడుకులకు ఆ బడిపంతులమీ దంత అభిమాన మేమిటో నాకు బోధ పడటంలేదు." అన్నాడు తల గోక్కుంటూ.

తీక్షంగా చూచాడు కేశవరావ్. "నీ కనవసరం. అన్ని విషయాలలోను కలుగ జేసుకోకు." అంటూ సాగిపోయాడు.

జానకమ్మ ముందు ఒప్పుకోక పోయినా, రుక్మిణి బోధపరచిన తర్వాత కాదనలేకపోయింది. కాలేజీలో అతడి కొచ్చిన గొడవ లన్నీ కేశవరావుకూడ వివరించి చెప్పాక, యేమో నాయనా, నాకేం తెల్సు, అవన్నీ ? నా కొక్క ముక్క చెప్పలేదు.'' అంటూ కళ్ళు తుడుచు కొంది.

''మరి మీరు త్వరగా వస్తే నేనింకా వూళ్ళో కెళ్ళి ఆరాలు తియ్యాలి. పోలీస్ స్టేషన్ లో ఫోన్ చేశాను. అయినా మళ్లీ నేనుకూడా స్వయంగా వెళ్ళి సబిన్స్పెక్టరుతో మాట్లాడ దల్చు కున్నాను." అని తొందర చేశాడు కేశవ్.

"అమ్మాయ్. వీ ళ్ళేకులస్థులే?" అని చాటుగా అడిగింది జానకమ్మ రుక్మిణిని. ఎంతనెమ్మదిగా అన్నా కేశవరావుకు విన్పించా యీ మాటలు.

"చావు బ్రతుకులలో కూడా మూఢాచారాలు, తెలివితక్కువ పట్టింపులూను" అని లోలోన నవ్వుకున్నాడు.

"బ్రాహ్మలే. వాళ్ళమ్మగారికి కూడా నీలాగే చాలా ఆచారాలూ, గొడవానూ." అని రుక్మిణి నచ్చచెప్పాక బయల్దేరింది జానకమ్మ.

"ఏలోటూ రానివ్వద్దు. జాగ్రత్తగా చూచుకో సరోజినీ" అని పాణికుంటుం బాన్ని ఒప్పగించి మళ్ళీ వూళ్ళోకి బయ ల్దేరాడు కేశవ్. ఆదిలక్ష్మి యేదో మర్యాదకు పలుకరించి రెండు సానుభూతి వాక్యాలు పలికి వెళ్ళిపోయింది. ఎటొచ్చీ మాధవ్ కి మరీ సంకటగావుం దా వాతా

వరణం. ఎప్పుడూ నవ్వుతూ త్రుళ్లుతూ అల్లరిచేసే ఆ పిల్లకి దిగాలుపడి విచార వదనాలతో కూర్చున్న వాళ్ళముందు జపంచేస్తూ కూర్చోవడం చాల కష్టంగా వుంది. అక్కడినుంచి తప్పించుకు పోదామంటే వదిన కోప్పడుతుందేమో. అన్నయ్యతో చెప్తుందేమో ననే భయం.

అతి బలవంతంమీద కాఫీపలహారాలు తీసుకున్నారు ఇందిరా, పద్మా. జానకమ్మ తీసుకోలేదు.

"అమ్మకు స్నానం, పూజ....చాల గొడవ లున్నాయిలెండి. ఇంటికి వెళ్లాక చేస్తుంది" అంది ఇందిర.

"అయ్యో, ఇదేం పరాయిచోటా, సందేహిస్తారు? లేవండి. స్నానాలగది చూపెడ్తాను," అంది సరోజిని.

"వద్దమ్మా. నాకు స్నానం...పానం యేమిటి? నా బిడ్డెక్కడున్నాడో? ఎలా గున్నాడో? నాకడుపు తరుక్కు పోతూంది." అంటూ కళ్ళనీళ్ళు పెట్టు కొంది జానకమ్మ.

"ఫర్వాలేదు. ఎక్కడో బాగానే వుంటారు" అని రుక్మిణీ, సరోజినీ చాలా సేపు నచ్చజెప్పారు.

కడకు సరోజని — "ఇటువంటప్పుడు పట్టింపులు పెట్టుకొంటే ఎలా చెప్పండి? కొంచెం కాఫీ అయినా తీసోండి. అసలే రాత్రంతా నిద్రలేదు. నీరసం వొస్తుంది" అని బలవంతంగా కాఫీ త్రాగించింది.

ఇక జానకమ్మ మాట్లాడకుండా త్రాగే సింది. 'నల్గురితో కలసి తిరిగే వాళ్ళం మాకు పట్టింపులు కుదరవు. నీకు కుదుర్తా యేమో కాని' అన్న కొడుకు మాటలు జ్ఞాపకం వచ్చి కళ్ళు తుడుచుకుంది. 'నిజమే! నల్గురిలోకి వస్తే కలిసిపోక తప్పదు!'

"మీరేం చదువుతున్నారు?" అని అడిగింది సరోజిని పద్మను.

"ఏదో కొద్దిగా. ఇప్పుడేం చదవడం లేదు" అనేసింది పద్మ.

(సశేషం)

ఆద్యంతం ఈ నవల యందలి పాత్రలూ సంఘటనలూ కేవలం కల్పితాలు. యదార్థం కావనీ ఎవరినీ ఉద్దేశించి వ్రాయబడ లేదనీ గ్రహింప ప్రార్థన.

—రచయిత్రి

Printed and Published by Sri. A. Sudhakar Rao from Yuva Press, 5-9-88, Public Garden Road, Hyderabad-1. Controlling Editor Sri "CHAKRAPANI".



# సస్యభూమి - సమరభూమి

సస్యభూమిలో శాంతరసలాస్యం సమరభూమిలో రుద్ర తాండవం ఇంత వ్యత్యస్తం మరి ఏ రెంటిలోనూ కనబడదు. సస్యభూమికీ, సమరభూమికీ సంబంధం ఏమిటి అని మీరు అనవచ్చు. వాటికి చాలా సంబంధం ఉంది — కాదు సాన్నిధ్యమే ఉంది ఈ నాడు. సమరభూమిలోని సైనికుని సింహనాదం సస్య భూమిలోని కర్షకునికి వినబడుతోంది. ఒకరికొరకు ఓజస్సును అందించుకుంటున్నారు.

అత్యయిక పరిస్థితి కారణంగా, వ్యవసాయికోత్పత్తికి మరింత ప్రాధాన్యం వచ్చింది. వర్తమాన (1963–64) సంవత్సరానికి మన రాష్ట్రంలో కృషి కార్య క్రమాలకుగాను వ్యయం నూటికి ఏభయి వంతులు హెచ్చింపబడింది. ముఖ్యమైన పంట లన్నిటికీ పాకేజీ పథకం అమలు జరపడానికి నిశ్చయింపబడింది.

ప్రణాళికా బద్ధమైన ప్రగతి
రక్షణ సన్నాహంలో అంతర్భాగం,

స. పౌ. సం. శా. ఆం. ప్ర.

YUVA (Monthly) SEPTEMBER 1963 Regd. No. A-

# చందమామ

కథల మాసపత్రిక



చందమామ అందరూ చదువుతారు

★

చందమామ పబ్లికేషన్స్

మద్రాసు - 26